
కౌసల్య ప్రొడక్షన్స్ వారి
మంచిరోజులు వస్తాయి
పూర్ణా రిలీజ్
దర్శకత్వం:
G. విశ్వనాధం
రచన:
ఆరుద్ర
సంగీతం:
కోదండపాణి
నిర్మాతలు:
S. భావనారాయణ
P.C. బాలకృష్ణరాజు
REVATHI


తప్పక
చూడండి!
ప్రసాద్ ఆర్టు పిక్చర్సు చిత్రం
పునర్జన్మ
నవయుగ
నిర్మాత... ఎ.వి.సుబ్బారావు ✣ స్క్రీన్‌ప్లే-దర్శకత్వం... కె.ప్రత్యగాత్మ
NVKB

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

# ఉత్తరాలు

## కథలు

"పాలపొంగు" అనే కథ నాకు నచ్చినది. తొందర వల్ల ఏదో పని చెయ్యడం, దానిని గురించి తర్వాత బాధ పడటం చక్కగా విశదీకరించారు.

డి. రామారావు (మద్రాసు)

* * *

"ముగ్గురు ప్రేమికులు" కథ చదివింతర వాత ఒక గంటసేపు మరే కథా చదవలేకపోయాను. కథ లన్నింటిలో ఒక విశిష్ట స్థాన మాక్రమించ గల ఆ కథను వ్రాసిన శ్రీ "ఆదివిష్ణు" గారికీ, ప్రచురించిన మీకూ అభినందనలు తెలుపకుండా ఉండలేక పోతున్నాను.

వేల్పుచర్ల సురామరావు (గుత్తి)

* * *

"కన్నీటిబొట్లు" కథానిక చదివిన పిమ్మట పాఠకులు కూడ పేరుకు తగినట్లు కన్నీటిబొట్లను రాల్చుడమైనది. ముగింపు హృదయాన్ని పిండి చేసినది ఈ కథానిక మనసును వికలము చేసినదంటే అతిశయోక్తి కాదనుకుంటా.'

కె. భార్గవి (తిరుపతి)

* * *

శ్రీ మృదంగగారు రచించిన 'తొలగిన స్వర్గం' కథ చాలా బాగుంది. చకచకా చదివి పకపకా నవ్వు కున్నాము. కథంతా చాలా సరదాగా ఉంది. రచయితగారు 'తొలగిన స్వర్గం' అనే పేరు లేకుండా "అందిన స్వర్గం"(విష్ణుప్రియ) "తొలగిన నరకం' (ఆఫీసులో ఉద్యోగం) అని పేరు పెడితే చాలా బాగుండును. కృష్ణారావు ఉద్యోగం వూడిపోగా ఇకముందేం చేస్తాడు? పాపం కృష్ణారావు! జాలి కలిగింది!

విజయసాయి (అవకాపల్లి)

## అవీ యివీ అన్నిలో పొరపాటు

తమ 2—8—1963 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 'అవీ ఇవీ అన్నీ' శీర్షికలో ప్రచురించిన కన్నడ చిత్రములో పిఠాపురము యువరాజా గానం అనే విషయము పొరపాటని గుర్తించ ప్రార్థిస్తున్నాను. దేశరాజా ప్రొడక్షన్సువారు తీయుచున్న కన్నడ చిత్రము తాలూకు ఒక శ్లోకము రెండు పాటలు పాడినది నేను, నా పేరు మోహనకృష్ణ తమరు ప్రచురించినట్లుగా మోహన్‌కుమార్ కాదని గమనించకోరుచున్నాము.

నేను శ్రీ పిఠాపురము మహారాజావారి మనుమడును. శ్రీపిఠాపురము యువరాజావారికి మేనల్లుడును అగుదును కనుక నన్ను "యువరాజా" అని సంబోధించుటకు ఏ విధమైన హక్కు, ఆస్కారము లేదు. అందుచేత ఈ పొరపాటు ప్రకటనవలన శ్రీ పిఠాపురము యువరాజావారు నన్ను, దేశరాజా ప్రొడక్షన్సువారిని, పత్రికవారిని కూడా అపార్థము చేసుకొనుటకు అవకాశము ఉన్నది కనుక ఈ ప్రకటనను పై విధముగా సవరించి, తమ తదుపరి పత్రికలో ప్రకటించ ప్రార్థిస్తున్నాను. ఇట్లు

మోహనకృష్ణ.

* * *

## మరువలేని మనిషి

'మరువలేని మనిషి' మిగుల పాఠక రంజితముగ నుంటున్నది. 2—8—63 సంచికలో ప్రచురితమైన కుమారి నాజ్ వ్రాసిన 'మరువలేని మనిషి' నన్ను ఎనలేని ఆనందసాగరమున ముంచినది.

అట్లూరి శర ˜బాబు (విజయవాడ)

## చదువుల్రావు

మీరూ చదువుల్రావుగారు ఆవకాయలో మునిగి వచ్చారని తెలిపారు. సాధారణంగా అవకాయ జాడీని పోస్టులో పంపరు. అందువల్ల చదువుల్రావుగారు ఆవకాయలో స్నానం చేయడానికి మీ రన్నట్లు అవకాశం లేదేమో! కాస్త ఘాటుగా కనిపించడానికి ఆయనే ముంచి పంపారేమో! ఏది ఏమైనా నిజం! 'చదువుల్రావు' శీర్షిక అవకాయ అంత ఘాటుగా ఉంటున్నది.

సురేఖ (శ్రీకాకుళం)

## కార్టూన్

26—7—63 తేది పత్రికలో 44 వ పేజీలో ప్రచురించిన కార్టూన్ చాలా అసభ్యంగా ఉంది. ఎంత చదువుకొన్న అమ్మాయైనా ఆ కార్టూన్‌లో ఉన్న విధంగా వూహించుకొనదు. ఇంకా చాలా కార్టూనులు ఈవిధంగానే వేస్తున్నారు. ఇలాంటి కార్టూనులు, కథలు చదివి అమ్మాయిలంతా ఆవిధంగానే తయారయితే ఎలా ఉంటుందో వూహించండి. కనుక దయచేసి ఇక మీదట మరీ అలాంటి కార్టూనులు, కథలు పంపవద్దని సోదర మహాశయులకు, ప్రచురించవద్దని ఎడిటర్‌గార్ని కోరుచున్నాను.

సోదరి, చిన్నమ్మగారి ప్రమీలారెడ్డి (చెరుకుపాడు)

## రాజధాని కబుర్లు

26—7—63 వారపత్రిక రాజధాని కబుర్లలో ఐ. ఎల్. ఎన్. గారు సంజీవరెడ్డిగారిని గురించి మూడు కోట్ల అరవై లక్షల మంది కోరుకుంటేనే తాను ముఖ్యమంత్రి నయ్యానని సగర్వంగా చెప్పుకున్నారు..... వాస్తవం తెలుసుకుంటే .... అత్యధిక సంఖ్యాబలం శాసనసభలో తెచ్చుకున్న కాంగ్రెసుపార్టీవారు ప్రభుత్వాన్ని ఏర్పరచటమనేది చట్టరీత్యా సమర్థించ తగ్గది. ఇంతవరకే గాని, ఆంధ్రప్రజలు ఫలానా వ్యక్తికి అధికారాన్ని హస్తగతం చెయ్యాలని శాసించలేదే అన్నారు. ఇది కేవలం ఈర్ష్యతో వ్రాశారా? అనుకోవలసి వస్తుంది. లేనిచో ప్రధాని నెహ్రూగారే తన పదవి నుంచి తప్పుకోవాలని శ్రీ కృపలాని డా॥ లోహియా, శ్రీ మాసాని సగ్గైరాలు కోరినప్పుడు నేను ఇద్దరు, ముగ్గురు తప్పుకోమంటే తప్పుకోను. భారత ప్రజానీకమంతా తప్పుకోమంటే తప్పుకుంటా నన్నారు. భారత ప్రజానీకమంతా వారికి ఆ పదవి నిచ్చారా? లేదే! కాంగ్రెసును మెజారిటీగా గెలిపించింది ప్రజానీకం. కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ ప్రధానిని ఎన్నుకున్నది. అయినప్పుడు ప్రజానీకమంతా తప్పుకోమంటే తప్పుకుంటా ననటం తప్పుదారి చూపడమే. నెహ్రూలాంటి వ్యక్తి అలా మాటాడినప్పుడు, వారి శిష్యుడు ఆంధ్ర ప్రజల ప్రేమాభిమానములను గురించి సగర్వంగా చెప్పుకుంటే అతిశయోక్తి ఏముంటుంది!

[illegible] (ఖమ్మం) ★

## రచయితలకు మనవి

ఆంధ్రసచిత్ర వార పత్రికకు తమ రచనలు పంపేవారు ఈ క్రింది నిబంధనలు గమనించాలి

**కథలు, వనితాలోకం వ్యాసాలు, గేయాలు, కార్టూన్ లు:**

● ప్రచురణకు స్వీకరింపబడని రచనలు త్రిప్పి పంపగోరే వారు వ్రాతప్రతితో బాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు పంపాలి.

● ప్రచురించబడని రచనల విషయమై ఏ విధమైన ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.

● త్రిప్పి పంపబడే రచనల వ్రాతప్రతులు సాధారణమయిన బుక్‌పోస్టు ద్వారా మాత్రమే పంపగలము కాబట్టి రచయితలు దీనికి సరిపడే తపాలా బిళ్లలు మాత్రం పంపితే చాలు. తపాలా బిళ్లలు వ్రాత ప్రతి బరువుకి సరిపోయేట్లు ఉండాలి.

● వ్రాతలు సక్రమంగా రచయితలకు త్రిప్పి పంపే ప్రయత్నాలు అన్నీ చేస్తాము కాని వాటి విషయమై ఏ విధమైన బాధ్యతనీ వహించ లేము

● రచనతో బాటుగా కాక వేరుగా పోస్టేజీ పంపినా వ్రాతప్రతులు తిప్పి పంపబడవు.

**కథకాని కథలు, ఉత్తరాలు, వనితావాణి:**

● ఏ సందర్భంలోనూ పై శీర్షికకు సంబంధించిన వ్రాతప్రతులు త్రిప్పిపంపబడవు.

**నవలలు:**

● ప్రచురణకు స్వీకరించని నవలల వ్రాతప్రతులు పోస్టేజి జతపరచకపోయినప్పటికీ త్రిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని రిజిస్టర్డ్ పోస్టులో త్రిప్పిపంప గోరేవారు రిజిస్ట్రేషన్ ఛార్జికి కావలసిన కనీస మొత్తం (65 నయాపైసలు) వ్రాతప్రతితోబాటే తపాలాబిళ్లల రూపంలో పంపాలి.

● వ్రాతప్రతులు సక్రమంగా త్రిప్పి పంపే ప్రయత్నాలు అన్నీ చేస్తాము కాని ఈ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. అంతేకాక ప్రతుల విషయమై ఏవిధమయిన బాధ్యతనీ వహించలేము.

**మరొక మనవి:**

రచయితలు వ్రాతప్రతి మీదనే తమ పేరు, పూర్తి చిరునామా స్పష్టంగా వ్రాయాలి. లేనట్లయితే ప్రతిఫలం పంపటం కష్టం అవుతుంది.

సం॥

ఆంధ్ర పాఠకులకు అపూర్వ కానుక !
ప్రముఖ గేయరచయితల ఆశీస్సులతో వెలువడింది

# 'భావతరంగాలు'

[గేయ సంపుటి]

రచన : తంగెళ్ళ పాండురంగ శర్మ

మూల్యం : ఒక రూపాయి.

—: ప్రతులకు :—

శర్మా పబ్లికేషన్స్,
10/70, పార్కు రోడ్, విజయవాడ-1.

---

# తెల్లమచ్చలు

తెల్ల మచ్చలకు 'స్వేతరి' ఉత్తమ ఔషధము (బొల్లి) ప్రచార నిమిత్తం 15 దినముల మందు ఉచితముగా పంప బడును. వ్యాధి పూర్తి వివరాలతో యింగ్లీషు లేక హిందీలో వ్రాయండి.

Sri Krishna Chandra Vaidya,
(A.P.) P. O. Katrisarai (Gaya).

---

పండిత
డి గోపాలాచార్యులవారి

# జీవామృతం

ఆరోగ్యానికి బలానికి

ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్
మద్రాసు-17

---



ఆడుతున్నా
లేక



విశ్రమిస్తున్నా...
వారు సర్వదా
పెరుగుతూనే
వున్నారు!



# కల్జానా-డి

విటమిన్ తో బలవర్ధకమైన కాల్షియం

ఆశించే తల్లులకు, పిల్లల్నిపెంచే తల్లులకు, పెరిగే శిశువులకు

శైశవదశలో పిల్లలు వేగంగా పెరుగుతారు. ఆ సమయంలో, బలమైన పళ్లు, ఎముకలకోసం, జీవితానికి కావలసిన బలంకోసం పిల్లలకు కల్జానా-డి కావాలి. అందేకనే మీరు మీ పిల్లలకు పెరిగే సమయంలో కల్జానా-డి ఇవ్వాలి. పసందైన రుచిగల కల్జానా-డి, విటమినులతో బలపడిన పరిశుద్ధమైన కాల్సియం... అంటువ్యాధులను ఎదుర్కొనడంలో, కాల్సియంను మరింత బాగా వంటికి పట్టించడంలో, అద్భుతమైన ఆవశ్యకత్వాలు ఇవ్వడంలో సాయపడుతుంది. మీ బిడ్డలకు కల్జానా-డి ఇవ్వండి. కొత్త శక్తి, ఉత్సాహాలతో వారు ఆడు కొనడం చూడండి.

GR.KD.60.TEL.

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం: 23—8—63
శోభకృన్నామ సం॥ భాద్రపద మాసం॥ శుద్ధ చవితి
సంపుటము 55 సంచిక : 51

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ


## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 13.00 ఇతర దేశాలు: ఓడమీద (Sea Mail) రు. 20.00 (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50 ఆస్ట్రేలియా 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*


ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1




విఘ్నేశ్వర పూజ

# మనలోమాట

వినాయక చవితి ఆంధ్రసచిత్ర వారపత్రికకు ముఖ్యమయిన పండుగ! ఈ పత్రిక 1908లో గణేశ నవరాత్రులలో స్థాపించబడినది కాబట్టి వినాయక చవితి ప్రత్యేక సంచిక ఒక విధంగా ఆంధ్రసచిత్ర వారపత్రిక జన్మదిన సంచిక!

ఈ వారం ఆంధ్రసచిత్ర వారపత్రికలో మామూలు కన్నా ఎక్కువ కథలు, కార్టూన్‌లు, సినిమావార్తలు, శీర్షికలు వేస్తున్నాము అయినా వినాయక చవితి సంచికలో హాస్యరసానికే ప్రాముఖ్యత ఇచ్చాము.

పాఠకులందరికీ మా హృదయపూర్వక శుభాభినందనలు.

* * *

'పారిస్ వింతలు' వ్యాసం రచయిత శ్రీ హరినారాయణగారు మద్రాస్‌లో ఎం. ఎ. (కెమిస్ట్రీ), బి.ఎస్.సి. (టెక్నాలజీ) చదివి మద్రాసు మ్యూజియంలో ఉద్యోగం స్వీకరించారు. 'మ్యూజియాలజీ' పరిశోధనకని పారిస్‌లో సుమారు పది నెలలపాటు గడిపారు వ్యాసంలోని ఫొటోలు కూడా ఆయన తీసినవే!

* * *

ఈ మధ్య వచ్చే కథలలో 'వివాహం' వస్తువుగా ఉండేవి ఎక్కువగా వస్తున్నాయి! పెళ్ళిళ్ళ 'సీజన్' ఇంతకు ముందే ముగిసింది కాబట్టి ఇందులో ఆశ్చర్యపడవలసినది ఏదీ లేదేమో......

## లోకంపోకడ



ఇదిగో యీ చెక్కు పుచ్చుకుని నాకు వోట్లు సంపాదించి పెట్టు!

# విషయానుక్రమణిక


కథలు :

| | | |
|---|---|---|
| ప్రజాసేవకుడు | — | 10 |
| ఇంటర్వ్యూ | — | 12 |
| నీలివర్ణపు శాపం | — | 14 |
| వధూటి | — | 16 |
| ప్రేమాయణంలో కొత్తబాణీ | — | 24 |
| కళ్యాణ కింకిణి | — | 36 |
| అప్పల నరసయ్య | — | 38 |
| నా కథ | — | 71 |

సీరియల్ కథలు:

కొలంబా — 26, ప్రేమకు పగ్గాలు — 52, వంటగది వీరుడు — 59.

శీర్షికలు, వ్యాసాలు, సినిమా:

ఉత్తరాలు—3, వినాయక ప్రశస్తి—6, రాజధానికబుర్లు — 7, ఊపెన్ కార్ట్యూన్ — 8, మ్యాథల్లీలేఖ — 9, ఆలిండియా రేడియో తాజా వార్తలు—19, సరాగమాల—20, నా అనుభవంలో కెల్లా పెద్ద పరిశోధన (18) — 23, వనితాలోకం — 28, పారిస్ వింతలు — 32, వారఫలాలు — 42, తెరమీద—తెరవెనుక — 44, మీ రాజకీయ పరిజ్ఞానం ఎంత? — 47, తారల కొలువు — 48, కథకాని కథ — 51, సినిమా — 87,



శ్రీ వినాయకుడు, విఘ్ననాయకుడు, అని కొనియాడుతూ సంకల్ప సిద్ధికై సకలజనులు పూజలుచేసే గణాధిపతి, దేవగణాలన్నింటికి అధినాయకుడంటారు. ఈ ముక్కోటి దేవతల దేవుడైన విఘ్నేశ్వరుడు ఆంధ్రసచిత్ర వార పత్రికకు ప్రత్యేకించి ఇష్టదైవం. నేటికి ౫౫ సంవత్సరాల క్రితం ఈ గణపతి నవరాత్రి ఉత్సవ సందర్భంలోనే శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రసచిత్ర వార పత్రికను స్థాపించారు.

ఏనుగు మొహం ఎలుక వాహనం గల ఈ బొజ్జ దేవుడు కార్తికేయుని సోదరుడైనట్లు పురాణాలలో ఉన్నది. గజాసురుడనే రాక్షసవధ అనంతరం శివుడు; పార్వతి నలుగుపిండితో చేసుకున్న ముద్దుల బిడ్డడని తెలియక, వినాయకుణ్ణి చంపడం—తర్వాత గజాసురుని తుది కోరికయైన 'లోకపూజ్యత' కోసరం ఆ ఏనుగు తలను విఘ్నేశ్వరుని కిచ్చి, 'ముల్లోకాల పూజింపబడుమని' త్రిమూర్తులు ఆశీర్వదించడం జరిగినట్లు లోకోక్తి. అలాగే ఆటు తర్వాత మూషికాసురుడనే రాక్షసుణ్ణి వధించడంలో వినాయకుడు ఏకదంతుడవడమేగాక, మూషిక వాహనుడు కూడా అయాడన్నది కూడా పురాణగాథే! వినాయకచవితినాడు పూజచేసి, అక్షింతలు వేసుకొనినదే చంద్ర దర్శనం చెయ్యకపోవడం ప్రజల నమ్మిక. అలా చేస్తే నీలాపనిందలు వస్తాయన్నది ద్వాపరయుగ పురుషుడైన శ్రీ కృష్ణుడే ఋజువు చేశాడు. శమంతకమణిని శ్రీకృష్ణుడే దొంగలించాడనే అపనింద రావడం దరిమిలాన ఆతగాడు సిద్ధి వినాయకుని పూజ చేయడంవల్ల శమంతకమణిని, సత్యభామను కూడా పొందగలగడం ప్రజలలో భక్తి శ్రద్ధలనేగాక, కుతూహలాన్ని పెంకొల్పే గాథ! శ్రీ వినాయక నవరాత్రి ఉత్సవాలు, దేశవ్యాప్తంగా జరుగుతాయి. బీదలు, సాదలు కూడా ఈ దేవుణ్ణి పూజ చేయొచ్చు. కారణం ఒక్కటే, ఏ 'ఆకూ అలమూ' అయినాసరే, "పూలూ పత్రీ" అంటారు. ఈ దేవుణ్ణి పూజ చేయొచ్చును. వినికి నైవేద్యం కూడా, కుడుములూ, ఉండ్రాళ్ళూను. వినాయకచవితి, వినాయకపూజ అతి ప్రాచీనమైనదిగ తెలుస్తున్నది. బౌద్ధులు, జైనులు కూడా, ఈ ఏనుగుతల దేవుణ్ణి ప్రతిపత్తి ఇచ్చి చూశారు. బౌద్ధులు ఈ 'దేవుని మూర్తి'ని దూర ప్రాచ్య ప్రాంతాలకు, ఇండొనీషియాకు తీసుకు వెళ్ళారట! శ్రీ గణపతిని భక్తి శ్రద్ధలతో పూజించే వారికి సంకల్పసిద్ధి తథ్యమన్నది అందరి విశ్వాసము. విద్యలకు, బుద్ధులకు ఒజ్జ అయిన ఈ దేవుడు సకల జనులకు శుభముల నిచ్చుగాక. ఈ ప్రత్యేక సంచిక సందర్భంలో పాఠకులకు మా శుభాకాంక్షలు.

# మేయర్ పదవి నిర్ణయానికై తెరచాటు కీచులాట?

ఈ వారంలో అన్ని హాస్యాలూ, అపహాస్యాలూనూ 150 మందికి పైగా, పింఛనుదారులు, తమ పింఛను నిర్ణయం కావటానికి పూర్వమే తనువులు చాలించారు. ఓ మూల బంగారం మీద భారీ ఎత్తున దాడి జరుగుతూ ఉంటే, చిత్తూరు అనంతపూర్ జిల్లాలలో తమ కింకా అస్తిత్వం ఉన్నట్లు, బంగారపు గనులు వెల్లడి చేసుకున్నాయి. అత్యవసర పరిస్థితి ప్రారంభమయినప్పటి నుంచి, 1963, జనవరి వరకు, తిరుగుళ్లకుగాను, ఆంధ్రప్రదేశ్ మంత్రి వర్యులు ముప్పయి ఆరువేల రూపాయలను సద్వినియోగం చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగును అధికార భాషను చెయ్యమని పెట్టిన తీర్మానాన్ని నిరాకరించటం జరిగింది. శాసన సభలో అయితే ఏ భాషలోనైనా సరే మాట్లాడటానికి అనుమతి దొరికింది. ఏటేటా పదిశాతం చొప్పున రిక్తాలను తగ్గించాలని కేంద్రం వారి సూచన, (అయితే హైదరాబాదులో మాత్రం, దానికి కేవలం విరుద్ధంగా జరుగుతుంది.), ఏజెన్సీ ప్రాంతాలలో చదువుల మీద ఆసక్తి ఉన్న విద్యార్థులకు, రాష్ట్రంలో ఉన్న యూనివర్సిటీకి వెళ్ళినా, మా ప్రాంతానికి సంబంధించిన వారుకాదని, ఉన్నత చదువులకు ప్రవేశం ఇవ్వలేదు. ఇవి అసెంబ్లీ సమావేశాల్లో బైటపడ్డ కొన్ని చిత్ర విచిత్రాలు.

ఇక బైట చూడబోతేనో! ముఖ్య మంత్రిగారి గుణగణ విశేషాలను పరిపాలనా సామర్థ్యాన్ని పొగడుతూ వస్తున్న కార్యక్రమాల పరంపర ఇంకా ముగియలేదు. ఈ పనికోసం, మైసూరు ముఖ్య మంత్రి కూడా, తమ ఇతర కార్యక్రమాలన్నింటినీ కూడా పక్కకు నెట్టేసి ఇక్కడకు విచ్చేశారు. ఢిల్లీలో రాజీనామా ఇచ్చిన యస్. కె. పాటిల్ మంత్రి, తిరిగి మళ్లీ అదే హోదాలో హైదరాబాదు వచ్చి తియ్యగా పంచదార పంపిణీగురించి దక్షిణ ప్రదేశంలోని రాష్ట్రాల మంత్రులతో మంతనాలు జరిపారు. ఈ మధ్య జరిగిన కాంగ్రెసు సభ్యత్వపు నిజాయితీ విచారణలో, ఇద్దరు రాష్ట్రమంత్రులు కూడా కాంగ్రెసు ప్రాథమిక సభ్యత్వాన్ని కోల్పోయారని వెల్లడయింది. విశాల హైదరాబాదుకు మేయరు పదవి నిర్ణయించటానికి రాష్ట్ర మంత్రులలో పెద్ద ఎత్తున, తెరచాటున కీచులాట జరుగుతోందని వినికిడి. పై నెలలో మేయరు, డిప్యూటీ మేయరు పదవులకు ఎన్నిక జరుగుతుంది. ఈ తడవ, కేవలం హైదరాబాదు ప్రాంత కౌన్సిలర్ మాత్రమే మేయరు పదవికి పోటీకి అర్హుడు. సికింద్రాబాదు నుంచి, డిప్యూటీ మేయర్‌ను ఎన్నుకుంటారు. చట్టరీత్యా, ఇలాంటి ప్రాంతాల వారికే కేటాయింపు లేకపోయినా, అనుశ్రుతంగా వస్తున్న ఆచారం. గత పదిహేనేళ్ల బట్టి కాంగ్రెసు గోత్రీయులకు అండ దండలుగా నిలబడుతూ వస్తున్న జోడెద్దు ఈ నాటికి రంకెవేసి ప్రభుత్వానికి ఎదురు తిరిగినాయి.

హైదరాబాదు పట్నంలో ముఖ్య వీధుల్లో స్వైర విహారం చేస్తూ, రెండెద్దు కలిసి మెలసి బండ్ల అసరాతో, పెళ్లివారి పూరేగింపులాగ సాగి పోయినాయి. తమ స్వేచ్ఛా విహారానికి అడ్డు పెడుతున్న అధికార దుర్వినియోగాన్ని తీవ్రంగా ఖండిస్తూ, తమ నిరసనను బాహాటంగా వెల్లడి చేసినాయి. ఇక్కడ వెల్లడయిన జనాభా లెక్కల ప్రకారం, గత దశాబ్దంలోనూ, నాటికి పది హేను వంతుల జనాభా, మన రాష్ట్రంలో మొత్తం మీద పెరిగింది. హైదరాబాదు జిల్లా, జంట

93—వ పేజీ చూడండి



మాక్స్ ముల్లర్ భవనానికి ఈనెల 5వ తేదీన ప్రారంభోత్సవం చేసిన తరువాత గవర్నర్ శ్రీ ఎస్. ఎం. శ్రీ నగేష్ 'అతిథుల పుస్తకం'లో చేవ్రాలు చేస్తున్నప్పటి చిత్రం. (ఎడమ నుంచి కుడికి) కాన్సల్ ఫిషర్, జనరల్ ఎస్. ఎం. శ్రీనగేష్, ముఖ్యమంత్రి డా॥ ఎన్. సంజీవరెడ్డి, మాక్స్‌ముల్లర్ భవన్ డైరెక్టరు డా॥ సిమన్స్.



మళ్లీ ఒక మహాత్ముని పిలుపు...!
సేవాశిఖరానికి పదవీత్యాగమే మార్గం...!
పేదకళాపి సన్మానం...
17వ సూత్ర సవరణ (నీళ్లు)
ప్రాథమిక హక్కులు (పాలు)
కాశ్మీరు సమస్యకు పరిష్కార మార్గం:
OOMMEN

శ్రీకృష్ణ

# కేంద్రరాజధానిలో వానలు పాటిల్ రాజీనామాలాంటి తుఫానులు!

అమ్మయ్య! చివరికి ఢిల్లీ నగరంలో కూడా వానలు కురుస్తున్నాయి. అసలీ వారంలో దాదాపు అన్ని రోజులపాటు వాన కురుస్తున్నదనే చెప్పవచ్చు. నీటి కరువు తొలగిపోయింది. కానీ, ఏం లాభం. ఇప్పు డున్నట్లుగానే ఇంకా కొంతకాలం సాగితే వరదలు వచ్చేందుకు ఎక్కువ రోజులు పట్టక పోవచ్చు.

ఓస్ వరదేమిటి! ఈ వారంలో పెద్ద తుఫానే వస్తే! కంగారు పడకండి. ఇది 'టీకప్పులో తుఫాన్.' ఒకానొక్క శుక్రవారం సాయంత్రం 4 గంటలకల్లా పెద్ద ఆటంబాంబులాంటి వార్త వచ్చింది. తనకు గుల్జారీలాల్ నందాకు పడటం లేదని కేంద్ర ఆహార వ్యవసాయమంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ రాజీనామా చేశారని అన్నారు. శనివారం ప్రొద్దున పదకొండు గంటలకల్లా శ్రీ పాటిల్ రాజీనామా ఆమోదానికి పట్టుపట్ట కూడదనుకున్నార్ట అని ఇంకో వార్త వచ్చింది. ఆదివారానికల్లా పత్రికలన్నీ, కమ్యూనల్ అవార్డు మాదిరిగానే పాటిల్ రాజీనామాను ఆమోదించటంగాని, తిరస్కరించటం గాని జరగలేదటూ అంటూ కథల్లాంటివి వ్రాశాయి. రాజీనామా ఆమోదం మీద పట్టుపట్ట కూడదని శ్రీ పాటిల్ నిర్ణయించుకోటానికిముందుగా ప్రధానమంత్రి వారు వ్రాసిన ఉత్తరంలో ఆహార వ్యవసాయశాఖ మంత్రిగా శ్రీ పాటిల్ చేసిన కృషిని చాలా గట్టిగా ప్రశంసించారని వార్తలు వచ్చాయి. మరి శ్రీ పాటిల్‌ను వ్యవసాయశాఖ వదిలి, అంతటి ప్రాధాన్యమేగల రైల్వేల శాఖను తీసుకో వలసిందిగా సలహా ఇచ్చింది కూడా ప్రధాన మంత్రే!

శ్రీ పాటిల్ విషయంలో ప్రధానమంత్రి అవలంబించిన వైఖరిని దేశీయ పత్రికలలో చాలా భాగం విమర్శించాయి. ఒకవేళ శ్రీ పాటిల్ అనుసరించిన విధానం సర్కైందికాదనుకుంటే, ఆయన రాజీనామాను ప్రభుత్వం ఆమోదించి ఉండాల్సింది ఒకవేళ ఆయన విధానమే ఫలప్రదమైతే, నత్కారి తాలను సాధిస్తున్న స్వర్ణ సింగ్‌నుంచి రైల్వేల శాఖను పూడటికి, ఆశాఖను వ్యవసాయశాఖకు బదులుగా ఈయనకు అప్పగించాల్సినంతటి కారణమేమిటో మరి!

ఇప్పుడు వస్తున్న వదంతులే నిజమైతే, శ్రీ పాటిల్ రాజీనామా పత్రాన్ని ఇంకా అతి పదిలంగా ఎందుకు దాచి పెట్టినట్లో?

అసలీ అంతర్యుద్ధానికి నాంది మొన్న మొన్న జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సమావేశంలో శ్రీ లాలా గుల్జారీలాల్ నందా వ్యవసాయం అభివృద్ధి కార్యక్రమంపట్ల తమ నిస్పృహను వెల్లడించటంతో ప్రారంభమైంది. దీనికి శ్రీ పాటిల్ రెండు రకాలుగా వివరించి సమాధానం చెప్పారు. అందులో మొదటిది భారతదేశంలోని వ్యవసాయమంతా వర్షాలమీదనే ఆధారపడి వుంది. అతివృష్టి, అనావృష్టిలలో దేని వలనైనా వ్యవసాయిక ఉత్పత్తి దెబ్బతినటం ఖాయం.

**వ్యవసాయ అభివృద్ధి అనేది ఉద్యోగ కల్పన అభివృద్ధికి మూరు రూపంగా తయారైపోయిందనీ, తన శాఖకూ, పల్లెలలో పని చేసేందు కుద్దేశించిన సమాజ వికాసాభివృద్ధి, పంచాయతీ రాజ్, నీటిపారుదల, సంఘ సేవా సంస్థలమధ్య ఎలాంటి పొంతనం సహకారం ఉండటం లేదని శ్రీ పాటిల్ తమ సమాధానంలో రెండో కారణంగా చెప్పారు.**

అంతేకాక, వ్యవసాయమనేది రాష్ట్రాలకు చెందిన విషయమని, కేంద్ర బాధ్యతల్లా వివిధ పథకాలకు తగిన సలహాలు, ఆర్థిక సహాయం చేయుటం వరకే నని, వాటిని అమలు జరిపే బాధ్యత ఆయా రాష్ట్రాలదేనని చెప్పారు.

ఇక ఈ మంత్రు లిద్దరి 'ముష్టామష్టి'కి రెండో కారణం ధరలు పెరిగాయి కనుక కంట్రోలు అదుపు) ఏర్పాటు చేయాలా వద్దా అనేది. శ్రీ పాటిల్ కూడా స్వర్గీయ రఫీ అహమ్మద్ కిద్వాయ్ మాదిరిగానే ఈ అదుపులు, ఏ ఏర్పాటుకు ప్రతిఘటించారు. లోగడ ఓసారి ప్రణాళికా సంఘం కంట్రోళ్ళు ఏర్పాటు చేయాలన్నప్పుడు శ్రీ కిద్వాయ్ కంట్రోళ్ళను తీసి పారేశారు. ఆహార ధాన్యాల నిల్వలు లేనప్పుడే ఆయన ఆ పని చేశారు. ఇప్పుడు

— 96వ పేజీ చూడండి



ఢిల్లీలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ సంఘసమావేశంలో తమ పథకాన్ని వివరిస్తూ మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ ప్రసంగిస్తున్నప్పటి చిత్రం : ప్రధాని నెహ్రూ ప్రక్కన కూచుని వున్నవారు : అధ్యక్షుడు శ్రీ సంజీవయ్య ప్రభృతులను కూడా వేదిక మీద చూడవచ్చు.




ఈ కథకాని కథలోని కథానాయకుని పరిచయం చేసే బాధ్యతను అత్యంత జాగ్రత్తగా నిర్వర్తించ వలసిన కారణంగా ప్రత్యక్షరంలోనూ ప్రస్ఫుటించే భావాలకూ సమాజంలోని పోకడలకూ పోలికలు తప్పనిసరి కావలసి రావడం కర్మ గాదు ఖర్మ అనుకోవడం ఎంతో మంచిది.

ఇంతకూ ఆయన పేరు కాళాస్త్రి. కాళ+హస్తి కాళాస్త్రియ్యి చివరికి కాళాస్త్రిగా రూపొందినది. ఈ పేరు నిట్లా ప్రజలు ఇస్త్రీచేసి వేయడం కాళాస్తి దురదృష్టం. ఇది ప్రజారాజ్యం కనుక ప్రజల భావాలకూ ఆలోచనలకూ చేతలకూ అనుకూలంగా కాళాస్త్రి నడుచుకోవాలని తను సంతకం చేసేటప్పుడు సహితం కాళహస్తికి మారు కాళాస్త్రి అనే సంతకం చేస్తుంటాడు. ఆయన ప్రజాసేవా కార్యక్రమానికిదే నాంది వాచకం.

కాళాస్త్రి అచ్చంగా తెలుగు చిత్రాలలో బ్రహ్మదేవుని వలె ఉంటాడు. భేదమంతా తలల సంఖ్యలోనే కానీ వాస్తవానికి కళాస్త్రికి మనిషి కుండ వలసినంత కంటే నాలుగు రెట్లెక్కువ అఖండమైన తెలివి తేటలు ఉన్నాయి. అందుకే ఆయన అచిర కాలంలో ప్రఖ్యాతి వహించిన ప్రజాసేవకుడై అమోఘంగా రాణించ గలిగాడు.

కాళాస్త్రి పూర్వగాథ యెవ్వరికీ తెలియదు. తెలియజెయ్యాలనే ప్రయత్నంలో కాళాస్త్రి విఫల మనోరథుడై పోయాడు. ఆయన ఉద్దేశ్యం ప్రకారం 'ప్రజాసేవకుడు కాళాస్త్రి' అనే పతాక శీర్షికతో ఏ స్థానిక పత్రికలోనైనా కనీసం పది వారాలపాటు ఒక చిన్న తుఫానువలె వ్యాసపరంపర వెలువడాలని. లేదా ఒక జన్మ దినోత్సవ కమిటీ వ్యవస్థీకరించబడి అధమం ఐదు వందల పేజీలతోనైనా అంద చందమైన అచ్చుతప్పులులేని మేటరులో ఒక సుందరమైన సావనీరు వెలువడాలని.

ప్రజలలో ఆ పాటి విచక్షణా శక్తి లేనందువ కాళాస్త్రి కోరిక కోరికగానే నిలిచిపోయింది. ఐనా ఏ పత్రికా విలేఖరియో స్థానిక పత్రిక ఉపసంపాదకుడో కన్పించినపుడు బలవంతంగా ఆయన్ని కాఫీ హోటలుకు తీసుకెళ్లి ఒన్‌బైటు అని సర్వరుకు ఆర్డరిచ్చి తన జీవిత గాథను ఆరంభిస్తాడు.

"ఆ రోజుల్లో మీరు బహుశా పుట్టి ఉండరనుకొంటాను. బొంబాయి మెయిల్ని అమాంతం ఆపేశాము. డి. యస్. పి. బంగళాలో ఐదు నాటు బాంబులు వడేశాము. సెంట్రల్ జైల్లో మాతో గంజితాగిన వాళ్ళేగతి పట్టారో తెలుసా...."

ఇట్లాసాగే ఉపన్యాసం నుండి ఆ యెదుటివాడు ఎంతో ఓపికగా తప్పుకోవడం అసాధ్యం కాగా ఇంతలో ఎవరో తారస పడుతారు.

ఆ వచ్చినవాడమాంతం కాళాస్త్రిని కౌగలించుకొంటాడు.

దేశానికంతా రైతు కామధేనువు వంటివాడైతే, రైతుకు కాళాస్త్రి కల్పవృక్షమవుతాడు.

చింతకాయలపెంట— ఎలగమాను మిట్ట— ?లుంగొడ్ల పల్లె, పూరేళ్లగుట్ట— చిలకల పాలెం జెర్రి పోతులోళ్లూరు, తాటిమాన్లపెంట— కొట్టే వాళ్ల కండిగె పరిసరాల గ్రామాలు సుమారు అరవైదాకా కళాస్త్రి కనుసన్నల్లో మెలిగే జనపదాలు.

కాళాస్త్రి నివాసం చిలకల పాలెం. ప్రస్తుత దేశకాల పరిస్థితుల ప్రభావాను గుణ్యంగా కారణమేదో చెప్పడం కర్తవ్యమైనా చెప్పక తప్పుకోవడమే ధన్యత్వం కనుక ఎలా సంపాదించారో కానీ ఆయనకక్కడ పదెకరాల పొలం ఉంది.

ఆరు వందల ఆవులు మేసే ఆ అడవి పురంబోకును కాళాస్త్రి పట్టా చేసుకొన్నాడు. అంటే ఆ సుక్షేత్రానికి రాజాధిరాజుగా పట్టాభిషిక్తుడైనాడు.

ఎరువుల సారాన్ని నిలవచేసే పథకం క్రింద
ఏడు వందలు—, రొఖ్ఖం— 700—00
నేలను చదునుచేసే స్కీముక్రింద
వెయ్యి 1000—00
మామిడి మొక్కలు ఇత్యాది ఫల
వృక్షముల పెంపకమనే పథకంతో 2000—00
బావి సబ్సిడీ— 750—00
మరో బావికి ఋణం 1750—00
ఇంజనులోను 2000—00
విత్తనాలకు అప్పు 1250—00
రసాయనికవు ఎరువులకుగాను
అప్పు 550—00
ఎద్దులు పట్టుటకు అప్పు క్రింద 960—00
పండిన ధాన్యంమీద అప్పు 1000—00
కో ఆపరేటివ్ సొసైటిలో షేరు
కట్టి భూమినిచూపి 3000—00

వెరసి మొత్తము. 14960—00

అక్షరాలా పదునాలుగువేలా తొమ్మిది వందలా అరవై రూపాయలు ప్రభుత్వం నుండి సంపాదించాడు కాళాస్త్రి. ఆరేండ్ల వ్యవధిలో ఇంత గొప్ప సుక్షేత్రాధిపతియై అంతకంటే పదిరెట్ల ఆదాయాన్ని సంపాదించిన వాడీ ప్రపంచంలో ఉండడనీ ఉండడానికి వీలుకాదనీ అది సంభవమనీ ఆ ప్రాంతీయ ప్రజానీకం వేనోళ్లతో చాటుతూ ఉంటారు.

కాళాస్త్రి ఎంత ఘటికుడో ఎవ్వరికీ తెలియదు. తెలియని రహస్యాలు ఆయన జీవితంలో అసంఖ్యాకాలు.

ఆ మధ్య యేదో ఉప్పుడు బియ్యం, కాదు దంపుడు బియ్యం పరిశ్రమ క్రింద అమాంతం ఒక్క సారిగా ఐదువేలు వచ్చిందంటారు.

ఇట్లా భూమిని దున్నకనే—, ఎరువులు వెయ్యకనే—, బావులు త్రవ్వకనే—, చెట్లు పెట్టకనే, ఎడ్లు పట్టకనే మొలకలు పుట్టకనే వచ్చిబియ్యం,

కాదు కాదు దంపుడు బియ్యం దంచకనే ఇరవై వేల నార్జించిన ఈ విశ్వవిఖ్యాతి పురుషుడు చిల కల పాళెంలో తలలో నాలుకవంటివాడు.

ఆ ఊళ్ళో ఆయన సహాయం పొందని వారు అరుదు.

అల్లం చిన రామయ్య కూతురు పెండ్లి కుదిరింది. ఆ పిల్లకు కన్ను మెల్ల. తెల్లగడ్డ చింపిరయ్య కొడుకు జానకయ్య రత్నంలాంటి కుర్రాడైనా ఐదువేలు కట్నం ఇవ్వంది పెళ్ళాడనన్నాడు. ఆ సంద ర్భంలో కాళాస్త్రి కాలికి బలపం కట్టుకొని, చెరువులో చేపలుపెంచే స్కీము క్రింద—, చేల్లో కోళ్ళు పెంచే పథకం క్రింద—, ఆలమీద కోడెను పెంచే అమాంబాపతు పద్దు క్రింద ఆరువేలు సంపాదించి అందులో ఒక్క రెండువేలు మాత్ర తాను పుచ్చుకొన్నాడు. అతని త్యాగాన్ని గురించి అల్లం చినరామయ్య అడివి పల్లెలంతా చాటించాడంటే ఎందుకు చాటించడు ?

కాళాస్త్రి ఎప్పుడూ ఎల్లవేళలా మల్లెపువ్వు ల్లాంటి పంచలే కడతాడు. చందనం రంగు జుబ్బాలన్నా—, సరిగ వచ్చిన అంగ వస్త్రాలన్నా అతని కమితమైన ప్రీతి.

చిలకల పాళానికి బుంగల గుంటకు పదిమైళ్ళు. బుంగల గుంట తాలూకా కేంద్రం. అక్కడ డిప్యూటీ కలెక్టరుగారి కార్యాలయం కూడా ఉంది. ఆ కార్యాలయాని కెదురుగా ఒక పార్కు. ఆ పార్కులో ఒక సిమెంటు తిన్నె.

కాళాస్త్రిని పట్నం చూడాలంటే ఆ తిన్నె మీదనే చూడవచ్చు. అక్కడాయన అసంఖ్యాకమైన అర్జీలనూ—, పిటిషన్లనూ వ్రాస్తూ ఉంటాడు. ఎప్పుడూ ఆయన చుటూ పది మంది తప్పకుండా ఉంటారు. చిలకలపాళెం పరిసరాల ప్రజానీకంలో ఎవరికేది కావలసి వచ్చినా ఆయనే దిక్కు.

ఆయన ఆపద్బాంధవుడు. ఎంతటి చిక్కులైనా చిటికెలో తీర్చి వేయగల మహానుభావ సమర్థుడు.

కొత్తపాళ్ల కండిగెలో కంపల వెంగయ్య ఒక సందర్భంలో పెద్ద ప్రమాదంలో పడిపోయాడు. ఆయన ఇంటిని అకస్మాత్తుగా రివెన్యూ ఇన్‌స్పెక్టరు గారు సోదా చేశారు. ఎద్దులకని లోను తీశాడు గానీ ఆ డబ్బుతో ఆయన సారా వ్యాపారం ఆరంభించాడు. ఇదే ట్లాగో పసిగట్టిన రివెన్యూ ఇన్‌స్పెక్టరు కంపల వెంగయ్యను గట్టిగా పట్టుకొన్నారు.

అతడెల్లాగో తప్పించుకొని పెరటి దారిన బుంగల గుంటకు పలాయనుడై పార్కులో సిమెంటు తిన్నెపై ఆసీనుడై ఉన్న కాళాస్త్రి పాదాలపై వ్రాలి అలనాటి గయునివలె శరణాగతుడైనాడు.

ఒకే ఒక గంట కాలంలో టాక్సీలో వెళ్ళి కాళాస్త్రి ఆ సమస్యను పరిష్కరించేసి పారేశాడు.

"ఏముంది అందులో ఈ మాత్రానికే ఇట్లా బెదురుతావేం" అన్నాడు కాళాస్త్రి అంతా ముగిశాక.

వెల్మల్లిపాళెం చిక్కాలయ్య ఎద్దులు బలే మంచివి. చేతులెత్తున్నాయి. బొల్లికొండ సర సలో ఎనమన్నూట యాభై ఐదిచ్చి ఆ వారం రోజుల క్రితమే పట్టుకొచ్చాడతడు. ఆ ఎద్దుల్ని కాళాస్త్రి పట్టుకొచ్చి కంపల వెంగయ్య పశులపుకొట్టంలోని గాట్లోకట్టేసి చావిడి కాడ కూచున్న రివెన్యూ ఇన్‌స్పెక్టర్ని బలవంతాన పిలుచుకువచ్చి చూపించడమే గాదు రిపోర్టు కూడా రాయించేశాడు.

ఇట్లా పీకల మీదికి వచ్చిన కొండంత ప్రమాదాలను గోటితో చిమ్మివేసే బ్రహ్మాండమైన ప్రజ్ఞా పాటవములున్న కాళాస్త్రి ఒకనాడు ఏదో పనిమీద ఆస్పత్రికి వెళ్ళాడు.

బుంగల గుంటలో ఆస్పత్రిని భూలోక నరక మంటారు. అందులో ఉన్న వాళ్ళందరూ యమ దూతలని సాక్షాత్తు డాక్టరుగారు యమధర్మ రాజనీ— అక్కడి జనాల నమ్మకం. అందుకే అందులోకి ఎవ్వరూ వెళ్ళక ఆ యాస్పత్రి చుట్టూ బోర్డులు కట్టుకొన్న వందలాది నేటివ్ డాక్టర్లవద్ద వేలాది ఇంజక్షన్లు తీసుకొని లక్ష లాది రూపాయలను ఖర్చుపెడుతూ, కోట్లాది పన్నులు కడుతున్నా ఈ గవర్నమెంటు మా మొరాల కించదేం అంటూ అఘోరిస్తుంటారు.

కాళాస్త్రిని డాక్టరుగారు చూచిందే మందు కావాలేమోనని

"మీ పేరేమి" అన్నాడు.

"కాళాస్త్రి" అని సమాధానం చెప్పాడు కాళాస్త్రి

"నే నడిగింది నీపేరయ్యా"

"కాళాస్త్రి"

"వూరు పేరు కాదు. నీ పేరు చెప్పవయ్యా అంటే...."

కాళాస్త్రికి కోపం వచ్చింది. అతనికి కోపం వస్తే ఏమీ మాట్లాడడు. ఆ క్షణంలోనే అతని భరతం పట్టించడ మెట్లా అని ఆలోచిస్తాడు.

అంతే.. గిరుక్కుమని వెనక్కి తిరిగి మినప రామయ్యసెట్టి కొట్లో ఒక్కటిన్నర రీము కాగితం కొన్నాడు. జమాజమా ప్రెస్సులో ఇచ్చి ఒకే రకం పిటిషన్లు నాలుగువేలు అచ్చేసి ఒక్కొక్క పిటిషన్లో వంద సంతకాలు (వ్రేలి ముద్రలతో సహా) చేయించి ఆ కట్టల్ని ఒకే బంగీగా కట్టించి సరాసరి రాజధానిలోని గౌరవనీయుల పేర పార్సెల్ చెయ్యించాడు.

ఇంతవనీ జరగడానికి మూడు రోజులే పట్టి పోయినా ఆ డాక్టరుగారికి ట్రాన్స్‌ఫర్ మాత్రము మూడు మాసాలకు వచ్చింది.

ఈ దెబ్బతో కాళాస్త్రి ఖ్యాతి కస్తూరి సువాసన వలె బుంగల గుంట తాలూకా సరిహద్దులను దాటుకొన్నది.

అనుదినమూ, అనుక్షణమూ ఉత్పన్నమయ్యే ప్రజల సమస్యలను పరిష్కరించాలంటే తనకొక చిన్న జీపు కారుండాలని తోచింది కాళాస్త్రికి.

"ఈ బీడీవోలు, జేడీవోలు డీఇవోలు, యుప్ ఈవోలు, ఆర్ డీ వో లు, ఆర్ టీ వో లు, ఇట్లా జీపులలో పల్లెమీదికి దాడిచేయకుంటే నాబోటి వాడికో జీపెందుకియ్యదీ ప్రభుత్వం" అని చాలా మందితో అన్నాడు కాళాస్త్రి. కాళాస్త్రికి జీపు కావలసిన మాట నిజమే. దాన్ని సంపాదించడం యెట్లా ?

అప్పుడప్పుడే జనరల్ ఎన్నికలు వస్తున్నవి. కాళాస్త్రికి తళుక్కున మెరుపులాంటి ఆలోచన తట్టింది. "బలే మంచి సమయము మించినన్ దొరకదు." అవును. దొరుకుతుందా మరి అలాంటి సమయం. కేవలం ఓటున్న మూగవాడే మూడు రూపాయలనుండి ముప్పై రూపాయ లార్జించే ఆ తరుణంలో కాళాస్త్రి వంటి అఖండ మేధాసంపన్నుడు ఐదువేలైనా ఆర్జించలేడా ?

ఐనా పెట్టుబడి కావాలి. పెట్టుబడి లేనిదే ఏ వ్యాపారమూ సాగదు. కనుకనే కాళాస్త్రి పెట్టుబడి దారులను గట్టిగా విమర్శిస్తుంటాడు. కార్మికులకోసం కడవలాదిగా కన్నీరు కారుస్తుంటాడు.

రెండు వందలా యాభై చెల్లించి నామినేషన్ వేశాడు.

జమాజమా ప్రెస్సులో కూచొని మహోద్భుతమైన ఒక కరపత్రాన్ని నాలుగువేలా నాలుగువందల పలభై నాలుగు పదాలతో రచించాడు.

—81 వ పేజీ చూడండి

....ఊరుపేరుకాదు.... ....నీపేరు చెప్పవయ్యా?



సుబ్బారావు పొద్దున్నే మాఇంటికి పరుగెత్తుకువచ్చి తనకు సర్వీసు కమిషను దగ్గరనుంచి ఇంటర్వ్యూకు రమ్మని ఉత్తరం వచ్చిందని వెల్లడించాడు. నేను కంగ్రాచ్యులేషన్సు చెప్పేలోగానే, ఆ ఉద్యోగం యొక్క గొప్పతనం తనకు రాబోయే జీతం వివరాలు, తనకింద ఉండగల గుమాస్తాల సంఖ్య, తను నిర్వహించాల్సిన బాధ్యతలు; పైకి ఎగబాకి పోవటానికి గల అవకాశాలు మొదలైనవి వివరించి చెప్పేశాడు అసలు ఆ ఉద్యోగానికి తనే తగినవాడినని, తనకోసమే ఆ ఉద్యోగం ఖాళీగా ఉందేమో నన్న అభిప్రాయం వెలిబుచ్చాడు. అయితే అది "గెజిటెడ్ ఆఫీసర్ రాంక్" కాదే అన్న బాధ పట్టుకు పీడిస్తోందన్నాడు. కాని "ఫ్యూచర్ ప్రాస్పెక్ట్సు" బాగా ఉన్న ఉద్యోగం కనుకనూ, ప్రస్తుతంలో 350 రూ. లు జీతం ఇస్తారు కనుకనూ, తనబోటి తెలివైనవాడు తొగ "షైను" అయిపోటానికి తగినది కనుకనూ ఈ ఇంటర్వ్యూకు వెళ్లటానికే నిశ్చయించుకున్నా నన్నాడు. ఇటువంటి ఉద్యోగాలకు సాధారణంగా సెలెక్టు చేసుకునేటట్టయితేనే ఇంటర్వ్యూకు పిలుస్తారట. అల్లాటప్పాగాళ్లందర్నీ పిలవరట. కాబట్టి తను ఆఫీసరయిపోయినట్టే నన్నాడు. తనకు తోడుగా నన్ను కూడా రమ్మన్నాడు.

"సుబ్బారావు—ఉద్యోగాన్వేషణ" అనే అంశంపై మీకు కొద్దిగా వివరించాలసి ఉంటుంది. అసలు సుబ్బారావునాకు స్వయానా మేనత్త కొడుకు. వాళ్ల నాన్నగారు హైస్కూల్లో లెక్కల మేష్టారు. లెక్కల మేష్టార్లకు ఉండాల్సిన కరుకుదనం మొదలైనవాటికి ఆయనను మూర్తీభవించిన ఉదాహరణగా పేర్కొనవచ్చును. దానికి తోడు ఆయనకు క్రమశిక్షణ, విద్యా విధానం, మొదలైన విషయాలమీద ఖచ్చితమైన అభిప్రాయా లున్నాయి. వా టన్నిటినీ సుబ్బారావుమీద ప్రయోగించి అతన్ని "మోడల్ స్టూడెంటు" గా చెయ్యాలని ఆయన ఆశయం. అందుచేత మావాడు చీకటిపడేవేళకే ఇంటికి చేరుకోవటం; తర్వాత భోంచేసి చదువుకుని పది గంటలకే నిద్రపోవటం, తెల్లవారకట్లనే లేచి చదువుకోవటం; సినిమాల వంటి దురలవాట్లు లేకుండా చేసుకోవటం మొదలైనవి విధిగా, చెయ్యాల్సి వచ్చింది. అదీకాక సుబ్బారావుకు కూడా ఇటువంటి మంచి అభిప్రాయాలు ఉండటంచేత తనంతట తానే కొన్ని అమలుపరచేవాడు. క్లాసులో ముందర బెంచీమీద కూర్చోవటం, తీరికవేళల్లో క్లాసులో ఫస్టున వచ్చే కుర్రాళ్లతోనే మాట్లాడటం, అప్పుడప్పుడు లెక్చరరుగారిని తెలియని లెక్క లడగటం, సినిమాలు సాధ్యమైనంత తక్కువగా చూడటం, రోడ్లమీద అసలు తిరక్కపోవటం, ఇత్యాది పనులు తు. చ. తప్పకుండా ఆచరించేవాడు. ఈ తరహా కుర్రవాళ్లందరూ ఫస్టు క్లాసులో పాసయిపోతారన్న విషయం అందరికి తెలిసిందే. తనకు ఫస్టుక్లాసు రావటంతో నోబుల్ ప్రైజ్ వచ్చినంత సంబరపడిపోయాడు. ఇదే విధంగా ఎమ్మెస్సీ, డి. యస్సీ మొదలైనవి కూడా ఫస్టుక్లాసులో పాసయిపోయి ఒక గొప్పవాడ్నయిపోదా మనుకున్నాడు. ఆతర్వాత ఒక స్కాలర్ షిప్పుమీద ఎక్కి కూచుని అమెరికా, ఫ్రాన్సు షికారు వెళ్లి రావచ్చని సంబరపడ్డాడు. అయితే వాళ్ల నాన్నగారికి ఈ వ్యవహారం అంతగా రుచించలేదు. కలల అలలమీద తేలుతున్న సుపుత్రుణ్ని ఒక మంచిరోజు చూసుకుని నేలమీదకు దింపి, మంచి ఉద్యోగం చూసుకుని వేన్నీళ్లకు చన్నీళ్ల మాదిరిగా ఉండవలసినదిగా బోధించాడు. సుబ్బారావు దిగాలు పడినవాడై తల్లి ద్వారా తండ్రి మనస్సు మార్చాలని ప్రయత్నించాడు కాని, తల్లే అందుకు ఒప్పుకోకపోవటంవల్ల తప్పనిసరిగా ఉద్యోగాన్వేషణ చెయ్యవలసి వచ్చింది.




కాని తనబోటి మాధమాటిక్సు గ్రాడ్యుయేట్ మామూలు గుమాస్తా ఉద్యోగం చెయ్యటం చిన్నతన మనిపించింది. నలుగురు స్నేహితుల నడిగాడు తనబోటివాడు చెయ్యదగ్గ ఉద్యోగం ఏదైనా చెప్పమని. ఒకాయన ఐ ఏ. ఎస్. కు వెళ్లి కలక్టరయిపోవలసినదిగా సలహా యిచ్చాడు. అసలా మాట కొస్తే గెజిటడ్ ఆఫీసరుకు తక్కువ "రాంకు" ఉద్యోగం చెయ్యవద్దన్నాడు. పైగా ఇదే ఇంగ్లండో, అమెరికావో అయితే గద్దలాగా ఎగరేసుకు పోయేవారినిన్నీ, ఎప్పుడూ గుమాస్తా ఉద్యోగం చెయ్యనని ప్రమాణం చెయ్యమనీ కూడా అన్నాడు.

ఆరోజునుంచి ప్రతీ పేపరూ చూసేవాడు, ఎక్కడైనా గెజిటెడ్ ఆఫీసరు ఉద్యోగాలకు ఖాళీ లున్నాయేమోనని. అదేం ఖర్మో కాని అటువంటి ఉద్యోగాలకు అడ్వర్టయిజ్మెంట్లు చాలా తక్కువగా వచ్చేవి అధమం ఒక్కటైనా ఉన్నా, వాటికి బోలెడు గొంతెమ్మ కోరిక లుండేవి. పొరపాటున

కనీస విద్యార్హత "గ్రాడ్యుయేట్" అని ఉన్నా దానికి తోకలాగా అధమం అయిదు సంవత్సరాల అనుభవం కావాలని వేసేవారు. అయితేనేం మావాడు ఆశ వదులుకోలేదు. "తనకు గెజిటెడ్ ఆఫీసరు ఉద్యోగం ఇవ్వాల్సి వస్తుందని గవర్నమెంటువారు అసలు ప్రకటన చెయ్యటమే మానివేశా" రన్నాడు. తనబోటి "జీనియస్" ఇక్కట 'రాట'వుతున్నట్టు వాళ్ళకు తెలియదేమోనని అభిప్రాయ పడ్డాడు. అసలు ఈ యూనివర్సిటీవాళ్ళకు బుద్ధిలే దన్నాడు. ఎందుకంటే ఫస్ట్ క్లాసు గ్రాడ్యుయేట్ల లిస్టు ఒకటి గవర్నమెంటువాళ్ళకు ఇచ్చేస్తే, వాళ్ళేవో ఈ లిస్టులోనుంచి తనబోటి వాళ్ళను సెలక్టు చేసుకోవచ్చునట. అది చాలా తేలికగా ఉంటుందిట కూడాను. అటు గవర్నమెంటువారికి ఇటు వీళ్ళందరూకూ వ్యయప్రయాసలకు తగ్గుతాయి — ఈ ఊహ గవర్నమెంటువారికి తట్టకపోవటం మావాడి దురదృష్టమే మరి.

చివరకు ఒకరోజు పేపర్లో ఎటువంటి లక్షణాలు గల ఉద్యోగాలు కావాలని తను తహతహలాడిపోతున్నాడో సరిగ్గా అటువంటివే రెండు ఉద్యోగాలు కనుపించాయి. పైగా "ఫస్ట్‌క్లాసు గ్రాడ్యుయేట్లు అయితే చాలునని, పూర్వపు అనుభవం లేకపోయినా సరే, ఆఫీసరు ఉద్యోగాలు ఇచ్చేస్తామని, కావాల్సినవాళ్ళు దరఖాస్తులు పంపుకోవచ్చునని" ప్రకటించారు. మావాడు తెగ మురిసిపోయాడు. ఆతర్వాత ఆ ఉద్యోగాలకు దరఖాస్తులు పడేశాడు అయితే ఒక చిక్కు వచ్చింది. ఈ రెండు ఉద్యోగాలు తనకు వచ్చేస్తే ఏ ఉద్యోగానికి వెళ్ళటమూ అనేది పెద్ద సమస్యగా తయారయిందన్నాడు. ఇంటర్వ్యూకు వెళ్ళినప్పుడు ఆ ఉద్యోగం యొక్క "ఫ్యూచర్ ప్రాస్పెక్ట్స్" కనుక్కుని ఏ ఉద్యోగంలో చేరాల్సింది నిర్ణయిస్తా నన్నాడు.

ఇంక ఆ మర్నాటి నుంచి మావాడు ఇంకా ఇంటర్వ్యూకు రమ్మని ఉత్తరం రాలేదని నానా బాధ పడేవాడు. పోస్టుమాన్ కనుపించటం తర్వాయి. తనకు తప్పకుండా ఉత్తరం రావాలని, వెతికి చూడమని వేధించేవాడు. కొంతకాలం గడిచాక ఇంక తనకు ఇంటర్వ్యూ రాదనుకున్నాడు. మళ్ళా ఉద్యోగ ప్రకటనలు వెతకటం మొదలు పెట్టాడు. ఈవిధంగా ఒక అరడజను ఉద్యోగాలకు అప్లయి చేయుటమూ, వాళ్ళు కనీసం సమాధానంగా "మా శాఖలో ఫలానా ఉద్యోగమునకు మీరు సెలక్టు కాలేదని తెలుపుటకు విచారించుచున్నాము" అని అయినా రాయకుండా ఉండటమూ జరిగింది. అయినా మావాడు ఆఫీసరు ఉద్యోగానికి ఆశ వదులుకోలేదు.

ఇది ఇట్లా ఉండగా ఇంటర్వ్యూ కోసరమని ఏవిధంగా తయారుకావాలో కొంతమంది పెద్దవాళ్ళను అడిగి తెలుసుకున్నాడు. పేపరు తెప్పించి శ్రద్ధగా చదవటం మొదలుపెట్టాడు. జనరల్ నాలెడ్జి పుస్తకం ఒకటి కొనేశాడు. కెనడీ దగ్గర్నుంచి మావూరు పంచాయతీబోర్డు ప్రెసిడెంటు వరకు ఎవరెవరు ఏఏ పదవుల్లో ఉన్నారు, టోగో దేశపు ఎల్లలు ఏవి, టైబరు నది ఒడ్డున గల పట్టణము రాజధానిగా గల రాజ్యము ఏది, కొంగ గంటకు ఎన్నిమైళ్ళ వేగముతో ఎగురును, ధర్మామీటరు పొడవు ఎంత, అలెగ్జాండరు మొదలుకొని చైనావారి వరకు హిందూదేశముపై ఎవరెవరు దండెత్తిరి, ప్రపంచములో గల ఎత్తయిన కట్టడములు, లోతైన కందకములు మొదలైనవన్నీ కంఠతా పట్టేశాడు. అప్పటికీ నమ్మకం కుదరక మాచేత రెండు, మూడు 'మాక్' ఇంటర్వ్యూలు కూడా పెట్టించుకున్నాడు. ఇంక ఇంటర్వ్యూలో తనకు డోకా లేదు పొమ్మన్నాడు.

ఈలోగా వాళ్ళ నాన్నగారు ఇండియాలో ఆఫీసరు ఉద్యోగాలే కాకుండా గుమాస్తా ఉద్యోగాలు కూడా ఉన్నాయని, అవి కూడా చాలా బావుంటాయని, 150— రూ. ల దాకా సంపాదించవచ్చునని బోధించారు. అయితేనేం, మావాడు "నసేమిరా వినను" పొమ్మన్నాడు. తింటే గారెలే తినాలి, చేస్తే ఆఫీసరు ఉద్యోగమే చేయాలి. కనుక తక్కువ ఉద్యోగాలు చెయ్యనన్నాడు.

*　　　*　　　*

ఏమైతేనేం ఇప్పుడు ఇంటర్వ్యూ వచ్చింది కనుక తన కష్టాలు గట్టెక్కాయని భావించాడు. ఇంటర్వ్యూ తరువాత ఉద్యోగం రావటం ఖాయం కాబట్టి తనింక బాధపడక్కర్లే దన్నాడు.

సర్వీస్ కమీషనువారి ఆఫీసుకు వెళ్ళేవరకు మావాడు ఇదే రకమైన అభిప్రాయాలు వెలిబుచ్చుతూనే ఉన్నాడు. అక్కడ చేరిఉన్న జనాభాను చూసేసరికి మావాడు గతుక్కుమని 'ఏవిట్రా ఇంతమంది చేరారు, కొంపదీసి అందరూ ఇంటర్వ్యూకే కాదుగదా" అని వాపోయాడు. విచారించగా అక్కడ ఉన్న వాళ్ళలో చాలామంది ఇంటర్వ్యూకే నని తేలింది. అందులో ప్రతి ఒక్కరి ముఖంలోనూ "ఆఫీసరు" కళ ఉట్టిపడుతోంది. కొందరు గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుకొంటున్నారు. ప్రక్కవాళ్ళతో మాటాడ్డవే తమ గౌరవానికి భంగమన్నట్లుగా మూతి బిగించుకు కూచున్నారు కొందరు. కొంతమంది పుస్తకాలు పేపర్లు తెగ నమిలేసి భట్టీయం పట్టేస్తున్నారు. వాళ్ళ ముఖాలలో ఆదుర్దా స్పష్టంగా కనుపిస్తోంది. మరికొందరు మన్నుతిన్న పాముల్లా గోళ్ళు గిల్లుకుంటూ కూచున్నారు. కొందరేమో హాలు ఈ చివర్నించి ఆ చివరకు హడావుడిగా తిరిగేస్తున్నారు. దారిలో కనపడ్డవాళ్ళను నిలేసి ఏమిటో అడిగేస్తున్నారు. మధ్యలో విట్లు కూడా వేస్తున్నారు.

అక్కడ చేరివున్న వాళ్ళ మొహాలలోని భావాలనుబట్టి మూడు తరగతులుగా విభజించవచ్చు.

80—వ పేజీ చూడండి





# నీలి వజ్రపు శాపం

సంగీతం లక్ష్మీకళ్యాణి

కొన్ని వస్తువులు మేలును తెస్తాయి. కొన్ని కీడును తెస్తాయి అని చాలామందికి నమ్మకం. ఏ పరీక్షకు వెళ్ళినా అదే పెన్నుతో వ్రాసే విద్యార్థులు చాలామంది ఉన్నారు. ఒక కుటుంబంలో వరుసగా వచ్చే అనర్థాలకు కారణం వాళ్ళు నివసించే ఇల్లని అనుకోవడం సహజమే.

"ఆ... ఇవంతా మూఢ నమ్మకాలు" అని సాధారణంగా వీటిని ప్రక్కకు తోసేస్తుంటాం. కాని హోప్ డైమండ్ అని జగత్ ప్రసిద్ధి గాంచిన వజ్రం చరిత్ర, దాన్ని ధరించిన వారిని ఎదుర్కొన్న ఆపదలు చూస్తే పోయిన నమ్మకాలు మళ్ళీ రావచ్చునేమో!

హోప్ డైమండ్‌ను గూర్చి రిచర్డ్ డి. యస్. మాక్మిలన్ వ్రాసిన వివరాలు ఇవి.

18 వ శతాబ్దంనాటికి బర్మా దేశంలోని మాండలే సమీపమందు సీతా రాముల విగ్రహమున్న ఒక హిందూ దేవాలయం ఉండేది. ఆ విగ్రహ వక్షస్థలాన్ని ఒక వజ్రం అలంకరిస్తుండేది. అది ముచ్చటైన నీలి వర్ణము కలిగి తేజోవంతమై ఉండేది. అక్కడవున్న పురోహితులు రోజూ పూజలు సలుపుతూ ఆ దేవాలయానికి కావలాదారులుగా కూడా ఉండేవారు.

* * *

ఆ సమయంలో హిందూ దేశాన్ని మొగలాయీ చక్రవర్తి, ఔరంగజేబు పరిపాలిస్తూ ఉండేవాడు. అప్పుడు జీన్ బాప్టిస్ట్ టేవర్నియర్ అనే ఒక ఫ్రెంచి యాత్రికుడు, హిందూ దేశానికిరాగా, ఔరంగజేబు ఆ యాత్రికుని తన ఆస్థానానికి ఆహ్వానించాడు. టేవర్నియరు దేశ దేశాల్లోని వజ్ర వైడూర్యాలను గురించి బాగా తెలిసినవాడు. అందుకని ఫ్రెంచి రాజైన 14 వ లూయీ ఇతనికి ఎక్కువ జీతం ఇచ్చి తన ఆస్థానంలో వజ్రాల విలువను అంచనావేసే ఉద్యోగిగా ఉంచుకున్నాడు. తూర్పు దేశాలలో విలువైన వజ్రాలు దొరుకుతాయని అందరూ చెప్పగా వినడమేగాని, అక్కడికి వెళ్ళే అవకాశము టేవర్నియరుకు ఇంత వరకూ లభించలేదు. చివరకు ఎలాగో అవకాశం కల్పించుకుని హిందూ దేశానికి పయనమయ్యాడు.

హిందూ దేశానికి రాగానే మొగలు చక్రవర్తి అతన్ని ఆదరంతో ఆహ్వానించి, హిమాలయా పర్వతాల్లోని వజ్రపు గనులన్నిటినీ చూపెట్టాడు. ఈ వజ్రాల విలువకు టేవర్నియరు ఆశ్చర్యపోయాడు కానీ, వీటన్నిటినీ మించిన వజ్రము మాండలేలోని హిందూ దేవాలయంలో ఉన్నదనీ, దాని శోభ అనమానమని ఔరంగజేబువల్ల టేవర్నియరుకు తెలిసింది. అంత విలువైన వజ్రాన్ని కళ్ళారా చూడందే టేవర్నియర్ మనస్సు ఆగలేదు. వెంటనే మొగలు చక్రవర్తి అనుమతి బడసి, ఏనుగు దళాలను తీసుకొని మాండలేకు ప్రయాణమయ్యాడు.

నిష్ఠ గరిష్ఠులైన పూజారిలు ఆ దేవాలయం లోనికి పాశ్చాత్యులను రానిచ్చేవారుకాదు. కాని టేవర్నియరు మొగలు పాదుషాచే గౌరవింపబడినాడని తెలిసి, అతనిని మాత్రం దేవాలయంలోనికి పోవడానికి అనుమతించారు.

దేవాలయం ప్రవేశించగానే టేవర్నియర్ విగ్రహానికి సాష్టాంగ నమస్కారంచేసి లేచి నిల్చొని ధ్యానం అభినయిస్తూ ఒక కంట విగ్రహ వక్షస్థలంలోని వజ్రాన్ని చూచాడు. దాని నీలికాంతులు మత్తెక్కించాయి. ఆ వజ్రాన్ని ఏ విధంగానైనా అపహరించి తీసు కెళ్ళాలని నిశ్చయించుకుని పన్నాగాలు ఆలోచించాడు.

ఆనాటినుండి నాలుగైదు రోజులవరకు ఉదయం సాయంకాలము దేవాలయంలోనికి వెళ్ళి, భక్తి శ్రద్ధలతో ధ్యానం నటించి, రోజు కొక నగ చొప్పున ఆ విగ్రహానికి అలంకరించాడు. కానీ, ఆ నగలన్నీ అట్టే విలువైనవి కావు. ఈ సంగతి తెలియని పూజార్లు ఇదంతా యాత్రికుని భక్తేనని నమ్మి వూరుకున్నారు.

అయిదవరోజు అమావాస్య. అర్థరాత్రి, కన్ను పొడుచుకున్నా ఏమీ కనుపించడంలేదు. తన పథకం నెరవేరేందుకు ఇది మంచితరుణమని టేవర్నియర్ నిర్ణయించాడు అనుచరులకి నల్లటి దుస్తులు వేసి ఏనుగు దళాలతోపాటు, చీకట్లో ఎవ్వరికీ కనుపించకుండా దగ్గరో చెట్ల వెనుక ఉంచాడు.

ఆ రాత్రి ఆలయ ఆవరణలో ఇద్దరు పూజారులు, కొందరు బిచ్చగాళ్ళు మాత్రం నిద్రపోతున్నారు. అర్థరాత్రి ఏదో చప్పుడైంది. ఏమిటా అని పూజార్లు కళ్ళు తెరిచి చూడబోయారు. కానీ వారి కళ్ళు, నోరు, చేతులు, కాళ్ళు కట్టివేయబడి ఉన్నాయి ఒళ్ళు ఇటూ, అటూ కదల్చలేని స్థితిలో ఉన్నారు. కాని, చెవులు నిక్కపొడిచి వినగా వారికి అడుగుల చప్పుడు వినిపించినది. ఎవరో విగ్రహాన్ని సమీపించి తిరిగి వెళ్తున్నట్లు తెలుసుకున్నారు. కొంతసేపటికి ఏనుగు దళాలు దూరంగా వెళ్ళిపోతున్నట్లు శబ్దం స్పష్టంగా వినబడింది.

మరునాడుదయం చూచేసరికి విగ్రహ వక్షస్థలంమీద నీలి వజ్రంలేదు. పూజార్లు భయంతో గజగజలాడిపోయారు. కొంత సేపటికి ఈ అపచారం చేసింది టేవర్నియరని తెలిసికొని అతని కోసం నలు దిశలా గాలించారు. కాని టేవర్నియర్ ఈపాటికి చాలాదూరం వెళ్ళిపోయాడు. శ్రీరాముని ఆగ్రహం ఏ విపత్తులకు దారితీస్తుందో, ఈ వజ్రం ఎవరెవరికి ఎటువంటి అనర్థాలను తెచ్చిపెడ్తుందోనని పూజార్లు భయపడ్డారు.

టేవర్నియర్ ఫ్రాన్సు చేరుకున్నాడు. అతను తెచ్చిన నీలి వజ్రాన్ని చూచి, దాన్ని తనకు అమ్మవలసినదిగా లూయీ రాజు ప్రాధేయపడ్డాడు. కాని, ఇంత కష్టపడి సంపాదించిన వజ్రాన్ని అమ్మడానికి టేవర్నియర్ నిరాకరించాడు. ఎట్టకేలకు

టేవర్నియర్ జీతాన్ని పెంచి, లూయీ ఆ వజ్రాన్ని కొన్నాడు. అపహరించబడిన వజ్రం తన శక్తి ప్రభావాలను మొట్టమొదట టేవర్నియర్‌మీదే చూపెట్టింది. అతని కొడుకు అప్పులపాలై, దాన్ని తీర్చేందుకు తండ్రి ఆస్తినంతా వినియోగించాడు. కొడుకు ఇలా చెడిపోవడంచూచి టేవర్నియర్ మనోవ్యథతో క్రుంగిపోయాడు. అతనిని పేదరికం ఆవరించింది. నిలకడతప్పి, మరల ప్రయాణానికి బయల్దేరాడు. కాని, ఒక అడవిలోంచి వెళ్తూంటే కొన్ని అడవి కుక్కలు టేవర్నియర్‌పై బడి అతన్ని చీల్చి, తునకలు, తునకలుగాచేసి చంపేశాయి. పెద్ద పేరు సంపాదించిన వజ్రాల వర్తకుడు దారుణమైన పరిస్థితుల్లో అంత మొందాడు.

ఈ వజ్రం ఒక చేతినుండి మరొక చేతికి మారినప్పుడెల్లా ఒక్కొక్కపేరు వస్తూండేది. మొదట టేవర్నియర్ దగ్గరున్నప్పుడు అది 'టేవర్నియర్ వజ్రం' అయింది. తర్వాత ఫ్రెంచిరాజు లూయీ చేతికి రాగానే అది 'ఫ్రెంచి నీలం' అని పేరు బడసింది. సాధారణంగా వజ్రాలు అన్ని రంగుల్లో ఉంటాయి కాని, ఎరుపు, నీలి వర్ణాల వజ్రాలు చాలా అరుదు. అందుకని తన దగ్గర ఎన్ని నగ లున్నప్పటికీ, దీనిరంగు, తేజస్సుచూచి లూయీ దీనినే ఎల్లప్పుడూ ధరిస్తూండేవాడు. తాను ధరించడమేకాక, అంతఃపురంలో తనకి ప్రియమైన వాళ్ళకి కూడా ఆ వజ్రాన్ని ఇచ్చాడు. మొదట రాజు ప్రియురాలైన మాడమ్— డి. మాంటిస్పాన్ దాని నలంకరించుకుంది. కాని, కొంతకాలానికే రాజు మరొక స్త్రీని ప్రేమించడంవల్ల మాంటిస్పాన్ మనస్సు పాడైపోయింది. ఆ తరువాత ఆర్థిక మంత్రి నికొలాస్ ఫొకే రాజునుకోరి ఆ వజ్రాన్ని ధరించాడు. కొన్నాళ్ళకల్లా అతను రాజుచే దూషింపబడి, సభలో అవమానింపబడి చెరసాలపాలై, మూర్ఛ రోగ పీడితుడై మరణించాడు. అప్పటినుండి ఆ వజ్రంలో ఏదో పిశాచముందనీ, దాన్ని ఎవరైతే ధరిస్తారో వారికి తప్పకుండా కీడు కల్గుతుందని ఒక నమ్మకం బయలుదేరింది. ఈ నమ్మకానికి తోడుగా లూయీ వంశం క్షీణించి ఫ్రెంచి విప్లవం మొదలుపెట్టే సూచనలు కనబడ్డాయి.

తర్వాత ఆ వజ్రాన్ని ధరించినది అందాల రాణి మేరి ఆన్‌టోయినెట్. ఆమె జీవితం చాలా దుఃఖవంతమైనది. ఆమె వజ్రాన్ని ధరించడమే తడవుగా దేశమంతా అరాజకంతో నిండి, ప్రజలకు రాణి అంటేనే ద్వేషం ఏర్పడింది. చివరకు ఆమె కిరీటముతోపాటు ఆమె శోభంతా కూడా రూపుమాసిపోయింది.

కొన్నాళ్ళకు ఫ్రెంచి మహా విప్లవం వచ్చింది. విప్లవానంతరం అప్పటి ఫ్రెంచి ప్రభుత్వం రాజు కిరీటాన్ని, ఆభరణాలనూ కోట లోపల భద్రంగా దాచింది. ఆ ఆభరణాల్లో ఈ వజ్రం కూడా ఉన్నది. కాని 1792 వ సంవత్సరం సెప్టెంబరు 17 వ తారీఖున కొందరు దొంగలు కోట జొచ్చి, కొన్ని ఆభరణాలతోపాటు ఈ వజ్రాన్ని కూడా దొంగలించుకొనిపోయారు. ఈ సాహస కృత్యం ఫ్రెంచి పోలీసు దళాలని ఒక వూపు వూపింది. ఎట్టకేలకు పోలీసులు ఈ చోరీకి సంబంధించిన దొంగల నందరిని పట్టుకొని, కొందరికి మరణ శిక్షను, కొందరికి ఆజన్మాంతర కారాగార శిక్షను విధించారు. పోయిన ఆభరణాలన్నీ దొరికాయికానీ, విలువైన ఆ నీలి వజ్రం మాత్రం దొరకలేదు. ఆ తరువాత ఆ వజ్రం ఎటు వెళ్ళిందో ఎవరికీ తెలియదు.

అది మళ్ళీ కనుపించినది ఆమ్‌స్టర్ డామ్‌లో ఫాల్స్ అనే ఒక వజ్రాల వ్యాపారి దగ్గర. అప్పట్నుంచి నీలి వజ్రపు కాంతి జ్వాలలు మళ్ళీ ప్రజ్వరిల్లాయి. ఆ వజ్రాన్ని కోయించి మెరుగు పెట్టమని ఎవరో ఒకతను ఫాల్స్ కిచ్చాడు. కొన్ని మాసాల కష్టపడి, ఫాల్స్ దానికి మెరుగు పెట్టాడు. కానీ, వ్యసనాలతో చెడిపోయిన అతని కొడుకు ఆ వజ్రాన్ని అపహరించి, అమ్మి, వచ్చిన డబ్బు జూదంలో, త్రాగుడులో ఖాళీ కాగా ఆత్మహత్య చేసుకున్నాడు. ఫాల్స్ కుమారుడి వద్దనుండి ఆ వజ్రాన్ని చవకగా ఫ్రాన్సిస్ బేలూ అనే ఫ్రెంచి యువకుడు కొన్నాడు. మరుక్షణం అతని పరిస్థితి చాలా విషాదకరమయింది. అంత విలువైన వజ్రాన్ని బాహాటంగా ఫ్రాన్సులో అమ్మటానికి భయపడి బేలూ లండనుకు వెళ్ళాడు. కాని, ఎందుకో అతనికి లండనులో కూడా భయం వేసింది. అందుకని ఎవరికీ కనుపించకుండా ఆ వజ్రాన్ని తన జేబులో దాచుకొని, తిరిగాడు. తన దగ్గర వజ్రమున్నా, చేతిలో చిల్లిగవ్వలేదు. జీవనోపాధికి ఇక ఏ మార్గమూ లేక లండను వీధుల్లో పాకీవాడుగా పని చేశాడు. ఇక క్షుద్బాధ భరించలేక కడకు డేనియల్ ఎలియాసన్ అనే ఒక యూదు వర్తకుని కలిసి, ఆ వజ్రాన్ని అయిదువేల పౌనులకు అమ్మేట్టు అతనితో ఒప్పందానికి వచ్చాడు. కొన్ని తెల్లారి వర్తకుడు మరుసటిరోజు ఉదయం బేలూ ఇంటికి వచ్చాడు. అక్కడ కనుపించిన దృశ్యానికి అతడు నిర్ఘాంతపోయాడు. బక్కచిక్కిన బేలూ శవం మంచంమీద పడివుంది. ఇన్నాళ్ళూ ఆకలితో అలమటిస్తూ, చేతికిడబ్బు వచ్చేవరకయినా జీవించే శక్తిలేక బేలూ మృత్యువు పాలయాడు.

యూదు వర్తకుని వద్దనుండి ఆ వజ్రాన్ని థామస్ హెన్రీ హోప్ కొన్నాడు. అప్పటినుండి ధానికి "హోప్ వజ్రం" అని పేరు స్థిరమై చివరకు లార్డ్ ఫ్రాన్సిస్ హోప్ చేతికి వచ్చింది. ఒకటి రెండు సంవత్సరములలోనే అతడు ఇల్లూ వాకిలి కోల్పోయాడు. ఉన్న డబ్బంతా నాశనమైపోయింది. అతని భార్య మేయోహి అనే నటి కూడా ఆ వజ్రాన్ని ధరించింది. కొన్నాళ్ళకు ఆమె మనస్సుమారి, భర్తకు విడాకులిచ్చి మరొక యువకునితో లేచిపోయింది. ఇక పేదరికం ఆవరించే స్థితిలో ఫ్రాన్సిస్ హోప్ ఆ వజ్రాన్ని అమ్మేశాడు. దీనితో, ఎక్కడికి వెళ్ళినా శాపం తెచ్చే, ఈ వజ్రంయొక్క ఖ్యాతి ప్రపంచమంతా వ్యాపించింది.

1908 వ సంవత్సరంలో ఈ వజ్రం కానిటోవ్‌స్కీ అనే రష్యా దేశపు యువరాజు ఆధీనంలో వచ్చింది. అతడు లాడ్యూ అనే ఒక నర్తకిని ప్రేమించాడు. తానుకొన్న వజ్రాన్ని యువరాజు నర్తకి కిచ్చి, మరునాటి నృత్య నాటికలో

79 వ పేజీ చూడండి



# వధూటి

న్యాయపతి రాజగోపాలం



**సుగుణని మనసారా ప్రేమించాడు శేఖరం. ఆమె లేనిదే తన జీవితం వ్యర్థం అనుకొన్నాడు.** ఆమెను 'పెళ్ళి' చేసుకొని తీరాలి అని అతడి సంకల్పం. సుగుణ కూడా శేఖరాన్ని ప్రేమించింది. సుగుణ, శేఖరం విశాఖపట్టణంలో బి. ఎల్. చదువుతున్నారు. రెండు సంవత్సరాల క్రితం వారికి ఒకరిపైన ఒకరికి జనించిన ప్రేమ "దిన వరభాగ జనితమైన ఛాయ బోలిక" అభివృద్ధి పొందింది. ఇద్దరి చదువులు కొద్ది రోజులలో సమాప్తం కాబోతున్నై. ఇక ఎవరి ఇళ్ళకు వారు పోవాలి. తమ వివాహం గురించి ఒక నిర్ణయం త్వరలో వారు చేసుకోవలసిన సమయం ఆసన్నమయింది.

సుగుణ తండ్రి సి. ఐ. డి. ఇనస్పెక్టరు. ఆమె వారికి ఏకైక సంతానం. సుగుణ మాటను ఆయన ఎన్నడూ తోసిపుచ్చలేదు. వివాహం విషయంలో కూడా "నేను శేఖరాన్నే పెళ్ళి చేసుకొంటాను నాన్నగారు" అని సుగుణ అంటే, 'అలాగేనమ్మా" అంటారు. శేఖరం తన తండ్రి రామారావుగార్ని ఒప్పించడం ఎలాగ అన్నదే ఇప్పుడు వచ్చిన సమస్య. శేఖరం కూడా తండ్రికి ఒక్కడే కొడుకు. అయినప్పటికీ, "నేను సుగుణనే పెళ్ళి చేసుకొంటాను నాన్నగారు" అని శేఖరం అంటే, "ఎంతమాత్రం వీల్లేదు" అంటారు రామారావుగారు. దీనికి కారణం శేఖరానికి ఆయన ఇదివరకే ఒక సంబంధం స్థిర పరచారు. పెళ్లికూతురు ఒక లక్షాధికారి కూతురు. ఇరవై వేల రూపాయలు కట్నం. అదిగాక, కనీసం నలభై, ఏభై వేల వరకు ఆస్తిలో కూడా వాటా తెచ్చుకుంటుంది. ఆ అమ్మాయిని ఇదివరకు శేఖరం చూచాడు. నచ్చలేదు నచ్చలేదని తండ్రితో చెప్పాడు. చేసుకొని తీరాలి. అన్నారు రామారావుగారు. కొంత ఘర్షణ జరిగింది. చివరకు ఇద్దరూ రాజీకి వచ్చారు. శేఖరం చదువు పూర్తి అయ్యేవరకు పెళ్లి ప్రసక్తి వాయిదా వేశారు. ఈలోగా ఆ అమ్మాయికి ఇంకొక సంబంధం కుదరకపోతుందా అని శేఖరం ఆశించాడు. కాని, అతడి ఆశ నిరాశ అయింది. చేపకోసం గాలం వేసి కూర్చున్నట్లు



వాళ్ళు ఆ అమ్మాయికి పెళ్ళి చెయ్యకుండా శేఖరం కోసం నిరీక్షిస్తున్నారు.

తను ఇటువంటి క్లిష్ట పరిస్థితిలో ఉన్నట్లు శేఖరం సుగుణకి యదార్థమే చెప్పాడు. ఈ విషయం గురించి అనేకసార్లు వారిద్దరూ చర్చించుకొన్నారు. ఇంతవరకూ ఏ నిర్ణయానికి రాలేదు. ఇప్పుడు పరీక్షలు దగ్గరకు వస్తున్నై. శేఖరం సుగుణ విడిపోయే కాలం సమీపిస్తున్నది. శేఖరం ఒక దృఢ నిశ్చయానికి వచ్చాడు, చివరికి. "మనం ఒకరి కోసం ఒకరం నిర్దేశింపబడ్డాం. మనల్ని ఎవ్వరూ వేరు చెయ్యలేరు. నేను నా తండ్రిని ధిక్కరించి నిన్ను వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకొన్నాను" అని సుగుణతో చెప్పాడు.

"మీ తండ్రిగారితో విరోధం తెచ్చుకొని మనము పెళ్ళి చేసుకోవడం అంటే నాకు బాధగా ఉన్నది. వృద్ధులు. పాపం ఆశలన్నీ మీపైనే పెట్టుకొన్నారు. ఆయన హృదయం గాయపరుస్తారా? మీ తల్లిగారు మీకోసం ఎంత క్షోభిస్తారో ఆలోచించారా? వారిద్దరికి మనశ్శాంతి లేకుండాచేస్తారా?" అన్నది సుగుణ.

"అయితే ఏమిటి చెయ్యమంటావో చెప్పు" అన్నాడు శేఖరం.

"మీ తల్లిగారి సహాయం అర్థించండి. ఆమెకు ఈ సంగతి అంతా చెప్పండి. ఆమెచేత మీ తండ్రిగారికి చెప్పించండి. ఈ తుది ప్రయత్నం కూడా ఫలించక, ఆయన ఆశీస్సులు మనకు ప్రాప్తించకపోతే మీరు చేసిన నిర్ణయం ఎలాగా ఉన్నది" అన్నది సుగుణ.

సుగుణ చెప్పినట్లు ఆఖరుసారి ప్రయత్నం చెయ్యడానికి శేఖరం అంగీకరించాడు. ఫలితం ఏమైనదీ సుగుణకి ఉత్తరం వ్రాస్తానన్నాడు. పరీక్షలయ్యాక ఎవరింటికి వారు వెళ్ళారు.

శేఖరం తల్లితో యథార్థం అంతా చెప్పేశాడు. సుగుణవంటి కోడలు దొరకడం ఒక అదృష్టం అన్నాడు. సుగుణను తను వివాహం చేసుకొని తీరాలి అన్నాడు. కన్నకొడుకుపైన ఆమెకు ఏ మాత్రమైనా అభిమానం ఉంటే, తండ్రితోచెప్పి ఎలాగైనాగైనా ఒప్పించమన్నాడు.

శేఖరం తనకు నచ్చిన అమ్మాయినే వివాహం చేసుకోవడం అతడి తల్లి అభిమతం. ఉన్నవాడు ఒక్కడే కొడుకు. అతడి మెడలు విరిచి, మనసు నొప్పించి బలవంతంగా ఇష్టంలేని పెళ్ళి చెయ్యడం ఆమెకు ఎంతమాత్రం ఇష్టంలేదు. కాని, తన భర్త ఒకరు చెప్పేనే ఘటం కాదు. ఏమిటి చెయ్యడమా అని ఆమె దీర్ఘంగా ఆలోచించింది.

"మీ తండ్రి సంగతి నీకు పూర్తిగా తెలుసును. ఒకరు చెప్తే వినే మనిషికాదు. ఏదైనా ఆయనకే తోచాలి. నాకొక ఉపాయం కన్పిస్తున్నది. ఆ సుగుణని మన ఇంటికి రప్పించగలవా? ఆమె కనీసం పదిహేను రోజులు మన ఇంట్లో ఉండాలి. ఆమెను పెళ్ళి చేసుకోవాలని నీ కోర్కె, ఇప్పట్లో మీ తండ్రికి తెలియకూడదు. సుగుణ రూపవంతురాలు, బుద్ధిమంతురాలు అని నువ్వు చెప్తున్నావు కాబట్టి, ఆమెపైన ఆయనకి

—73 వ పేజీ చూడండి

## EFAR
REGD

నవతరానికి నంకేతమైన గుర్తు



ప్రెషర్ స్టౌవులు
మోడల్సు నెం. 1
నెం. 100 హోల్డింగ్
నెం. 100/1 హోల్డింగ్

రాసెక్ ఇండస్ట్రీస్ ప్రయివేట్ లి.,
శ్రీజి భవన్ లోహార్ స్ట్రీట్, బొంబాయి-2.

డిస్ట్రిబ్యూటర్లు :
ఎఫ్. రాసెక్ & కం.
ప్రయివేట్ లిమిటెడ్
బొంబాయి-2 కలకత్తా-1 మద్రాసు-1
పో.బా. 2006 పో.బా. 2121 పో.బా. 1248

---

## వైబ్రో




సర్వ గర్భాశయ వ్యాధులను పోగొట్టి, ఆరోగ్యముగా సంతాన ముసుగలుగచేయును. అన్నిషాపుల దొరకును. సీసా 2-80

**కృష్ణా లేబరేటరీ బెజవాడ**

---

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వేళ్లు పొతుకుపోయి పాదము. నేలపై బెట్టలేక రాళ్ళ తగిలిన తుళ్లిపడు వారు పైపూతగా వాడిన వేళ్లతోసహా మాయంచేయు గల సంజీవి. వెల పోస్టు ఖర్చులతో రు. 4–25న.పై.

కొక్కోకము చిత్రపటములు గలది. రు. 1–50
దాంపత్య రహస్యములు ... రు. 3–00
తెలుగు హిందీ స్వయంశిక్ష రు. 4–50

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో
3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు-1.

---



ఓం! తత్! సత్!

## సుఖజీవిత సేవ

"సిద్ధవైద్య మహిమ"

సిద్ధుల సాటిలేని కీర్తికి ఒక తార్కాణము.

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

## 'మేల్ మాయిల్ మందు'

(Regd.)

**దీర్ఘకాల చర్మరోగములకు చక్కని నివారిణి**

నల్లరంగు, ఎర్రరంగు పొడలు, దద్దులు, పొక్కులు, గజ్జి (చర్మసంబంధము) పొడలు గల చోట్లలో తిమురులు, సూదిలో పొడిచినప్పుడు నొప్పిలేకుండుట, నిప్పుపడి బొబ్బలు కలిగినా తెలియకుండుట, దుర్‌నీరు సర్వఅవయములందు వ్యాపించి, రక్తములో కలిసి మత్తు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతివ్రేళ్లు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనములు, పాదమునందు పల్లపు పుండ్లు ఏర్పడుట, కాలు చేతులు వ్రేళ్ళు తగ్గుట, ముక్కు సొట్ట పడుట, చూచుటకు విసుగుపుట్టించు వ్రణములు (అస్థి సంబంధము) వీటికి చక్కని నివారిణి.

**1 మండలం (40 రోజులు) నూనె, లేహ్యము రు. 7/-**
**తపాల ఖర్చు రు. 2/-**

**స్నానమునకు ఉత్తమమైన 8 ఔన్సుల శ్రీ పరమాత్మతైలం రు. 2-50**
**తపాల ఖర్చు రు. 1-50.**

సిద్ధాకర్

## కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు,
*5/22*, మేల్ మాయిల్ P. O., (N. A. Dt.)

---

క్రమం తప్పక వాడండి

## నీమ్ టూత్‌పేస్ట్

ఆధునిక టూత్ పేస్టులో వాడబడు అవసరమైన ఔషధము లన్నింటితో కలసి. వేపలోని శక్తివంతమైన భాగములన్నియు పొందియున్న ఒకే ఒక టూత్ పేస్ట్




కలకత్తా కెమికల్
కలకత్తా-29

NTP-192 TF

# ధర్మవరం కేంద్రం

# తెలుగులో తాజా వార్తా ప్రసారం

**తెలుగులో ఈ అఖిల భారత వార్తా ప్రసారము ధర్మవరము నుండి జరుగుచున్నది. ఆంధ్ర సచిత్ర వార పత్రిక మద్రాసు కేంద్రము రిలే చేస్తున్నది!**

(1) నిన్నటిరోజు ఒక నీళ్ల కుళాయి వద్ద అమ్మ లక్కలు నీళ్ల పట్టుకొను చుండగా బండివాడు నిర్లక్ష్యంగా బండి నడిపి ఒక కుండను పగుల గొట్టాడు. అంచేత ఆడవారు ఉద్రేకులై గరిటెలు, చేటలు తీసుకొని బండివాడి మీదకి దౌర్జన్యానికి వెళ్లారు. అంతలోనే పోలీసులు వచ్చి బాష్పవాయు వుపయోగించి, ఆడవారి ఆయుధాలను (పరక చేట) స్వాధీనం చేసుకున్నారు. మళ్ళీ అవాంతర పరిస్థితులు కలగకుండా జిల్లా మేజిస్ట్రేట్ మాట పదహార్లు సెక్షన్ ప్రవేశ పెట్టారు.

(2) మొన్నటి రోజు రాత్రి లారీక్రింద పడి రెండు కప్పలు మరణించాయి. ఒక కప్ప గాయ పడ్డది. లారీడ్రైవర్ పరారి అయ్యాడు. పోలీసులు శవపరీక్ష జరిపి, ప్రమాదములో మరణించినట్లు నిర్ణయించారు. చనిపోయిన కప్ప బంధువులకు ప్రభుత్వము వారు భరణ మిచ్చారు.

(3) విద్యార్థులు క్రమశిక్షణతో బాటు, దొంగ తనం, ప్రేమించుట, మొదలగునవి కూడా అల వరుచుకోవాలని విధాన మంత్రి శ్రీ పోతే చిక్కడు నిన్న జరిగిన విధాన మంత్రుల సభలో ఉద్ఘాటిం చారు. మంత్రికి, రాష్ట్ర విధానశాఖ కార్యదర్శి ఎరగడ్లమాల వేశారు.

(4) మన ఆహారమంత్రి శ్రీ ఉర్లగడ్డ సాంబార్ గారు, మూడువందల రూపాయలతో ఖర్చుపెట్టి కట్టించిన మసాలా దోసెల కేంద్రానికి ప్రారం భోత్సవం జరిపారు. ఆయన ఆ సమయములో మాట్లాడుతూ, "ఈ మధ్య దోసెలలో కారం తక్కువ వేస్తున్నారని, ఇడ్లీ— మెత్తగా ఉండదని చెట్నీలోకి కొబ్బర వేస్తే మరింత రుచిగా ఉంటుం దని" అన్నారు.

(5) నూతన ఢిల్లీలో జరిగిన ప్రపంచ ఆరోగ్య మహాసభలో, కేంద్ర ఆరోగ్యమంత్రి, శ్రీ టైఫా యిడ్ ప్రసంగిస్తూ, రోగులకు సరాఫరా అవుతున్న పాలు బ్రెడ్డూ అంతా, వర్షాలపాలే అవుతున్న దనియు దీనిని సాధ్యమైనంతవరకు అరికట్ట టానికి ప్రయత్నిస్తామనియు చెప్పారు. ఈ విష యాలను పరిశీలించుటకు నలుగురు సభ్యులతో ఒక సంఘము ఏర్పాటు చేశారు.

వార్తలు మీరు వింటున్నారు.

(6) పేరయ్యపెట్టే ఇంట్లో జరుగుతున్న నల్లులు, దోమల పోరాటంలో, సుమారు వంద నల్లులకు పైగా చనిపోయినట్లు, రెండు వందల దాకా గాయ పడినట్లు, ప్రెస్— ట్రస్టు— ఆఫ్ — ఇండియా తోగట్ట (P. T. I.)

(7) పటాస్ కోటవద్ద జరిగిన రైలు ప్రమా దంలో, రెండు చక్కిలాలు, మూడు లడ్లు నామా రూపాలు లేకుండా చనిపోయినట్లు, పాతిక— గారెలు దాకా తునా— తునకలైనట్లు ఇప్పటి కందిన సమాచారమును బట్టి తెలుస్తున్నది. ప్రమా దానిక్కి కారణాలు తెలియవు.

(8) దేశరక్షణ నిధికి నలుమూలల నుంచి విరివిగా విరాళాలు వస్తున్నట్లు, అందులో సగం భాగమంతా రవలడ్లు, మెరపకాయ బొండాలు ఉన్నాయి అన్నారు మా ఆకాశవాణి ప్రతినిధి.

(9) వెస్టు ఇండీస్ జట్టుకు— మన జట్టుకు జరుగుతున్న హాకీ ఫైనల్‌లో, తుది క్షణంలో, పిల్ల రేటు మీదకి పిచ్చి వెళ్లి ఆట డ్రా చేశారు.

(10) దేశంలో వాతావరణం మోతగా ఉం టుంది. పగలు సూర్యుడు, వెలుతురు, రాత్రి అంతా చీకటిగా ఉంటుంది. ఆకాశమంతా విశా లంగా ఉంటుంది.

(తెలుగులో వార్తలు ఇంతటితో సమాప్తం.)

పి. వి. కాష (ధర్మవరము) ★



# సరాగమాల

## వి ఎ కె రంగారావు

### రికార్డుల రివ్యూ

అనురాగం ఎన్. 69773.

భానుమతి పాడిన "సన్నజాజి" ఇంతకుముందే పరిచయం చేశాను. పై రికార్డులో ఒక ప్రక్క ఆ పాట, రెండవప్రక్క ఆత్రేయ లిఖితమైన "ప్రేమా, పిచ్చీ" ఉన్నవి. ఈ రెండవ పాట గురించి నిజం చెప్పుకోవాలంటే, సినిమాలో ఈ పాటకు ఉన్నంత విశిష్టమైన స్థానం మరే పాటకూ లేదు. కారణాలు సన్నివేశంలో బలం పైగా అసలైన భానుమతి కలస్వనం ఆ మూడూ అంతటి స్థాయిలో మండబట్టే "అనురాగం" లో ఈ పాట ఒక మరువరాని రాగంగా నిలిచింది. విశేషించి చెప్పుకోవలసింది భానుమతి పాడటం. ఆమె కంఠాన్ని గురించి కాదు. ఆమె పాడిన విధానాన్ని గురించి. "మవ్వా నేమాప్ళ" అనటం, "ఊ బబ్బో" అనటం, వినటం జరగాలే గాని చెప్పడం పడదు. సంగీతం పెండ్యాలదే. ఒక ప్రఖ్యాత రచయిత అడుగుజాడల్లో అనాలంటే,

> ఒహో ఎస్. పెండ్యాల
> పాడె రీయని శోం
> అదియె సంగీత లీల
> ఓ కూనలమ్మా!

* * *

పాఠకులకు : మీరు వ్రాసే ప్రతి ఉత్తరంలోను మీ పూర్తి అడ్రసు ఉండాలి. కేవలం కవరు మీదనే వ్రాస్తే చాలదు. పత్రికా ముఖంగా జవాబులు వచ్చే రెండు నెలల్లో ఇవ్వటం కష్టం. కాబట్టి మీమీ ప్రశ్నలతోబాటు ఋరవ్రై అయిదు నయాపైసల తపాలాబిళ్లలు పంపడమే మేలు. రిప్లయికార్డులు, స్టాంపు కవర్లు పంపవద్దని కోరిక. ఇక వ్రాసేవారికి ప్రార్థన : ఇతర పత్రికల గురించి, వాటిల్లో నా వ్రాతల గురించి పడే విమర్శల గురించీ నన్ను ప్రశ్నించవద్దు. అవిధంగానే లీల కంఠం బాగుంటుందా కోమలదా అన్న మీమాంసలు కూడా వదిలేయండి. లీల పాడిన పాటకు లీల కంఠం కోమల పాడిన పాటకు ఆమె కంఠం బాగుంటాయి. ఉత్తరానికి మూడు నాలుగు ప్రశ్నలకన్నా ఎక్కువ పంపవద్దని మరో వేడుకోలు.

* * *

"అనుబంధాలు" చిత్రం ఇటీవలనే విడుదలయింది. మీలో చాలామంది చూసేఉంటా రను కుంటాను. ఎం. బి. శ్రీనివాస్ అనే సంగీత దర్శకుడు పనిచేసిన తొలి తెలుగు చిత్ర మిది. 'స్నేహదీప' మనే మళయాళ చిత్రంలో "కామ దహన" అనే పేరి శహానా రాగపు పాట విన్న దగ్గర నుంచి పేరి సంగీతమంటే నా కత్యంత అభిమానం. ఆ అభిమానం ఈ చిత్రం చూడగానే ద్విగుణీకృతమైనది. ముఖ్యంగా చెప్పుకోవలసిన పాటలు "నాపేరు పెంయేరు." ఎల్లారీశ్వరి పాడిన ఈ పాట రచన (సి. నా. రే) ఎంత ఉత్కృష్టంగా ఉందో ఛాయాగ్రహణం (వి. వెంకట్) అంత అనుగుణ్యంగా ఉంది. మరొక సి. నా. రే. పాట, రచన వారి స్థాయిలో లేకపోయినా వరస, జమునారాణి పాడటం, వాద్య రచనా బ్రహ్మాండంగా ఉన్నది. "అందుకే తొందరగా ఉన్నది." శ్రీనివాస్ జమునారాణి యుగళ గీతం, ఒక జానపద నృత్య గీతం (రెండూ కొసరాజువి) ఘంటసాల పాడిన దాశరథి గేయం సుశీలతో, ఒకటేమిటి అన్నీ బాగున్నవి. మన నిర్మాతలు స్వయం ప్రతిభను పోల్చేవారయితే, మెచ్చేవారయితే ఈ యువ, నవ సంగీత దర్శకునికి సుహాజ్జ్వలభావి ఉంటుంది. ఉండాలి. తథాస్తు!

* * *

> "ఝుమ్మను తుమ్మెదలా
> రొదలా పాదనాటులా
> మురిపింతునురా ఆటలా
> మరపింతునురా పాటలా
> ఓ పరదేశీ మరే జాడలా
> చూడవురా ఈ హాయినీ."
>
> మల్లాది—సుబ్బరామన్
> బాలసరస్వతి—స్వప్నసుందరి.

* * *

ప్రైవేటు రికార్డు జి. ఇ. 22793.

ఈ రికార్డులో ఎమ్మెస్ రామారావు పాడిన అష్టపదులు ఉన్నవి. వారి సుందర మందర గాత్ర వాహిని కోసం ఇన్నేళ్లుగా వేచివున్న ఆంధ్ర ప్రజానికి ఒక చల్లని కానుక. ఈ పాటల వెనుక ఒక చిన్న కథ.

అనగా అనగా నాలుగేళ్ల క్రితం ఒక మారుమూల పల్లెటూళ్లో "రక్తకన్నీరు" నాటకం వేయగా ఎమ్మెస్ రామారావుగారిని కలుసుకొనే అవకాశం కలిగింది. అప్పట్లో నాకు గ్రామఫోను రికార్డు జగత్తుతో పరిచయం ఉండేదికాదు ఇప్పటిలా ప్రవేశంలేదు. ఇంతకు ముందు అన్ని



'లక్షాధికారి'లో హాస్యత్రయం రేలంగి, సూర్యకాంతం, రమణారెడ్డి.

మంచి పాటలు రికార్డులుగా ఇచ్చేవారు కదా, అలా ఇప్పుడేం చేయటం లేదని రామారావు నడిగితే అప్పటికి నవ్వేసి ఊరుకున్నారు. సంగీత చర్చ జరపటానికది తగిన సమావేశం, సమయం కాదనుకున్నారో యేమో! దరిమిలా నేను మద్రాసు వెళ్ళినపుడు ఆ పరిచయం పురస్కరించుకొని చూడబోగా కూర్చోబెట్టి అయిదారు అష్టపదులు తంబూరా ఆసరాతో వినిపించారు. అంత భావయుక్తంగా నేను అష్టపదుల్ని అంతకు ముందెప్పుడూ వినలేదు. నాలుగేళ్ళ పాటు గీత గోవింద మధనం మననం చేసుకొని, ఆయా అష్టపదులకు తగిన రాగాలు వూహించుకొని ఈ వరసలు చేశానని అన్నారు. అంతేకాదు వీటిని రికార్డులుగా ఇవ్వాలని ఉందని కూడ అన్నారు. ఈ మాట కోసమే యెదురు చూస్తున్న నాకు వెల్లమాలిన సరదా వేసింది. ఆ అయిదారింటిలో నాకు ప్రత్యేకంగా నచ్చినవి మూడు. వాటిలో రెండింటిని తప్పక రికార్డు చేయించాలని నా పట్టుదల. ఆ పట్టుదలతోనే సరస్వతీ స్టోర్స్ చుట్టూ వారానికొకసారి ప్రదక్షిణం చేసి సాధించాను. వాటిని ఆనందించే భాగ్యం సహృదయులూ, సరస సంగీత ప్రియులూ అయిన శ్రోతలందరిదీ. కథ కంచికి. మనం పరిచయానికి.

ఇందున్న అష్టపదులు "రమతే యమునా పులినవనే" "రాధికా తవ విరహే కేశవ." శ్రీ జయదేవుని రచనల శబ్ద సౌందర్యాన్ని, భావ గాంభీర్యాన్ని పూర్తిగా చెప్పబూనటం సాహసమే అవుతుంది. వాటిలో ఉన్న నిర్మల భక్తి భావమూ, పవిత్ర శృంగారమూ, అర్థం చేసుకోగలిగిన వారిని పునీతుల్ని చేస్తాయి. అర్థం కాని వారిని కేవలం బాహ్య సౌందర్యం చేతనే మెప్పిస్తాయి. వాటి మహోత్కృష్టతను మనసులో పెట్టుకొని వాటికి సంపూర్ణ న్యాయం చేకూర్చేటట్టు వరసలు చేయటం జరిగింది. "రమతే" దర్బారీ కానడలో ధీరంగా ఉంది. "రథునా" అన్న పదాన్ని మూడుమార్లు వాడుతూ వారు వేసిన సంగతులు అతి మధురంగా ఉన్నవి. "యమునా తీరములోన ఇసుక తిన్నెలపైన, రాధా మాధవ పేమ రమణీయకేళి" ఇందులో వర్ణితం. రెండవ గీతంలో రాధిక విరహ వేదన సఖి కృష్ణునికి శుభపంతువరాళిలో స్పష్ట పరుస్తున్నది. ఎమ్మెస్ రామారావు కంఠం ఈ రేయి నా డెంత హాయిగా ఉందో ఈ నాడు అంత తీయగానే ఉంది. ఇంత చక్కని గాయకుణ్ణి ఉపేక్షించిన సినిమా ప్రపంచంపై నాకు జాలివేస్తున్నది.

* * *

సరదా పాటలు పాడటంలో పిఠాపురానికి ఈడైనవారు ఉన్నా మించినవారు మరిలేరని కంచు ఢక్కా వగలగొట్టి మరీ చెప్పవచ్చు. ఈ గాయకుని కంఠంలో ప్రత్యేకతను యెందరో సంగీత దర్శకులు గమనించారు. తమ పాటలలో వారి ప్రావీణ్యతను అపూర్వంగా ఉపయోగించుకున్నారు. పక్షైటూరి వాడి చేత కూడ 'పిఠాపురం మా బాగా పాడతాండ్రా' అనిపించారు. ఎటొచ్చీ గ్రామఫోన్ కంపెనీ వారే అర్థంలేని పాటలు, అనకతవక వరసల్లో పాడించి వారి మంచికో వన్నె తగ్గించారు. పిఠాపురం కంఠం యెంత చక్కగా యెన్ని రకాల భావాలు పలుకగలదో ఆ కంపెనీవారికి తెలియక



'బందిపోటు'లో కృష్ణకుమారి.



'పునర్జన్మ'లో కృష్ణకుమారి.



'లక్షాధికారి'లో రేలంగి.

# సరాగమాల

పోవచ్చును. అయిన పక్షంలో పిఠాపురం ఇతర సంగీత దర్శకులకు పాడి సెభాసనిపించుకున్న పాటలు ఒక్కసారి వినవచ్చుమగా ? వారి కంఠంలోని రక్తశక్తి అప్పుడు సుస్పష్ట మవుతుందిగా ? అశ్వత్థామకు పాడిన అతి సొగసైన పాట "విన్నే విన్నే ఏయ్‌ఏయ్ వన్నెల చిన్నారి" సమాజం? లోనిది. ఆ అశ్వత్థామకు పాడిందే భక్తిరస గీతం "జగన్నాటకం"లోనిది. "జగన్నాటక సూత్రధారి" అన్నది(ఎన్. 69572). "పెండ్లి తాంబూలం"లో విశ్వనాథ(రామమూర్తికి ఈశ్వరితో కలసి పాడిన తాజాతాజా మజాగీతం "అమ్మాయీ నేనొకటి చెబుతాను వింటావా" (జి. ఇ. 35204) ఈ పాటలో "వీ చక్కని నవ్వు" అన్న చోట పిఠాపురం విరిచిన విరుపు యెవరికి వస్తుంది ! పెండ్యాలకు "శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం"లోనూ "వాగ్దానం"లోను పాడిన పల్లె పాటలు "పదవే పోదాము గౌరి" (నెం. 69563) "మా కిట్టయ పుట్టిన దినము" (నె. 69694). "అపూర్వ చింతామణి"లో కె. వి. మహదేవన్‌కి పాడిన "గూటిలోని చిలక గూడువదలి రాదు." ఈ పాటల్లో కొన్నైనా, ఒక్కసారైనా వింటే తెలుస్తుంది పిఠాపురం ప్రజ్ఞ యేమిటో. వారి స్వయం ప్రతిభ నెరుగకుండా వారిచే వారిని వీరిని అనుసరించమనడం ఏమి న్యాయం ? ఇదుగో పెండ్యాలకు పిఠాపురం పాడిన మరో హుషారు పాట.

అనురాగం నె. 69774.

"జాతైన ఎద్దురా" పాడింది ఇద్దరు. వరదా బండి పాటలూ, పసందైన విందు పాటలూ పాడటంలో ఒకరిని మించిన వారు మరొకరు. మాధవపెద్ది, పిఠాపురం. వ్రాసింది, ఇంకెవరు కొసరాజు. ఇందులో సంగీతానికి ప్రాముఖ్యత లేదు. అంతా కొసరాజు మాటల ఈటెలకు, గాయకుల గాత్రంలో ధ్వనిస్తున్న అల్లరికి, తెరపై రేలంగి, పేకేటి వేసిన వేషాలకూ ప్రాధాన్యం. పెండ్యాల చేతయిన వాడు కాబట్టి మాధవపెద్ది చేత "లవకుశ' నాటకాలు వేయించలేదు పిఠాపురం చేత అయిదు వాద్యాలిచ్చి శంకర్‌జైకిషన్లను అనుకరించమనలేదు. కంఠాలకు తగిన పాటలనిచ్చి, తమ గొప్పతనాన్ని, కంఠాల గొప్పతనాన్ని తెల్పుకున్నారు.

రెండవప్రక్క ఆత్రేయ "అమ్మ" గురించి వ్రాసిన చక్కని రచన, ఘంటసాల సోలో. ఇందులో కూడ సంగీతానికి ప్రాధాన్యత తక్కువ. భావానికీ, సన్నివేశానికీ ప్రాముఖ్యత యెక్కువ. తదనుగుణ్యంగా పెండ్యాల వరసను మలిచారు. ఘంటసాలచే పాడించారు. అయినా ఆత్రేయ సాహిత్యానిదే పై చేయి.

మనిషంటే మనసుండాలి, మనసుంటే
మన్నించాలి
నమ్మకముంటే ఆగిపో ఇది నమ్మనుకుంటే
సాగిపో
బందాలే త్రెంపిపో'
అరుద్ర ? ఆత్రేయ ? బాలసరస్వతి పెండ్యాల
"అంతే కావాలి" ★

### పోలీస్ చీఫ్ మైక్ గియక్

# "సర్కస్‌తో పయనించిన మరణం"

## నా అనుభవంలో కెల్లా పెద్ద పరిశోధన-18 (వాన్‌కువర్, బి. సి. కెనడా)

ఆటస్థలం, సర్కస్ అంటే ప్రతి వారూ ఇష్టపడతారు. బ్రిటిష్ కొలంబియాలో ఉన్న 'క్వెస్నెల్' (ఒక వూరు) చుట్టు ప్రక్కల ప్రాంతాల వారు మాత్రం సర్కస్ గుడారం ఆ ప్రాంతాలకు వస్తే చాలు. మహదానందంతో ఎగిరెగిరి గంతులు వేస్తారు. పాపం ! కెనడాలో 'ఆ ప్రాంతం' మిగతా ప్రాంతాలతో సంబంధం లేకుండా ఉంటుంది. సంవత్సరంలో చాలా నెలలు దుర్గమమైన మంచు అఘాతాలు ఏర్పడి, మిగతా ప్రపంచంతో వారికి కల సంబంధ బాంధవ్యాలను తెంపివేస్తాయి. ఆ రోజుల్లో వాళ్లంతా కలిసి 'ఒంటరితనం' అనుభవించాల్సి వస్తుంది. పరాయి చోట్ల నుంచి ఏ రకమైన వినోదాలు రావు గనుక, ఉమ్మడి ఆనందం కోసం కొత్త రకమైన వినోదాలు కనిపెట్టి ఆనందం పొందుతారు. అలాటివారికి ముచ్చట గొలిపే త్రివర్ణాలతో 'ఎదురుచూడండి' అనే సర్కసు ప్రకటనలు వచ్చే సరికల్లా వారి ఆనందం వర్ణనాతీతం. గత వేసంగికి సర్కసు ఆడి వెళ్లిన నాటినుండి పిల్లలు పిడతల్లో దాచుకున్న డబ్బంతా పిడతలు పగుల గొట్టి బయటికి తీస్తారు. సర్కసుకు చూడ వచ్చే అందమైన ఆడపిల్లలను చూచి ఆనందించ వచ్చని కుర్రకారు ఆనందిస్తారు. ముసలివాళ్లు కూడా యవ్వనవంతుల్లా గంతులువేస్తూ గంభీరంగా మాట్లాడుతూ కొత్త 'టోపీలు, బటలు, స్టైలు' కొనుక్కుంటూ అదేమంటే సమర్థించుకుంటూ ఆనందిస్తారు. సర్కసువాళ్లు వచ్చి గుడారాలు వేసుకోవడానికి కొట్టే మేకుల చప్పుళ్లకే—క్వెస్నెల్ జనాభా రెట్టింపయిపోతుంది. ఆ చుట్టుపక్కల కూత వేటులో ఉన్నవా రందరూ కట్టలు కట్టుకు వచ్చేస్తారు. దూరభారాల్లో కాస్త అసింటా ఉన్నవారు జీపులమీద, ట్రక్కులమీద, గుర్రాలమీద, గుర్రపు బగ్గీలమీద వస్తారు. మరీ దూరంగా, విసిరివేసినట్లు ఉన్నవారు 'హాపింగ్ ఫ్లైలట్స్' (ఓ రకం చిన్న విమానాలు) మీద వస్తారు. క్వెస్నెల్ వీధులన్నీ రాజవీధుల్లా వింత సోయగంతో, కొత్త ముఖాలతో, యవ్వనంతో కళకళలాడిపోతాయి.

వంటరితనంలో వైరాగ్యంచేత తెలివి సంపాదించుకున్నవారు, అంతా మన మేలుకే అనే జాతి వ్యవసాయ దారులు, లొడ లొడ మాట్లాడే జాతి (జాతి కాదు) వారు, వ్యాపారులు, బాలురు, ఒకరేమిటి, అంతా వస్తారు.

క్వెస్నెల్‌లో ఉన్న కుర్రకారుకు ఈ సంబరం ఓ మహారాణి పట్టాభిషేక మంత, దేవతల దేశం వెళ్లినంత మహదానందం కలుగజేస్తుంది.

*　　*　　*

డానాలీ కార్బెట్ ఉత్సాహవంతురాలు. గత సంవత్సరం శీతాకాలం మంచి సర్కస్ విశేషాలు విశేషంగా చదివి, వంట పట్టించుకుంది. తను పెద్ద పులులను, క్రూరమృగాలను మచ్చిక చేసుకున్నట్టు, చాలా ఎత్తుగా ఉన్న కర్ర ఉయ్యాలల మీద ఊగి జనాన్ని సంభ్ర మాశ్చర్యాలతో ముంచెత్తినట్టు కలలు కనేది. ఆమె చెవుల్లో 'ఆ' బ్యాండు మేళం రింగ్ మనేది. పోయినేడాది సర్కసు వచ్చి వెళ్లిన నాటి నుండి రోజూ క్యాలండరు చూస్తూ గడిపేది. చివరికి అనుకున్న 'ఆ' రోజు రానే వచ్చింది.

ఆనాడు కార్బెట్ కుటుంబమంతా క్వెస్నెల్‌కి బయలుదేరారు. పట్నం చేరి, గుర్రపు బగ్గీలు దిగి, గుర్రాలను కట్టేసి, ఆమె తండ్రి డానాలీకి ఒక డాలరు, ఆమె స్నేహితురాలు (వారింటి కాపలాదారుని కూతురు) షెరాన్ బొల్సెన్‌కి ఒక డాలరు యిచ్చారు.

డానాలీ, షెరాన్ ఇద్దరూ చట్టా పట్టాలు వేసుకుని చెంగు చెంగున గెంతుతూ సర్కసు స్థలానికి పరుగెట్టు కెళ్లారు. డానాలీకి పన్నెండేళ్లు. చక్కని పొడగరి. మంచి దర్పం కల మనిషి. చక్కగా ఎదిగిన అవయవ సౌష్టవంతో చూసేవారికి ఇరవయ్యో పడిలో ప్రవేశించిన, (లేక ప్రవేశించనున్న) పిల్లలా కనుపిస్తుంది. షెరాన్ ఆమెకన్నా రెండేళ్లు పెద్దదయినా, పొడగరి. చక్కని అవయవ సౌష్టవం ఉన్న మనిషి కాదు. పైగా పెద్దగా చదువుకున్నది కూడా కాదు. ఇద్దరూ సర్కస్ స్థలానికి మహదానందంతో చేరారు.

"రండ్రండి ! రావడానికి మీకు హక్కుంది. ముందుకు రండి. తరువాత ఆట మొదలు పెట్టేస్తున్నాం. ఓంగోపాంగో నుంచి వచ్చిన అమ్మాయి కూడా ఉంది. త్వరగా రండి. నమ్మ శక్యంకానే కాదు. చూచి తీరాలి" అంటూ సర్కస్‌కి సంబంధించినవారు యాగీ చేస్తున్నారు.

*　　*　　*

విద్యుద్దీపాల కాంతులు (దాంతో దీపాలు) ఆకాశాన్ని అంటుతున్నాయి. ఆ ప్రదేశమంతా చూడ ముచ్చటగా ఉంది. డానా, షెరాన్ యిద్దరూ చట్టా పట్టాలు వేసుకుని తిరిగారు. పాప్ కారన్ కొనుక్కుతింటూ ఒకచోట ఆగారు. అక్కడ వేదిక మీద ఒక అందమైన కుర్రా డున్నాడు. అతని తొడమీద అతని రూపురేఖలుగల ఒక బొమ్మ ఉంది. అతని కనుబొమ్మలవంటి కనుబొమలు, దేహచ్ఛాయ, ముక్కు మూతి తీరు—ఒకటేమిటి? అన్నీ అంతే !! అతని వెనకాల ఉన్న పోస్టర్ (Poster)లో—అతని పేరు ఎడ్డి అని, అతని బొమ్మ పేరు చిన్న ఎడ్డి అని, వారు హాలీవుడ్‌లో పేరు ప్రఖ్యాతి గాంచిన హాస్య జంటని, అంతేగాక వాళ్లు వెంట్రిలాక్విజమ్ (వేరొక స్థలము నుండి వచ్చు మాటలవలె వినబడేలా మాట్లాడే ఒకానొక విద్య)లో చాలా అఖండులని ఉంది. చిన్న ఎడ్డి డానాలీకేసి చూస్తే, జనానికి వినబడే అంత గట్టిగా ఎలుగెత్తి "ఏయ్ ! నువ్వు భలే అందంగా ఉన్నావు" అని అరిచాడు. డానాలీ ఒక్క నిముషం సిగ్గుపడింది. అనక ఆమె శరీరం గర్వంతో రెట్టింపయింది. ముఖంమీదికి వచ్చిన చిరునవ్వును అదుపులో పెట్టుకుంటూ" చాలా మంచిది" అంది.

చిన్న, పెద్ద ఎడ్డిలు ఏవో మాట్లాడుకుని ఏవేవో కథలు చెప్పి అనక, "నీవే నా దానవైతే" అని జమిలిగా పాట ప్రారంభించారు. ఆ కట్టె పోయేక, జనమంతా వెళ్లబడ్డారు. డానా మాత్రం మత్తెక్కిన కళ్లతో అతనికేసి చూస్తూ నిలబడిపోయింది. ఆమె చూసినవా రందరికన్నా ఎడ్డి చాలా అందంగా ఉనడం నిస్సందేహం. చిన్న ఎడ్డి ఆమెను 'అందంగా ఉన్నా' వనగానే ఆమెలో ఒక రకమైన మార్పు వచ్చింది. పెద్ద ఎడ్డి వేదిక చివరికి వచ్చి "ఆట అయ్యాక నాతో కలిసి భోజనం చెయ్యకూడదూ ? ఏం ? నీ కిష్టమేనా?" అన్నా డామెతో. డానాకి నోరు మెదల్లేదు. నోరు తెరిచి మాట్లాడే లోపునా షెరాన్ ఆమె జబ్బ పుచ్చుకుని, బర్రున లాక్కెళ్లిపోయింది.

మరోచోట ఒక వయస్సు మళ్లినాయన కబుర్లు చెబుతున్నారు. వాళ్లని అతను సర్కస్ చూడమని బలవంతం చేశాడు. అతన్నందరూ బార్నీ 'మామ' అని పిలుస్తారు. అతను పాముల నాడించడంతో ఆరితేరినవాడు. ఓ ఆరడుగుల కొండచిలువను మెడ చుట్టూ తిప్పుకున్నాడు. విషసర్పాలను తలచుట్టూ చుట్టుకున్నాడు. వాట్ల నోళ్లు చీల్చి జనానికి చూపించాడు. అతని ముఖంలో కరుణరసం ఎగిరిపోయింది. పాము కాటువల్ల ఎంత గొప్పవాడైనా

—84 వ పేజీ చూడండి



"ఏం నారదా ! భూలోకవాసులు నా గురించి ఏమేం తయారు చేస్తున్నారు ?"

ఏం చెప్పను స్వామీ ! మీ కొక శత్రువు మొరార్జీ అనువాడు అక్కడ గలడు వాని బాధలకు తాళలేక మీకు వారంతా పూలూ పత్రి మాత్రం తయారుచేస్తున్నారు.



ఆర్. సీతారామారావు

ఉపక్రమణిక :

నేను మీకు ముగ్గుర్ని పరిచయం చేస్తాను. వారు నా స్నేహితులు. వారి కథలను మీకు చెబుతే 'మమ్మల్ని పత్రికల్లోకి గూడా ఎక్కిస్తున్నాడే!..... అయ్!'' అని నామీద విరుచుక పడతాడు....... నేను చెప్పను. వారి స్వగతాలు వారే చెప్పుకుంటారు.

## సుబ్బారావు

ఈ కథ వ్రాసే ఆయన నా మిత్రుడే! కాదనను... కానీ, మీ అందరి ముందరా నిలబెట్టి 'నీ కథ నీవు చెప్పుకో'' అని నన్ను నిలదీస్తే నేనేం చేయను చెప్పండి? అదిగాక — ఏదైన ప్రజోపయోగమైన పనిని చేసి, చరిత్రలాగా చెప్పుకోటానికి ఇది అటువంటిది గాదాయె! ఇది ఉట్టి ప్రేమకథ... నా గాథ కాదు సుమండీ! రామ్మూర్తిగాథ..... నాటకాల్లో సూత్రధారుడికి మల్లె ఈ ప్రేమ కథలో నా వాటా గూడా వుంది.

కథ మొదలు పెట్టబోయేముందు రామ్మూర్తి విషయం మీకు చెప్పాలి. అన్ని కథల్లో నాయకుడికి మల్లే మా వాడికీ కొన్ని ప్రత్యేకత లున్నాయి. అయితే అందరు నాయకులకు మల్లే మావాడు ఆరడుగులు ఉండడు. ఆజానుబాహువు అంతకన్నా కాడు. విశాల నయనాలు అసలే లేవు.....సుస్ఫురద్రూపి కాదుగానీ, వాడ్ని ఒక్క తడవ చూస్తే చాలు ఎప్పుడూ స్ఫురణకు వస్తుంటాడు. ఒక్క మాటలో చెప్పాలంటే వాడుట్టి వినాయకుడు!

## కథకుడు

సుబ్బారావు మాటలు నమ్మకండి! రామూర్తిని దుయ్య బట్టటమే వీడిపని. సుబ్బారావుకు అమాయకులను ఏడ్పించటం హాబీ! ఇడ్లీలను తిన్నంత తేలిగ్గా ఇతరులను ఏడ్పించటం వాడికి వెన్నతో బెట్టిన విద్య! అగ్నిదేవుడికి, వాయుదేవుడి సహాయం మాదిరి. ....అగో! అటు చూడండి.......వస్తున్నాడే......రమణ! వాడు సుబ్బాయికి ప్రక్క వాయిద్యం!

## రమణ

ఫుల్‌స్టాప్! కథకుడు మీకు ఎంత దగ్గరివాడైనా వాడి మాటలు నమ్మకండి సార్! మీరు గౌరవనీయులైన పాఠకులు! నిజం దాచినా దాగదు........ఈ కథలు వ్రాసేవాళ్లు నిజాన్ని చివరిదాకా మీకు కన్పడకుండా మాలాంటి పాత్రల కింద దాచేసి, చివరికి ''ఇదోయ్! అసలు సంగతి!'' అని మిమ్మల్ని తెల్లమొగం వేయించటానికి ప్రయత్నిస్తారు! అప్పటికే మీరు జీనియస్సులు గాబట్టి అంత చప్పగా వాళ్ళకు సరెండర్ గారనుకోండి! అది వేరే విషయం.

—చూడండి.......ఈ కథ మొదట్లో 'ప్రేమాయణం' అన్నాడు గదూ కథకుడు. ఇది రామ్మూర్తి ప్రణయగాథ! చాలా ఇంటరెస్టింగ్ కావ్యము. ఈ క్లాసిక్కును వినే ముందు నేనూ, సుబ్బారావూ బృందగానం చేస్తాము. మధ్య మధ్య మిమ్మల్ని కథకుడూ, నాయకుడు రామ్మూర్తీ డిస్టర్బ్ చేస్తారు!.......అగో రామ్మూర్తి! ఏదో స్వగతం చెబుతున్నాడు. అది వినండి! అసలు విషయానికి తర్వాత వద్దాం!

## రామ్మూర్తి

సౌందర్యోపాసన నాలక్ష్యం! ఈస్తటిక్ స్పిరుటున్న ప్రతివాడూ ప్రేమిస్తాడు. కొంతమంది మానవులను......కొంతమంది బొమ్మ కుక్కల్ని...... కొందరు క్రికెట్టు ఆటనూ......అదే మాదిరి నేనూ ప్రేమించాను!........నీలవేణిని ప్రేమించాను. పేరు చెబుతుంటేనే వళ్ళు గగుర్పొడుస్తున్నది. గుండె గొంతుకలోన కొట్లాడుతున్నది......శరీరం తేలిపోతున్నది! నీలవేణి అందమయింది! అది కాదనటానికి దమ్ము లెవడి కున్నాయి ? ఓర్వలేనివాళ్ళు ఆమె మీద తప్పుడు ప్రచారం చేస్తేమాత్రం చెల్లుతుందా? సన్నగా, నాజూగ్గా, ప్రబంధ కావ్యంలోని సుందరికిమల్లే ఉంటుంది! గిట్టనివాళ్ళయిన రమణా, సుబ్బిగాడూ ఓకు చెటు మాదిరి ఉంటుందని చెప్తారు! నమ్మకండి......ఆమె కండ్లల్లో వింత తేజస్సు వుంది! అవి అమృత భావాలు చిలకరిస్తాయి! మాటలకు అలవిగాని మన్నితమైన భావాలను చెబుతాయి! .....ఆమె ముక్కు సంపెంగ పుష్పం...... .ఆమె చేతులు తామర తూడులు.....

## సుబ్బారావు

సార్ మీరు వాడి గాథ వినలేరు......అది పెద్ద బాధగా ఉంటుందని తెల్సు! నేను మధ్యలో వాడి స్పీచ్చి ఆఫ్ చేయబట్టి సరిపోయిందిగానీ, వాడు అదే పనిగా ఏక బిగిని వర్ణించేయగలడు. ఆమె చేతులు తామర తామరతూడూలా ......

ఆమె కాళ్ళ అరటి చెట్లూ అని! అసలు ఏం జరిగింది అంటే.........

**రమణ**

.....రామ్మూర్తి నీలవేణిని ప్రేమించాడు. ఆ ప్రేమించటం అసలు ఎట్లా ప్రారంభమయిందంటే?

ఒకరోజు ఎప్పటి మాదిరే ప్రొద్దు వాటారింది. గూళ్ళలోకి పక్షులు చేరటానికి ఇంకా గంట సమయముంది. ఆఫీసుల్లో మాదిరి కళాశాలల్లో నియమ నిబంధనలు లేకుండా లేపు గాబట్టి, బెల్లు కొట్టగానే విద్యార్థి పక్షులు గుంపులు గుంపులుగా గూళ్ళకు చేరుకోసాగాయి. అందులో ఒక పక్షి అయిన రామ్మూర్తి అప్రయత్నంగా ముందు నడుస్తున్న అమ్మాయిని వెనకనుంచే చూసి "బాగుంది సుమీ" అనుకున్నాడు అసలు రామ్మూర్తి ఆ విధంగా అనగూడదు! అనుకోటానికి గూడా వీలు లేదు. కారణం ఏమిటంటే రామ్మూర్తికి అమ్మాయి లంటే విపరీతమైన భయం!........దానికితోడు వాళ్ళంటే తగని గౌరవం. పై పెచ్చు బ్రహ్మచర్య సిద్ధాంతాలమీద నిష్ఠ గలవాడు ఆంజనేయుడు మొదలుకొని వివేకానందుడివరకూ అతని ఆరాధ్య దైవాలు! కళాశాలలో ఈ 'విషయాన్ని' గురించే చాలాసార్లు అభిభాషించాడు కూడా!

అటువంటి రామ్మూర్తి.......ఆ అమ్మాయిని ప్రేమించాడు. ఆ సాయంత్రం కుంభవర్షం కురిసింది! క్షణంలో సగంసేపు ప్రకృతి స్తంభించింది. ఆకాశంలో తోకచుక్క మెరిసింది! (క్షమించాలి! ఎవరో పెండ్లివారు వర్షం వస్తుందనే భయంతో వూరేగింపుకు సాయంకాలమే బయలు దేరుతే, అందులోని కుర్రకారు బృందం 'హవాయి చువ్వ' ఆకాశం మీదికి వదిలారట .. ..బహుశా మేము దాన్ని చూసే తోకచుక్క అని భ్రమ పడ్డామేమో అని మిత్రమండలి అనుమాన పడుతున్నది దానిమీద ఇంకా నిర్దుష్టమైన అభిప్రాయానికి రాలేదు.) పెద్ద పెట్టున గాలి దుమ్ము వచ్చి నడుస్తున్న రామ్మూర్తిని ఉక్కిరి బిక్కిరి చేసింది అనుడిగాలి సహాయంతో వర్షం రాకముందే రామ్మూర్తి త్వరగా ఇంటికి చేరుకున్నాడు గనుక తడువలేదు!

ఆ రాత్రి రామ్మూర్తి గది బయట పచార్లు చేస్తూ, వర్షం పడటంవల్ల చందమామా, దాని వెనువెంట వెన్నెలా రానందుకు, మనసులో తిట్టుకున్నాడు. విరహవేదన పడటానికి సరిగ్గా వీలు కల్గలేదే అని వాపోయాడు

**ఆరాత్రి....రామ్మూర్తి**

ప్రొఫెసర్ నారాయరావు పంతులుగార్ని అడిగి 'వివేకానందుని జీవిత చరిత్ర', 'వేదాంత పఠనము' తత్సంబంధమైన గ్రంథములను తీసుకొని గదికి బయలుదేరి వస్తుండగా......ఆమె కనిపించింది! నన్ను మురిపించింది! బటానీ లతవలె బక్కగా ఉండటంచేత మరింత అందంగా ఉన్నట్టనిపించింది. చూచినదే తడవుగా నా మనసులో మల్లెలు పూసినవి! గుండెలో మరిమళం వెదజల్లినట్లయింది 'వేదాంత పఠనము' గ్రంథముమీద విరక్తి జనించి 'చింపేద్దునా!' అనిపించింది!......ముందు నడుస్తూ, రెండుసార్లు మాత్రం వెనక్కి తిరిగి చూసింది....... ఆ చూపులకు ఆయస్కాంతపుపూత పూసింది!

జీవితంలో ఎదురైన సరికొత్త అనుభవం ఇది నాకు......రమణ దగ్గరకు పరుగెత్తితే 'ప్రేమ' అన్నాడు. పదం పాతదే!........అనుభవం మాత్రం కొత్తది (నాకు.)

**కథకుడు**

ఆవ్వాళ రమణ నా దగ్గరకువచ్చి 'రామ్మూర్తి ప్రణయం' సంగతి ప్రస్తావించాడు. అంత 'కర్కోటక బ్రహ్మచారి'కి ఇదేం పిచ్చిరా?' అన్నాడు. నేను ఈ విషయంలో అంత శ్రద్ధ చూపించక పోయేసరికి—ఆ రాత్రే సుబ్బారాయ గదికి పరుగెత్తుకొని వెళ్ళాడు.

**రామ్మూర్తి**

నీలవేణి దర్శనమైన నాటి రాత్రి ఇట్టే తెల్లవారింది! రెండో రోజు ఉదయం పది గంటలవేళ యూనివర్శిటీ ఆవరణలో ఎవరో పిల్లవాడు నా దగ్గరకు వచ్చి, 'రామ్మూర్తి మీరేనా?' అని అడిగి, ఏదో ఉత్తరం నా చేతిలో పెట్టాడు.

"గౌరవనీయులైన రామ్మూర్తిగారి పాద పద్మములకు, అబల నీలవేణి నమస్కరించి వ్రాయునది!

ముందు వెనకలు ఆలోచించకుండా, ఒక ఆడది పరాయి మగవాడికి ఉత్తరం వ్రాయటానికి పూనుకోవటం సాహసమే అవుతుంది! కానీ, మీ పరిచయ

> "ఇప్పుడు రామనాథరావు గారు రెండు మాటలు చెప్తారు!" అన్నాడు అధ్యక్షులు సభలో. "ఇంటిపేరు టంగుటూరి!" అని కూర్చున్నారు రా. రా. గారు.
>
> కె పి. (గుంటూరు)

భాగ్యం ముందు ఈ పూర్వాపరాలు ఆలోచించటం లెక్కలోనిదికాదు.......కళాశాలలో మిమ్మల్ని రెండు సార్లు ప్రక్కవాటుగా చూసే భాగ్యం కల్గింది. మీరు 'విద్యార్థులూ—బ్రహ్మచర్య నిష్ఠ'ను గురించి కళాశాలలో మాట్లాడినప్పుడు విన్నాను. మనసు పరవశించింది! అద్భుతమైన మీ వాగ్ధాటికి ఇవే నా జోహార్లు!

ఒకరిముందు 'దేహీ' అని చేయి చాచి అర్థించడంకంటే మహా పాతకం వేరొకటి లేదని నాకు తెల్సు........కానీ మీ మనస్సు వెన్నలాంటిదని గ్రహించిన తర్వాతనే. .....ప్రేమ భిక్షతోపాటు వేరొక చిన్న సహాయాన్ని గూడా అర్థిస్తున్నాను.

ఈ మహా పట్టణంలో మేము చాలా కష్టంగా జీవనం గడుపుతున్నాం! నాకు అన్నయ్య ఉన్నాడు గానీ, సంపాదించటం చాతగానివాడు. కండలు బలిసిన వస్తాదేగానీ .. ...బ్రతికే విధానం తెల్సిన వాడు కాదు. రేపు టరమ్‌ఫీజు కట్టడానికి చివరి తారీకన్న సంగతి మీకు తెల్సు. ప్రస్తుతం డబ్బులకు కట కటగా వుంది. ఇన్నాళ్లు కష్టపడిన చదువు, రేపు ఫీజు చెల్లించకపోతే వృథా అవుతుంది!.... మీరేమీ అనుకోకపోతే దయచేసి రేపటివరకల్లా ఫీజు సర్దడానికి ప్రయత్నించండి!.......అప్పులు! అడిగిన ఈ కొద్దిపాటి సహాయాన్ని తిరస్కరించరని నా గట్టి నమ్మకం! రేపు సాయంత్రం నాలు గంటలకు ఇవ్వాళ మీకీ ఉత్తరం ఇచ్చిన అబ్బాయే యూనివర్శిటీ ఆవరణలో కాచుకొని ఉంటాడు. కాలేజీలో మిమ్మల్ని పలకరించాలనే కుతూహలాన్ని బలవంతాన చంపుకోవల్సి వచ్చింది! పరాయి పురుషునితో తోటి బాలిక మాట్లాడటం సహించలేని ఈ దేశంలో పుట్టిన మనం దురదృష్టవంతులం!.......దయచేసి మీర నన్ను కాలేజీలో మాట్లాడించటానికి ప్రయత్నించకండి ! మీ రెవరో ఎరగనట్లే నేను నటిస్తాను ! దానికి మీరు బాధ పడరుగదూ?

—ఆశలు నమ్ము చేయరనే ఆశతో మీ(కు దగ్గర కాబోతున్న)

నీలవేణి.

నన్ను కాలేజీలో మాట్లాడించే ప్రయత్నం చెయ్యరు గదూ?

—.......పాపం నీలవేణి! ఎంత కష్టంలోవుంది? అడగలేక అడిగింది. అర్థించింది! కాదని తిరస్కరించడం!.... ..అది నేను చేయలేని పని.

"కుమారి నీలవేణికి

రామ్మూర్తి ఆశీర్వదించి వ్రాయునది. నీవు వ్రాసిన లేఖ చేరినది. సంగతులు గ్రహించాను. ఈ రోజుల్లో ఆడవారి స్థితిగతులను చాటే వి నిర్దుష్టమైన అభిప్రాయాలతో నేను ఏకీభవిస్తున్నాను. కాలేజీలో నిన్ను మాట్లాడించటానికి ప్రయత్నించను. ఆడవాళ్ళంటే ఒక ప్రత్యేకమయిన అభిప్రాయం లేని నాకు నిన్ను చూసిన తరువాత వారిని గురించి ఆలోచించే ఉద్దేశ్యం కల్గింది.

డిబేట్సులో నా వాగ్ధాటికి నీ జోహార్లు, కృతజ్ఞతతో స్వీకరిస్తున్నాను.

నీకు వేదాంతముమీద ఆసక్తి ఉన్నదా?

ఇంగ్లీషు సాహిత్యంతో పరిచయ మున్నదా?

బ్రహ్మచర్యను గురించి నీ అభిప్రాయ మేమి?

వక్తలలో (నేను గాక) నీకు నచ్చిన వారెవరు?

జవాబులు ఇవ్వగలవు నీవు కోరిన విధంగా డబ్బు పంపుతున్నాను. ముట్టజూచుకొనగలవు.

రామ్మూర్తి."

**కథకుడు**

రామ్మూర్తి ప్రణయ కలాపం 'టాయిలెట్ సబ్బు ఎడ్వర్టయిజుమెంటులాగా రోజు రోజుకూ ......ప్రోత్సాహకరంగా సాగిపోయింది.

**రామ్మూర్తి**

ఇవ్వాళ మళ్ళీ నీలవేణి ఒక ఉత్తరం వ్రాసింది.

'ప్రియమైన రామ్మూర్తిగారి పాద పద్మములకు, దాసి నీలవేణి నమస్కరించి వ్రాయునది!

—మన విషయం మా అన్నయ్యకు తెల్సింది. అగ్నిమీద గుగ్గిలం అవుతున్నాడు. మీ అంతు తేలుస్తా నంటున్నాడు. నాకు చాలా భయంగా వుంది. ఈ ఆపదనుంచి ఎట్లా బయట పడాల్నో అంతు చిక్కటంలేదు......మనం నిజమైన ప్రేమికులం! ఒకరి నొకరు క్షుణ్ణంగా అర్థం చేసుకున్న తరువాత ఇటువంటి అల్పమైన విషయాలు మన అమర ప్రేమకు అడ్డు గోడలు కట్టలేవు.

మా అన్నయ్యను మీరు చూసే ఉంటారు. మీ కంటె రెండు అడుగులు ఎత్తు ఎక్కువ ఉంటాడు. అంత లావుగాదు కానీ, మొత్తానికి ఒక మాదిరి బలకరంగానే ఉంటాడు. ముఖం మీద స్ఫోటకం మచ్చలుంటాయి. ఎక్కడైనా కనపడితే తప్పుకోండి! వాడసలే కోపిష్టి. మీరని తెలుస్తే మీదపడి గూడా కొట్టగలడు......

63 వ పేజీ చూడండి



# కొలంబా

## రచన: ప్రాస్పర్ మెరిమె

**జరిగిన కథ**

కర్నల్ థామస్‌నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్ వస్తాడు. లిడియా సాహసం గల యువతి. చిత్రలేఖనం తెలుసు. 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం. అక్కడికి వెళ్లడం కష్టనష్టాలతో కూడినపని ఐనా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాతెటో ప్రయాణం అవుతారు. కార్సికాకు బయలుదేరారు. వారితో లెఫ్టినెంట్ "ఆర్సొడెల్లా రెబ్బియా" అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను యీ రెబ్బియాతో పరిచయం పెరుగుతుంది. మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది. వారు కార్సికా చేరారు. పాస్‌పోర్టు ఆఫీసరు మాటలవల్ల, ఆర్సో తండ్రి హత్యకు లోనయ్యాడని మిస్ లిడియా గ్రహిస్తుంది. ఇంతలో ఆర్సో చెల్లెలు కొలంబా అతన్ని వెతుక్కుంటూ అజాచ్చియోకి వస్తుంది. కర్నల్‌గారి వసతంలోనే దిగుతుంది. రచయిత్రి, ఆర్సో తండ్రి హత్యకి సంబంధించిన వివరాలు ఇస్తాడు. బారిచినీ అనేవంశంతో డెల్లా రెబ్బియా వంశానికి వైరం ఉంటుంది.

కొలంబాతో పియత్రనెరాకి వెళ్లిపోయే ముందు ఆర్సో కర్నల్‌గారినీ, మిస్ లిడియానీ కూడా అక్కడికి రమ్మని కోరుతాడు. ఆర్సోతో ఎడబాటుకి మిస్ లిడియా చలిస్తుంది.

ఎంత తక్కువ కాలానికి అయినప్పటికీ ఎడబాటులో కొంత విషాదం ఇమిడి ఉంటుంది. పొద్దు పొడవకముందే ఆర్సో తన చెల్లెలితో బాటు బయలుదేరాడు. మిస్ లిడియా వద్ద సెలవు తీసుకున్నాడు. ఆర్సో కోసమే ఆమె ఇంత పెందలకడ లేచింది. అంతకు ముందు రోజు సెలవు పుచ్చుకునేటప్పుడు మాత్రం వారు ఇద్దరూ చాలా ముభావంగా ఉండిపోయారు. సముద్రయానం తర్వాత జరిగిన సంభాషణవల్ల ఆమె ఆర్సోను కలవటానికే సందేహించింది. ఆర్సో సయితం ఆమె వేళాకోళాలు, ఎత్తిపొడుపులు మరిచిపోలేక పోయాడు. ఆ ఇంగ్లీషు అమ్మాయి ప్రవర్తనలో తనపట్ల అనురాగం కనిపిస్తున్నట్లు అనిపించేది కొన్ని సమయాలలో: కాని వెనువెంటనే ఆమె చేసే ఎగతాళికి ఇదంతా భావకల్పన, భ్రమ మాత్రమే అనుకునేవాడు. విషయం పూర్తిగా మరిచిపోవటమే మంచిదనుకునేవాడు. అందుకనే పొద్దున ఐదు గంటలకే మిస్ లిడియా తన చెల్లెలితో బాటు రావటం చూసి ఆశ్చర్యపడ్డాడు. ఇంగ్లీషువారికీ, అందులోనూ మిస్ నెవిల్‌కీ, ఇది అతివిశేషమయిన 'మెలకువ సమయం'. ఆర్సో కొంచెం ఉబ్బిపోయాడు.

"ఇంత పెందలకడ మీరు లేవవలసి వచ్చినందుకు బాధపడుతున్నాను," అన్నాడు. "మా చెల్లెలు మిమ్మల్ని లేపి ఉంటుంది. నేను వద్దని చెప్పాను! నన్ను ఉరితీసేసినా బావుండేది, అనుకుంటున్నారా ?"

"లేదు," అన్నది మిస్ లిడియా మెల్లిగా, ఇటాలియన్‌లో, తను చెప్పేది కర్నల్‌గారికి అర్థం కాకూడదని కాబోలు. "నేను తమాషాకి అన్నవాటికి అలిగినట్లున్నారు. నన్ను గురించి దురభిప్రాయంతో మీరు వెళ్లటం నాకిష్టం లేదు. మీ కార్సికన్‌లు భలేవారు ! ఇక సెలవు. మళ్లీ కలుసుకుందాము," అని చెయ్యి చాపింది.

ఆర్సో నిట్టూర్పుతోనే జవాబు చెప్పాడు. కొలంబా తన అన్నని అవతలగా తీసుకుపోయి చెవిలో ఏదో చెప్పింది.

ఆర్సో మిస్ నెవిల్‌ని సమీపించి ఇలా అన్నాడు: "మా చెల్లాయి మీకొక కానుక ఇవ్వాలనుకుంటోంది. కాని మా కార్సికన్‌లకి ఇచ్చేందుకు ఏముంటుంది, మా అభిమానం తప్ప ? అది శాశ్వతమయిన కానుక ! ఈ కత్తి విషయమయి మీరు కుతూహలంగా కొన్ని ప్రశ్నలు వేశారుట. ఇది మా వంశంలో తర తరాలుగా వస్తున్న వస్తువు. అందుకని— దాని విలువ చాలా ఎక్కువని— కొలంబా నా అనుమతి తీసుకుని మరీ మీకు ఇద్దామనుకుంటోంది. తీసుకుంటారుగా !"

"చాలా అందమయిన బాకు" అన్నది మిస్ లిడియా. "కాని ఇది మీ వంశానికి చెందినది. నే నెల్లా తీసుకోగలను ?"

"అది మా నాన్నగారిది కాదు," అన్నది కొలంబా కొంచెం ఆవేశంగా. "మా అమ్మ తాతగారికి థియోడోర్ రాజు ఇచ్చాడుట. మీరు దానిని పుచ్చుకుంటే నాకెంతో సంతోషంగా ఉంటుంది."

"చూడండి ! మిస్ లిడియా," అన్నాడు ఆర్సో "ఒక రాజుగారు స్వయాన ఇచ్చిన బాకు వద్దనకండి !"

కార్సికా చరిత్రలో థియోడోర్ పేరు ప్రఖ్యాతి పొందినది. ఇక మిస్ లిడియా కాదనలేక పోయింది. 'సెయింట్ జేమ్స్ ప్లేస్'లో తన గదిలో బల్లమీద ఉంచితే ఎంత సంరంభం కలగ వచ్చు!

"కాని," అన్నది సందేహిస్తూనే ఆ బాకుని తీసుకుంటూ, "మిస్ కొలంబా, మిమ్మల్ని నిరాయుధురాలుగా చేసి పంపిస్తున్నానే అని భయపడుతున్నాను." ఈ మాటలతో బాటు ఒక స్నేహ పూరిత మయిన చిరునవ్వుని కూడా విసిరింది మిస్ లిడియా.

"మా అన్నయ్య నాతోనే ఉంటాడు !" అన్నది కొలంబా విసురుగా "మీ నాన్నగారిచ్చిన మంచి తుపాకి ఉంది! ఆర్సో, తుపాకిలో గుండు, మందు వేశావా ?"

మిస్ నెవిల్ తన కత్తిని భద్రంగా దాచింది. ఆయుధాలు పూరికేనే ఇవ్వటం శుభం కాదని కొలంబా ఆమె వద్దనుంచి ఒక 'సూ' (చిన్న నాణెము — ఎ॥) పుచ్చుకుంది.

చివరికి ఎలాగయితేనేమి ప్రయాణీకులు బయలుదేరారు. ఆర్సో తిరిగి మిస్ లిడియాతో కరచాలనం చేశాడు, కొలంబా ఆమెను కవుగిలించుకుంది, తర్వాత గులాబీల వంటి తన పెదవులతో కర్నల్‌గారిని ముద్దు పెట్టుకుంది — ఈ కార్సికన్ పద్ధతిని చూసి కర్నల్‌గారు ఆశ్చర్యపడ్డారు.

కొలంబా, ఆర్సో ఇద్దరూ గుర్రాలు ఎక్కారు. కొలంబా కళ్లు కొంచెం క్రూరంగా మెరిశాయి. పట్టి ప్రయాణం కాక ఏదో భయంకరమైన ప్రయత్నం మీద బయలుదేరుతున్నదా అనిపించే టట్లు ఉంది ఆమె వైఖరి. మిస్ లిడియాకి ఆర్సో చెప్పిన మాటలు గుర్తుకి వచ్చాయి. ఏదో ఒక దుష్టశక్తి వారిని నాశనానికి తోడ్కొని పోతున్నదా అనుకుంది. ఆర్సో ఆమె వంక చూశాడు. ఆమె మనస్సులోని భావం గ్రహించాడేమో, ఈ జిప్టియన్ ఉంగరం పెదవులకి నొక్కుకున్నాడు మిస్ లిడియా ముఖం కొద్దిగా ఎర్రబడింది. కార్సికన్‌లు ఇద్దరూ తమ అశ్వాలమీద వేగంగా కొండలవైపు వెళ్లిపోయారు.

అరగంట తర్వాత కర్నల్ తన దూరదర్శినితో వారు వెళ్లిన దిక్కు కలయ చూశాడు. వెనక్కి తిరిగి తిరిగి చూస్తున్న ఆర్సో కనిపించాడు. కొంత సేపటికి కొన్ని బీటల అవతల మాయమయి పోయారు. ఇప్పుడు అదే చోట ఒక చక్కని తోట ఉంది.

అద్దంలో చూసుకున్న మిస్ లిడియాకి తన ముఖం బాగా పాలిపోయినట్లు కనిపించింది.

"ఈ అబ్బాయిని గురించి ఏమిటీ ఆలోచనలు?" అన్నది బిగ్గరగా "ఎందుకు ఆలోచించటం ?.... ప్రయాణంస్నేహమే కదా ! .... కార్సికాకి ఏమి చేద్దామని వచ్చాను ?... ఊహు ! అతనంటే నా కిష్టమేలేదు.... అదీ కాక అంతా అసంభవం! కొలంబా .... ఒక ఆశుకవయిత్రికి వదినగారినా నేను !.... పెద్ద కత్తి పట్టుకుని తిరుగుతుంది కూడాను !" ఆ థియోడోర్ రాజు కత్తి తనచేతి లోనే ఉండటం గమనించి బల్లమీద పడవేసింది. "లండన్‌లో కొలంబా! అల్మాక్స్‌లో డాన్సు చేస్తూ! ఎంత వింత !.... నేనంటే అతనికి ఇష్టమే!.... అనుమానం లేదు !.... కథల్లో నాయకుడివంటి వాడా ? అతని సాహసకార్యాలకి అడ్డువచ్చానా ?.. అయినా, అతను నిజంగా తన తండ్రి హంతకుడి మీద పగ తీర్చుకుంటాడా?...."

మంచం మీద పడుకుని నిద్ర పోవటానికి ప్రయత్నించింది కాని వీలులేక పోయింది. ఇంకా ఏవేవో తర్కించుకుంది తనలో తానే, కాని అవన్నీ ఇక్కడ చెప్ప నవసరంలేదు. (ఇంకా వుంది)

## వివిధ ప్రాంతాల వింతలు 20

# డర్బాన్ నగరం

మనం కొన్ని కొన్ని ఫోటోలు, రంగుల రంగుల బొమ్మలు చూస్తూ ఉంటాం. ఆ బొమ్మల్లో ఉన్నదాన్ని చూసి, మురిసిపోయి అసలు వస్తువు ఎంత గొప్పగా ఉంటుందో అనుకుంటాం తీరా దగ్గరికి వెళ్ళి చూస్తే గొప్పతనం కనపడదు సరికదా మనం చూసి బాగా ఉన్నయ్యనుకొన్న ఫోటోల్లో కూడా అసలు బాగా ఉండేవి ఒకటో రెండో కన్న ఎక్కువ కనపడవు.



తమ తెగ అలంకరణలతో నృత్యం చేస్తున్న జులూ వనితలు.

అలా కాకుండా, మనం చూసింది చూసినట్లు అందంగా ఏ చోటి ఫోటో తీసినా ఫోటోకన్న అందంగా కన్పడే ప్రదేశం డర్బాన్ నగరం

నైరుతి ఆఫ్రికాలో అందమైన ఓడరేవుల్లో డర్బాన్ ఒకటి పట్టణ చరిత్ర చూస్తే, చాలా ఇటీవలి నగరమనే చెప్పాలి. 1824 రాయల్ నౌకా దళానికి చెందిన కాప్టెన్ అల్లాన్ జులూ జాతి వాళ్ళలో క్రైస్తవ మత ప్రచారం జరిపేందుకు, నేటాల్ అఖాతం ఉత్తర తీరంలోకి వెళ్ళాడు. ఆ స్థలం చాలా ఆరోగ్యవంతమైంది హాయి గొల్పేది కావటంచేత జనాభా త్వరలోనే పెరిగిపోయింది. ఆఖరికి గవర్నరు పేరి 'డిఉర్బాన్' అని పేరు పెట్టుకున్నారు 1854 లో మునిసిపాలిటీగా రూపొందింది. అప్పటి నుండి చాలా అందమైన పట్నంగా రూపొందుతూ వచ్చింది

ఇక్కడ మొట్టమొదటగా చూడదగ్గది ఈ తీరం పొడుగుగా అందమైన, బాగా విలాసాల కుపయోగించే హోటళ్ళు ఎన్నో ఉన్నాయి. మధ్య మధ్యలో అందంగా, చూడ ముచ్చటగా ఏర్పాటు చేసిన లాన్‌లు ఉన్నాయి.

ఇక్కడ బెరియా అనేది చూడాల్సిన ప్రదేశాల్లో ఒకటి. ఇది నగరంలోనే సుమారు 500 అడుగుల ఎత్తున ఉంటుంది. నగరంలో నిజంగా నివాస ప్రాంత మంటే ఇదే. విలాసాలకు, వినోదాలకు చాలా ఏర్పాట్లున్నాయి. అందుకే ఇది క్రీడా స్థలమా అనిపిస్తుంది చూస్తుంటే.

డర్బాన్ మంచి వ్యాపార కేంద్రం కూడా. వెస్ట్ స్ట్రీట్, స్మిత్ స్ట్రీట్‌లాంటి ప్రాంతాల్లో పదడుగులువేస్తే చాలు. ఇట్టే తెలిసిపోతుంది.

ఇక్కడి ప్రజల ఆచారాలు, ఆహార్యాలు (దుస్తులు) చూడ ముచ్చటగా ఉంటాయి. ఇక్కడ జులూ జాతి ఆడవాళ్ళు, మగవాళ్ళు, పూసల దండలు, వాటితో చేసిన ఆభరణాలు తలలకు ఈకలు ధరిస్తారు. అక్కడవున్న భారతీయులు చీరలు ధరిస్తారు. ముస్లిం వనితలు సంప్రదాయ ప్రకారం పరదాలు, బురఖాలు ధరిస్తారు.

డర్బాన్ చాలా ఆటలకు పేరు పొందింది. ఇక్కడ తరచు గోల్ఫ్ ఆడుతుంటారు. ఈతలకు కావాల్సినన్ని కోనేర్లు వున్నాయి.

అసలీ నగరమంతా ఒక పెద్ద ఉద్యాన వనంలాగా ఉంటుంది. ఇక్కడకు వచ్చే విలాస యాత్రికులకు అంతే లేదు. ఆ! అన్నట్టు ఇదంతా కొన్నాళ్ళ క్రింధట సంగతి. ఇప్పుడిక్కడ అంటే ఆఫ్రికాలో జాతి ద్వేషాలు, వర్ణ వివక్షత కావాల్సినంత.

—టెంపిల్ మానింగ్. ★

# కూరలు
# కూరలు అన్నీ కూరలే!

వి. హేమలతా కైలాసం

(9-8-63 సంచిక తరువాయి)

## 1. కారం కూరలు

(1) ధనియాలు, మినపప్పు, శెనగ పప్పు, ఎండుమిర్చి, వుప్పు.
(2) శెనగపప్పు, ఇంగువ, ఎండు మిర్చి, వుప్పు.
(3) ధనియాలు, మిరియాలు, శెనగపప్పు, గసగసాలు, ఇంగువ, జీలకర్ర, ఎండు కొబ్బరి, వుప్పు.
(4) ఎండుమిర్చి, మినపప్పు, నీరుల్లిపాయలు.

పైన చెప్పిన సరుకుల్లో ఏవైనా వేయించి గుండ కొట్టాలి. వంకాయ అటూ ఇటూ తరిగి కొట్టిన గుండ వంకాయలో కూరి బూర్లె మూకుడులో నూనె వేసి కాయలా పళంగా అందులో వేసి మూత పెట్టి పై మూతలో కాస్త నీరు పొయ్యాలి. వంకాయ మెత్తపడేదాకా మూత వేసి బూర్లె మూకుడు పట కారుతో పట్టుకొని పైకాయలు క్రిందకి, క్రింద కాయలు పైకివచ్చేదాకా కుదుపుతూవుండాలి.

ఇల్లాగే దొండకాయలో కూడా కూరి వండుకోవచ్చు. కాకర కాయ చేదు ఇష్టంలేనివారు పొట్టచీల్చి కాస్త పుల్లమజ్జిగ వుప్పువేసి, వుడక పెట్టి వార్చి, నీరుపిండి పై గుండలు కూరి వేయించవచ్చు.

## 2. కారం కూరలు

శెనగపిండిలో సరిపడే కారం, వుప్పు, కాస్త ఇంగువ వేసి, మంచి నూనె పోసి వుండ అయ్యేలా కలిపి వంకాయలో పెట్టి గుత్తివంకాయలా వండవచ్చు. కాకర కాయ వుడక పెట్టి వార్చి శెనగపిండి కూరివండితే కాకర కాయ ఇష్టంలేని వారు కూడా తింటారు. చామ వుడకపెట్టి వార్చి, మిగతా కూరలు మాదిరిగా పోపులో వేసి పై గుండలు వేస్తే చాలా రుచిగా వుంటాయి

నూపప్పు, ఎండు మిరపకాయలు, గిన్నెలో నూనె వెయ్యకుండా వేయించి వుప్పువేసి పొడి దంచాలి.

తెలగపిండి, ఎండుమిర్చి, వుప్పు పొడి కొట్టాలి.

ఆనపకాయ, పొట్లకాయ, బీర కాయ, చిక్కుడుకాయ, క్యాబేజీ, క్యాలీఫ్లవర్, వుడకపెట్టి తీసి ఎండు మిర్చి ముక్కలు, ఆవాలు పోపు వేయించి అందులో కూర ముక్కలు వేసి పైన నూపిండి గాని తెలగపిండిగాని చల్లి కలిపి ఐదునిమిషాల తరువాత దింపాలి.

## కలగలుపు కూరలు

వంకాయ, బంగాళా దుంప, వంకాయ చిలగడదుంప, బీరకాయ బెండకాయ, బంగాళాదుంప, చుక్క కూర, కంద బచ్చలి మొదలైనవి కలగలిపి పులుసుకూరలా వండు కొంటే బాగుంటాయి.

ఓర్పు — నేర్పువున్న ఇల్లాలు బుట్టలో మిగిలిన నాలుగు రకాల కూరలతో నలుగురికీ సరిపడే కూర వండగలదు.

కందముక్కలు దురదపోవాలంటే చిక్కడి కడుగుతో రెండు మూడు సార్లు బాగాపిసికి కడిగి ఆపైన శుభ్రమైన నీళ్ళతో కడుక్కోవాలి.

కాకరకాయ ముక్కలు తరిగి వుప్పురాసి కాసేపువుంచి పిండేస్తే పసరు పోయి చేదు తగ్గుతుంది.

బీరకాయ, పొట్లకాయ, వుప్పు రాసి పిండేస్తే నీరు తగ్గుతాయి.

వంకాయ నీళ్లల్లోకి తరిగితే కసరు పోతుంది. ఇనప దాంట్లో వేయించినా, కలిపినా వంకాయకూర నల్లగా తయారవుతుంది.

నూనెగాని, పుల్ల మజ్జిగగాని చేతికి రాసుకొని అరటికాయ, దొండ కాయ తరిగితే చేతులకి డాగుఅవదు.

వేసవికాలం వచ్చే వంకాయలు, బెంగుళూరు వంకాయలు కసరుగా గిజరుగా వుంటాయి. కుంకుడు గింజెంత సున్నం నీళ్ళలో కలిపి ఆ నీళ్లలోకి వంకాయలు తరిగి ఐదు నిమిషాలు వుంచి మంచి నీళ్ళతో కడిగి వండుకొంటే కసరు గిజరు తగ్గుతుంది.

అన్నం కన్నా ఆధరవులు ఎక్కువ తినడం నేర్చుకొంటే ఆరోగ్యంగా వుంటాము.

## వేపుళ్ళు

ఆకుకూరలు కాక పైకూరన్నీ చిన్న చిన్న ముక్కలుగా తరిగి బూర్లెమూకుడులో నూనె వేసి వేయించి జీలకర్ర కారం చల్లి కలపాలి. వేపుడు మెత్తగా కావాలను కొనేవారు మూకుడు మీద మూత పెట్టి మూతలో కాసినినీళ్ళు పొయ్యాలి. చామ వుడికించి తీసి వేయించాలి. ★ ★

# శర్కరాయణం

## "లతిక"

[ఒక పెద్ద చెంచా — టేబుల్ స్పూనులో సుమారు 31 'కాలరీ'ల శక్తి ఇమిడి ఉంటుందిట ఒక పెద్ద చెంచాడు మైదాపిండిలో — మరోక రకం పిండి అనుకున్నా పరవాలేదు — ఇంచుమించు 29 కాలరీలు ఉంటాయట

తక్కిన దేశాలలో ఖర్చు అయినంతగా మన దేశంలో పంచదార ఖర్చు అవదు 1959 లో సంవత్సరానికి మనిషికి సుమారు 5 3 కిలోగ్రాంలు (ఒక కి.గ్రాం సుమారు 2.2 పవున్లలో సమానం) వున్నట్లు లెక్కవేశారు. అమెరికాలో 43 7, రష్యాలో 39.6, పాకిస్తాన్‌లో 2.3, బ్రిటన్‌లో 52.8, జపాన్‌లో 14.7. ప్రస్తుతం ఈ దేశంలో సుమారు 12.7 కిలోలు (మనిషికి, సంవత్సరానికి) ఖర్చు అవుతున్నాయిట.

మద్రాసు 38.58, మహారాష్ట్ర 29 66, ఉత్తరప్రదేశ్ 9.16.]

"పరమ పాథ్వీమతల్లి యా పంచదార" అంటూ అవధానికి సమస్య ఇచ్చారు పూరించమని! అష్టావధాని ఆలోచించాడు. సమయానికి స్ఫురించింది. సమయస్ఫూర్తితో, "పంచదార" అన్న పదాన్ని ద్రౌపదికి అన్వయిస్తూ పూరించాడు. పంచ అనగా అయిదుగురికి, దార అనగా భార్య అని ప్రతిపాదిస్తూ! కరతాళ ధ్వనుల కోలాహలంతో మా మండలి హాలంతా దద్దరిల్లింది.

అయితే నేను ప్రస్తుతం వ్రాయబోయేది పంచ పాండవులకు దార అయిన ద్రౌపది గురించి కాదు. ఈనాడు చాలా మందికి దుర్లభమైపోయి, దాదాపు మృగ్యమైపోయిన పంచదార గురించి.....

ఈ పంచదారకి నానా నామాంతరాలున్నాయి. శర్కర, చక్కెర, చీనీ ఇత్యాదులు ఈ శర్కర సాహిత్యంలో (అదే సాహిత్యంలో చక్కెర) చాలా కాలంగా స్థానమేర్పరుచుకుంది. చాలా కాల మేమిటి? శ్రీనాథుని ప్రాతల్నిబట్టి, వ్యాసుడి కాలం నుంచీ కూడా వినియోగింపబడుతోందని రూఢీ అవుతోంది. ఎలాగంటారా? భీమఖండంలో కండ చక్కెర వుంది. రామాయణంలో పిడకల వేటలా శర్కరామాయణంలో భీమాయణం ఇది.

ఈ కథ (వ్యాసుడి కథ) అష్టాదశ పురాణాలలో ఒకటైన స్కాంద పురాణంలోనిది. శ్రీనాథుడా పురాణం సేకరించి, పరిశీలించి, సారం గ్రహించి, అందులోని ఇతివృత్తం సంగ్రహించి భీమఖండం లేక భీమేశ్వర పురాణం సృష్టించాడు.

అది నేను వ్రాస్తాను. పత్రికలో వేస్తారు. మీరు (చూస్తే) చూస్తారు. చూడ్డం వేరు— చదవడం వేరు. చూసి, చదవండి చదివి చూడండి!

ఓసారి శిష్యులను కాశీ ఎక్స్‌కర్షన్ తీసుకు వెళ్ళాడు వ్యాసుడు కాశీలో వారికి వారం రోజులు తిండి తిప్పలూ లేవు సారీ! తిండే లేదు! తిప్పలున్నాయి. తిండిలేక తిప్పలు పడ్డారు వ్యాసుడికి కాశీ మీద కోపం వచ్చింది. ..

> "ధనము లేకుండెదరు, మూడు తరములందు
> మూడు తరములు చెడుగాక మోక్షలక్ష్మి
> విద్యయును మూడు తరములు వెడలవలయు
> పంచ జనులకు కాశికా పట్టణమున......"

మూడు పురుషాంతరాలపాటు కాశీలోని పంచ వర్ణముల జనులకూ, ధనం, మోక్షం, విద్య లేక పోవుగాక— అని శపించబోయాడు. అతని ఆకలి బలహీనతమీద ఇంకా ఆడుకోడం వేడుకనిపించ లేదు కాశీ అన్నపూర్ణ తల్లికి! తెగేదాకా లాగడమెందుకని, వ్యాసుని ఆగ్రహం అరికట్టడానికి, అనుగ్రహించి, అతనికి, శిష్యులకీ ఆతిథ్య మిచ్చింది. ఆకలిగొన్న శార్దూలాల్లా వ్యాసుడూ, శిష్యులూ ఆరగించేరేమో! శ్రీనాథుడు శార్దూల వృత్తంలో ఆతిథ్యం గురించి, భోజన సామగ్రి గురించి బహు పసందుగా వర్ణించాడు. చిత్తగించండి ....

> "ద్రాక్షా పానక, ఖండ శర్కరలతో,
> రంభా ఫల శ్రేణితో,
> గోక్షీరంబులతోడ, మండెగలతో
> గ్రాన్నేతితో బప్పుతో
> నక్షయ్యంబగు నేరు బాలకల మా
> హారంబు నిశ్శంకతం
> గుక్షుల్ నిండగ. ...."

అన్నపూర్ణాదేవి ఆరగింప జేసిందట.

ఇంతకూ చెప్పరావడ మేమిటంటే, ఈ పంచదార అనాటిది! అనాటిది కాదు అనుకుంటే, కనీసం శ్రీనాథుడి నాటిది అనేనా ఒప్పుకోవాలి. కావాలంటే పోతన సాక్ష్యం కూడా ఉంది. ఆయన గంటం పంచదారలో ముంచి మరీ భాగవతం వ్రాశాడు. ఇంకా నమ్మకపోతే "కరుణశ్రీ" గారిని అడిగి చూడండి.

> "ముద్దులుగార భాగవత
> మున్ రచియించుచు, పంచదారలో
> నద్దితి వేమొ గంటము, మ
> హాకవి శేఖర! మధ్య మధ్య—అ
> ట్లద్దక వట్టి గంటమున
> నట్టిటు గీచిన తాటి యాకులో
> పద్దెములందు ఆ మధుర
> భావము లెచ్చటి నుండి వచ్చు......?"

అంటూ ఎదురు ప్రశ్న వేస్తా రాయన!

సరే! బాగానే ఉంది! పురాణాలలోను, ప్రబంధాలలోనూ, కావ్యాలలోనూ, ఖండ కావ్యాలలోనూ ఇతరత్రా, ఇతరత్రా దర్శన మిచ్చిన పంచదార ఈనాడు ఆసియా ఖండంలో ఉప ఖండమైన ఇండియాలో గగనారవిందమైంది. గగనారవింద మంటే? ఆకాశంలోని అరవింద పుష్పం! ఆ గగనారవిందమేనా ప్రయత్నిస్తే దొరుకుతుందేమోగాని, కొనుక్కున్నా (కుందామన్నా) పంచదార మాత్రం కంట్రోలు మూలంగా దొరకడంలేదు.

పంచదార ఇబ్బంది వుంది శ్రావణ మంగళవారాలకీ శుక్రవారాలకీ మాఘ ఆదివారాలకీ చక్కెర పరమాన్నంలేదు. లేకపోవడంలోని ఇబ్బంది అందరూ అనుభవిస్తూనే ఉన్నారు. ఇబ్బంది గురించి నేను వేరే వ్రాయడ మెందుకు?

మీరు కోప్పడమనీ హామీ ఇస్తే, చక్కెర కొరతవల్ల వచ్చే లాభాన్ని గురించి మనవి చేస్తాను. శాట్! మేం కాదంటే, గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించి నట్టు — నువ్వవునంటావా అని మాత్రం ఆగ్రహించకండి. పోఫీ! నియంత్రణవల్ల లాభంలేదు— వూరికే వెరైటీకోసం, నేను వ్రాసేది చదవండి!

చక్కెర ఎక్కువగా వాడితే షుగర్ కంప్లెయింట్ వ—స్తుం—ది—ని రూఢిగా చెప్పలేం కాని, తక్కువ వాడితే మాత్రం బోలెడంత మేలు జరుగుతుంది. ఐహికంగా, ఆముష్మికంగా లాభం లభించి తీరుతుంది

షడ్రుచులలో ఒకటి మాధుర్యం. ఈ ఆరు రుచులకీ, అలవాటు పడ్డవాళ్ళు, అరిషడ్వర్గాన్ని జయించలేరు. జిహ్వా లాలసత్వానికి లోబడకండి విగ్రహించుకోండి! శత్రు షట్కం ఇట్టే మీ వశమౌతారు.

> చీనీ మీద భ్రాంతిని వదులుకోండి
> చీనా వాళ్ళని జయించి తీరుతారు.

ఇదేదో ప్రచార సాహిత్య మనుకుంటున్నారా? నేను ప్రభుత్వోద్యోగినికాను. నాకే ఉద్యోగంలేదు. నాకున్నదల్లా ఒకటే ఉద్యోగం! దొరికింది చదవడం, తోచింది వ్రాయడం. అంతే! శ్రీనాథుని భీమఖండం, కరుణశ్రీగారి, ఉదయశ్రీ చదివేను. ఈ శర్కరాయణం వ్రాశాను. ఈ చక్కెర పరమాన్నం మంచి ఇక, చక్ర భ్రమణమే—చదివి, వ్రాసి, నేను వ్రాసి, మీరు చదివి.........ఇలా! ★




# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

## చల్లనైనది • సువాసనగలది • నవోత్సాహము కలిగించేది

పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ కుటుంబములోని వారందరూ అన్ని కాలములలోను వాడదగిన ఉత్తమమైన టాల్కం పౌడరు. ఎండలు మండుతున్నప్పుడు మృదువైన, ఉపశమనము కలిగించే పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ రోజంతా మిమ్మల్ని సౌఖ్యముగా ఉంచుతుంది. ఉక్కగా ఉన్న వాతావరణములో చెమటను పీల్చే మరియు తేలికైన సువాసనగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ రోజంతా మిమ్మల్ని సువాసన వెదజల్లుతూ, హాయిగా ఉండేలా ఉంచుతుంది!
నేడే ఒక పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ డబ్బాను కొనండి — ఇప్పుడు ఇది 3 సైజులలో లభిస్తోంది!

చీస్‌బ్రో - పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

JWT-P-1289.

# వనితా వాణి

## వ్యక్తిత్వం

వ్యక్తిత్వం అనే వ్యాసం చాల బాగున్నది. రాధారాఘవన్‌గారు కొన్ని కొన్ని గృహాల్లో జరిగే విషయాలను వివరించి చాల బాగా వ్రాశారు. చదువు సంస్కారం కల యువకులు కూడ ఇలా ప్రవర్తిస్తున్నారంటే చాలా శోచనీయం. వివాహం అయి కూడా ప్రతిదానికి తల్లీ తండ్రీని అడగాలంటూ భార్యలను కష్టపెడుతూవుండే భర్తలను ఏమనాలో కూడా అర్థంకాదు. ఒచ్చే కోడలి జాతకం మంచిదయి ఉండి అత్తగారు మంచిదయి ఉంటే పరవాలేదు. అదే ఏ గయ్యాళి అత్తగారో అయిఉండి అమ్మ మాట వినే కొడుకయితే ఇహ అమ్మాయి అగచాట్లు చెప్ప నవసరంలే! అమ్మ పెళ్లి చేసుకోమంది చేసుకున్నాను. అమ్మ మాట్లాడవద్దన్నది, మాట్లాడలేదు. అన్న భావన తప్పితే భార్య బాధపడుతున్నదే అన్న బాధ ఉండదు. అయితే పెళ్లి చేసుకుంటే తల్లిని, తండ్రిని మరిచిపోవాలా అంటారేమో. ఆమాట ఎవరూ అనరు. వినే విషయాలు వినవల్సిందే. కాదనరు కాని తననే నమ్మికొని వచ్చిన భార్యను ఈవిధంగా హింసించటం బాగలేదు. మంచివాళ్లు లేరా అంటారేమో ఎందుకు లేరు, ఉన్నారు. అక్కడక్కడ ఇటువంటివాళ్లు ఉండబట్టే సోదరి ఇటువంటి వ్యాసం రాయవలసి వచ్చింది. ఈ వ్యాసం చూసైనా వాళ్లకు కనువిప్పు కలుగుతుందని ఆశిస్తాను. ఈ వ్యాసాన్ని మా వనితలకు అందజేసిన రచయిత్రి సోదరికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

జి. సుగుణ (కావలి)

* * *

జన్మించిన ప్రతి మనిషికీ వ్యక్తిత్వం ఉండాలి. అందులో పురుషునికి తప్పకుండా ఉండాలి. తన పిల్లలకి బట్టలో, బొమ్మలో ఏదైనా తీసుకు వచ్చి తన భార్యతో "ఇవి నేను తెచ్చినట్లు చెప్పకు. మా వాళ్లకి తెలిస్తే బావుండదు" అని చెప్పుతాడు. తన భార్యా పిల్లల్ని పోషించేవాడు తన తల్లిదండ్రులకు జడుస్తాడు. తల్లిదండ్రులకు గౌరవము ఇవ్వాలి. ఇవ్వవద్దని ఏ మూర్ఖురాలూ చెప్పదు. ఆటువంటివారూ ఉన్నారనుకోండి. వారి మాట కాదు నేను చెప్పేది. తల్లిదండ్రులకు గౌరవము యిచ్చేలా యిచ్చి తన భార్యకు కూడా కొన్ని వ్యక్తిత్వం ఉంచాలి. తన వ్యక్తిత్వం నిలుపుకోవాలి. మనిషి ఎంత గొప్ప వ్యక్తి అయినా తన వ్యక్తిత్వము నిలుపుకోపోతే మర్యాదగా ఉండదు.

పెళ్లిళ్లలో మగ పెళ్లివారికి మర్యాద సరిగా లేదనో ఏదో మిషతో భార్యాభర్తలని విడదీస్తారు. వ్యక్తిత్వము ఉన్న మనిషి అయితే తన వాళ్ళని ఎదిరించి అయినా తన భార్యని తెచ్చుకు పిలుకుంటాడు. అలా అని తలిదండ్రులను నిరసన చేయుమని గాదు.

తలిదండ్రులను పూజించాలి. కానీ వారు వారి పెద్దరికాన్ని నిలబెట్టుకుంటే కొడుకే కాదు. కోడలు కూడా వారిని పూజిస్తుంది. పెద్దరికము ముందుకు వేసుకుని అన్యాయంగా ప్రవర్తిస్తేనే గొడవలు వచ్చేది. మర్యాద పోయేది.

పెద్దలు తమ మర్యాద నిలబెట్టుకోవాలి. చిన్నలు తమ వ్యక్తిత్వము నిలబెట్టుకోవాలి. అంతే కాని ఎవరూ మూర్ఖంగా ప్రవర్తించకూడదు అలా ప్రవర్తించిననాడే గొడవలు వచ్చేది. లేనియెడల అందరూ ఒకటిగా జీవితం సంతోషంగా గడపవచ్చు.

శ్రీమతి లక్ష్మిరామకృష్ణ (కాకినాడ)

* * *

సోదరీమణు లెవరికైన పూలుతో మగవారికి చేతులకు సరిపోయే చేతి తొడుగులు అల్లడము వస్తే డిజైనుతోకూడ వేయుటము పత్రికాముఖంగా వీలైనంత తొందర్లో తెలియచేయగలరని ఆశిస్తున్నాను. ఇది చలికాలము కాకపోయిన వర్షమువలన చలిగానే యుండును. అదీకాక ఇప్పుడు కొంచెము తీరిక సమయము కాబట్టి పూలు అల్లటము వచ్చిన సోదరీమణులు అల్లే విధానము తెలియచేస్తారని ఎదురుచూస్తుంటాము.

సత్యవతి (సికింద్రాబాదు)

* * *

శ్రీమతి రాధారాఘవ్‌గారు వ్రాసిన 'వ్యక్తిత్వం' అను వ్యాసం చదివాను చాలా బాగుంది. నిజానికి ఇలాంటి వ్యక్తిత్వంలేని మనుష్యులు మన నిత్య జీవితంలో తటస్థపడుతుంటారు ప్రతి చిన్న విషయానికి కూడ ఒకళ్లపై ఆధారపడి యుండటం ఏమంత సమంజసంగా ఉండదు ఈ వ్యాసం కొందరి జీవితాలను మార్పు తెస్తుందని ఆశిద్దాం. నిజానికి ఈ వ్యాసం వాస్తవానికి దూరం కాదు.

లతా కృష్ణారావు (హైద్రాబాద్) ★

వంటలు

## ఉండ్రాళ్లు

పావుసేరు బియ్యం మరలోపోసి మెత్తగా పిండిచేయాలి. పావుసేరు కన్న ఇంకొంచెం నీళ్లుపోసి, దానికి తగిన ఉప్పువేసి ఉడికించాలి. దానిలో శనగపప్పు ఓ గుప్పెడు వేసి ఉడికించాలి. ఉడికాకతీసి, చల్లారపెట్టవలెను. చల్లారిన తరువాత మినపపిండి, ఇంకొంచెం ఉప్పువేసి, పిసికి నిమ్మకాయలు ప్రమాణంలో ఉండలుచేసి ఆవిరిలో పెట్టవలెను. ఉడికిన తర్వాత అవి చేత్తో ముట్టుకునిచూస్తే కొంచం గట్టిగా ఉంటాయి. అప్పుడు ఉడికినట్లు లెఖ్క. దింపి చల్లారపెట్టిన ఉండ్రాళ్ళు తయారగును. ★





'షాన్జ్ ఎలిజే అవెన్యూ' రాత్రీ పగలూ కూడా అందాలు అలంకారాలు విస్తారంగా ఉంటాయి. పెద్ద రాజబాట. దీనికి ఒక చివర నెపోలియన్ కట్టిన విజయద్వారం ఉంది. 'ఆర్క్ ఆఫ్ ట్రయంఫ్' అంటారు.

# పారిస్ వింతలు!

ఎస్. హరి నారాయణ.

గోప్పనగరం పేరేది చెప్పినా కలగని కుతూహలం పారిస్ అంటేచాలు కలుగుతుంది. వినోద విలాసాలకు, వేష విన్యాసాలకు, పారిస్ నగరం పెట్టింది పేరు. మరో చోట మరోనగరంలోనూ విసుగు పుట్టడం కొన్నాళ్లయ్యాక, పొద్దుపోక పోడం సంభవిస్తుందేమో గాని పారిస్‌లో మాత్రం నిత్య నూత్నంగా, సంబరంగా గడిచి పోతుంది కాలం. ఆఖరికి పేవ్‌మెంట్‌లమీద నడుస్తూ, వెలిగించిన దీపాల మధ్య విరిసిన రకరకాల పువ్వుల్లా నవ్వుతూ తేరుతూ తూలుతూ ఆనందంగా గడిచి పోయే జన సందోహాలను చూస్తూ సైతం కాలం గడిపేయ వచ్చును.

అది సరే, కాని పారిస్ అంటే : నైట్ క్లబ్‌లూ, 'కాబ్రే'లూ నృత్యాలూ, స్ట్రిప్‌టీజ్ డ్యాన్సులూ, మొదలైన నగ్న నృత్యాల గురించీ, రాత్రి విలాసాల గురించి కుతూహలం కలుగుతుంది.

## రంగేళీ రాత్రులు

నిజమే, కాబ్రెట్ (కాబ్రే అంటారు ఫ్రెంచిలో)లూ స్ట్రిప్‌టీజ్ (నగ్న నృత్యాదులు)లు ఉండే విలాస గృహాలు బోలెడు ఉన్నాయి పారిస్‌లో. 'పిగాలే' ప్రాంతం పారిస్ నగరంలో కల్లా ఈ రాత్రి విలాస గృహాలతోను, సమ్మోహనమూ, కొందరికి జుగుప్సాకరమూ, ఐన నృత్యాలతో శోభాయమానంగా వెలిగి పోతూ ఉంటుంది. పిగాలేస్క్వేర్ రాత్రిపూట చూడాలి అంటే ఓహ్! రెండు కళ్ళు చాలవు.

దీప తోరణాలు, వింత దుస్తులూ, వింత కాదను కున్నా కన్నుగొట్టే, రమ్మని పిలిచే నైట్‌క్లబ్‌లూ, నిండి ఉంటుందీ ప్రాంతం. కొందరు, "ఆ! సంగీత నృత్య మయంగా మాయగా, అందాల భామలు వలువలు వదిలేస్తూ ఉంటే చూడటంవల్ల వరిగే దేమిటి ?" అని జేబులు తేలికగా ఉండటాన అనుకుంటే అనుకోవచ్చు. కాని ఆ జాగాను వదల్లేక అక్కడక్కడే తారాట్లాడొచ్చును!

## ముక్కుపిండి వసూలు !

ఈ క్లబ్‌ల్లో దేనిలోనికైనా దూరాలీ అంటే మంచి రసపిపాసవుండాలి! సాధార్ణంగా ప్రవేశ రుసుము మరీ ఎక్కువేం కాదుగాని లోపలికి వెళ్లిన తర్వాత ఓ బల్లచూసి కూచున్న తర్వాత మాత్రం ఓ డ్రింకు కొనుక్కుని తీరాలి. అది త్రాగినా తాగకున్నా ముక్కుపిండి దాని ఖరీదు వసూలు చేస్తారన్న మాటే !

ఐతే డ్రింక్ కొనుక్కుని బల్ల దగ్గర కూచున్నాక మన కళ్లముందు ప్రదర్శనలు చెవులలో ఆగకుండా ఏదో వాద్యసంగీతం కనబడుతూ వినపడుతూ ఉంటాయ్ ! అన్ని రకాల వాళ్ళు అందగాళ్ళు పోరగాళ్లు అందగత్తెలూ, పన్నెలాడులూ అందరూ అన్ని వేపులా మత్తుగా గమ్మత్తుగా చూస్తూ 'డ్రింకులు' సిప్ చేస్తూ ఉంటే గభిక్కున హాలు మధ్య ఓ వలయాకారపు కాంతి పడుతుంది! అందులో నగ్న నృత్య సుందరీ మణులు గాని, "కాన్‌కాన్" డాన్సర్‌లు గాని, లేదా, ప్రణయ (కామ అందాం)గీత విద్వాంసులుగాని ప్రత్యక్షమవుతారు. ఈ రకమైన ప్రదర్శన మేదేవ గంట నించీ రెండు గంటల దాకా సాగుతుంది. మనం జోగుతాం !

## కళ్ళు జిగేల్ ....

మానవ బలహీనతలలో కెల్లా బలహీనమైన సెక్స్ ఆకలిని రెచ్చగొట్టే వస్తువే యీ ప్రదర్శనం లోని మూలవస్తువు! ఇంకా వింతైన కళ్ళు జిగేల్ మనిపించే ప్రదర్శన శాలలుంటాయ్. ఉదాహరణకి లిడో; పాలియస్ బెర్జిర్, కాసినో (ది పారిస్) లాంటి మ్యూజిక్ హాల్సులో 9 రాత్రినించీ అర్థ రాత్రి వరకూ భారీ ఎత్తున, సెక్సు అప్పీలుతో నిండుగా ఉంటాయ్.

## దేవతా వస్త్రాలూ సుందరాంగనలు

వీటిలోనికి వెళ్లడానికి రుసుము 8 రూ. మొదలు 50 రూపాయలుదాకా ఉంటుంది. దేవతా వస్త్రాలు ధరించిన ('నగ్న' అంటే బాగుంటుందా ?) సుందరీ మణులు ముఖ్యంగాలు కాగా



'ఐఫల్' టవర్ పూర్తిగా ఇనప స్తంభం. ఐఫల్ కట్టాడు. దీనికి మూడు అంతస్తులున్నాయి. 3 వ అంతస్తుమీదగా టెలివిజన్ ట్రాన్సిమిటర్ ఉంది. రెండో అంతస్తులో రెస్టారెంట్ ఉంది. దగ్గరగా మంచి పార్కు ఉంది. దీని కెదురుగ మిల్టిటీ స్కూలు ఉంది. దీనికి దరినే మ్యూజియం అవీ యివీ ఉన్నాయి.

వాళ్ళని రేకెత్తించే భారీ దృశ్యాలన్నీ ఎక్కువగా టూరిస్టుల నాకడతాయేమో గాని పారిస్ వాసి, తానెంచుకున్న ప్రదర్శనలకు వెళ్ళి తన కళాతృష్ణ తీర్చుకోగల (డ్రామాలు) ఉంటాయ్! ఉదా: ఓడియన్ స్క్వేర్ గల నేషనల్ థియేటర్, రాయల్ పాలెస్ దగ్గర కల కామెడీ థియేటర్ లేదా ఫారీ యట్ప్రైస్ దరినిగల ప్రోగ్రెస్సివ్ థియేటర్ మొదలైనవి ఉన్నాయి. నిత్యమూ 9 గం॥ల రాత్రికి ఉండే ఈ ప్రదర్శనలకు జనం కిటకిట లాడుతూ తూనే ఉంటారు!

## ఓ పె రా లు

ఓడియన్ రాయల్ పాలెస్‌లు రెండు, శిల్పమూ కార వైచిత్ర్య భవనాలు. ఇందులో బాల్కనీలు ఒకటి కాదు ఒకదాని మీద ఒకటి, చాలా ఉంటాయి. ప్రేక్షకులకు పైనించి ఏ మేఘం మీదో కూచుని, దిగువనున్న వేషగ్రాంట్రము, డ్రామాను, వెన కటి కథల్లో దేవతలు "నరమానవులు" చేసేఆటలు తిలకించినట్టుగా— భ్రమాస్తున్నట్లు ఉంటుంది.

అందుకనే ఈ ప్రదర్శనలను ఓపెరా అద్దాలతో చూడటం బాగుంటుంది. 'తెర ఎత్తే'గానే ఇంత పెద్ద జనం ఇన్ని బాల్కనీలు నిండు చిట్టుకొని మన్నింత నిశ్శబ్దంగా శ్రద్ధగా చూస్తూ వుంటారు. తెరపడగానే చప్పట్లు మిన్ను ముట్టుతాయి! మళ్ళీ 'సైలెన్స్'! ఆట అంతా అయ్యాక మీరు నిల బడి, నటీనటుల పరిచయం అంతా అయ్యేదాకా ప్రశంసలతో చప్పట్లు కొడుతున్నారా అంటే మీరు మంచి అభిరుచిగల "థియేటర్ గోఆర్" అన్న మాటే!

ఇక 'ఓపెరా'కి వెళ్ళారు సంగీత ప్రియులు నృత్య ప్రేమికులూను, ఇది ఓపెరా స్క్వేర్‌లోనే పెద్ద కట్టడం. ఇందులో కూడా బాల్కనీలు వలయాకారంలో ఉంటాయ్! దేదీప్యమానమైన వేదిక తళ్ళుకు పొందిన పాటూ ఆటా, ప్రేక్షకుల కనులు మిరుమిట్లు గొలిపే ప్రదర్శన ఇది! రంభా పూర్వశీల్లాంటి సౌందర్య రాశులు (వాళ్ళని మనం ఎరుగం అనుకోండి) వాట్య కత్తెలా పిటిహో మునని ఆకర్షించే వస్తువులు! రాజాధి రాజులు కొలువులు మొదలు, నిజం 'శిల్ప' సుందరీ మణులతో అలంకరించబడిన పెద్ద ఫౌంటెన్ల దాకా, ఒకే వేదికమీద చూడొచ్చును ఈ మ్యూజిక్ హాల్స్‌లో! ఐతే ఇంత అప్పీలుగల ఈ దేవతా వస్త్ర ధారిణులు ఇంతు మరీ దాహంగా ఉన్న వాళ్ళకి తప్ప కాస్త సెట్టింగులూ సీనరీ అవీ చూసి మెచ్చుకోగల వాళ్ళని చలింపజేయును! స్టేజి సెట్టింగులూ బ్రహ్మాండంగా ఉంటాయ్!

## వేరే అభిరుచి వుంది!

ఐతే ఈ స్త్రీ సౌందర్య పిపాసను వ్యామో



నాటర్ డామ్ చర్చి. విక్టర్ హ్యూగో రాసిన 'హంచ్ బేక్ ఆఫ్ నాటర్ డామ్' మీకు తెలుసుగా!

# పారిస్ వింతలు!

ముగ్గులను చేస్తాయి. ఇక ఈ ప్రదర్శనలను ఇలా ఉంచండి మనకి తెలిసిన ప్రదర్శనలు సినిమాలున్నాయి ! మనకి ఇక్కడి సినిమాలంటే చాలా హాయిగా ఉంటుంది !

## సినీమాలపైనం

పెద్ద పెద్ద క్యూల్లో నిలబడటం ఆట ఆరంభం అయ్యేసరికి వెళ్లాడం లాంటి ఇబ్బందేం అక్కర్లేదు ! ఇక్కడ సినిమాలు అలా మధ్యాహ్నం 12 నించి రాత్రి 12 దాకా వేస్తూనే ఉంటారు. మధ్య మధ్య పదినిమిషాల ఇంటర్‌వెల్ మాత్రం ఉంటుంది. మన ఇష్టం వచ్చినప్పుడు వెళ్లడం ఒక టిక్కెట్ కొనుక్కోడం, ఇక లోపలికి వెళ్లి రావడం మన ఇష్టమే ! కథ క్లైమాక్స్‌లో చూసి, మళ్లీ తర్వాత ఆట ప్రారంభం దాకా చూసి, కలుపుకొని ఆనందించడం అలాగ పోతే మొత్తం మరోసారి చూసేడం నేర్చుకోవాలి ! హాయి హాయి ! కదూ ! కాని సాధార్ణంగా ఎవ్వరూ మళ్లీ మళ్లీ అదే సినిమా చూస్తు ఉండిపోరు ! సాధార్ణంగా బాల్కనీ, ఆర్కెస్ట్రా అని రెండు తరగతులు (కొన్ని చోట్ల ఒక్కటే క్లాస్) కొన్ని హాల్సులో టిక్కెట్ 10 ఫ్రాంక్స్ (10 రూ.లు) దాకా ఉంటుంది !

## ప్రాచీనవైభవం

పారిస్‌లో ప్రాచీన వైభవానికి కళా ఖండాలకి కొదవలేదు. పైగా ఆ వైభవమే, పారిస్‌లో సుమారు 40 మ్యూజియమ్‌లు ఉండటానికి కారణం కూడాను! "ల్యూవ్" అన్నింటికన్నా అద్భుతంగా ఉంటుంది.

'మ్యూసిఎల్‌హోమ్మే' చాలా ఆధునాతన మైనది. మాడర్న్ ఆర్ట్‌కి సైన్స్‌కి ప్రత్యేకంగా మ్యూజియమ్‌లున్నాయి ! "పాలెస్ ఆఫ్ డిస్కవరీ" ప్రత్యేకంగా సైన్సు మ్యూజియం. మ్యూజియమ్‌లన్నీ విజ్ఞానం వినోదం రెండూ ఇచ్చే ప్రాంతాలు. వీటిని చూడకపోతే పారిస్‌లోని ముఖ్యమైన వాటిని వదలి వేశామనే అనాలి ! ఫ్రెన్చి వాసులు వీటిని విపరీతమైన ఇష్టంతో చూస్తారు. ఒక అలౌకికమైన అనుభూతి కలుగుతుంది వీటి సందర్శనంవల్ల ! పోతే ఇక సైట్ సీయింగ్ చాలా ముఖ్యమైంది. వివిధ ప్రాంతాలను చూడటానికన్నా టూరిస్ట్‌కి ఇంకేం కావాలి ?

## చౌకైన ఆనందం

ఖర్చు తక్కువ ఆనంద మెక్కువ. నగరంలోని వీధులూ పార్కులూ దుకాణాలు, మనుష్యులు అన్నీ "సైట్ సీయింగ్" క్రిందనే తీసుకుంటేనే అపారమైన సంతోషం కలుగుతుంది. మనకి. ముఖ్యంగా అక్కడి 'కఫేలు' (హోటళ్లు) వింతగా ఉంటాయి ? అవి లోపలే ఉండవు ! పేవ్‌మెంటు మీదకు కూడా దురాక్రమణగా వచ్చేస్తాయి. అయితే 'పేవ్‌మెంట్'లు చాలా విశాలంగా ఉంటాయేమో, ఈ కాఫీ కఫేలు బల్లలు కుర్చీలతో రోడ్డు మీదకు ఇలా ఎక్కిపోడం బాటసారులకు ఇబ్బంది కలిగించదు. పైగా హాయిగా ఉంటుంది.

మంచి పెద్ద హోటలు దానిముందు గుండ్రని బల్లలు, నాలుగూ మూడూ కుర్చీలు !

పైగా బల్లలమీద రంగురంగుల గుడ్డ గొడుగుల్లాంటి "సన్ షేడ్"లు ఉంటాయి. శీతాకాలంలో వీటిని అద్దాల గోడల మధ్య పెట్టి వెచ్చగా ఉంచుతారు.

మనం పోయి రోడ్డు మీది రకరకాల దృశ్యాలు అగుపించే చోట ఓ కుర్చీ చూసుకుని కూచోవాలి !



సీన్ నదిమీదగల అలెగ్జాండర్ III బ్రిడ్జిమీదగల ఒక స్తంభం-ఆ ప్రక్కనే నించున్న మనిషి అంచేత ఎత్తువూహించవచ్చు.

ఓ 40 పైసలు ఇస్తే కప్పు నల్లకాఫీ (బ్లాక్ కాఫీ) వస్తుంది. (ఇది కొన్ని హోటల్సులో 2రూ॥లు దాకా అవుతుంది) అది తాగిన వెంటనే ఆ బల్ల వదలి ఎవరూ పొమ్మనరు. ఎంత సేపయినా ఆ బల్లకుర్చీ మనవే ! సినిమాల్లోలాగే మనం ఇష్టపడి లేచిపోవాల్సిందే ! కాని కాలం గడుస్తున్నట్లే తెలీకండా అయిపోతుంది కఫేలలో.

కొన్ని కఫేలు తెల్లార్లూ ఉంటాయి. తెల్లార్లూ సందడిగా ఉంటుంది కూడా ! వచ్చేపోయే జనమే ఓ వింత !

ఇక తోటల్లు వీటినే పార్కులంటారు. అవి న్యూలు, బోల్వార్డులు సీన్‌నది కటూ ఇటూ గల కాంక్రీట్ "పాత్ వేస్" ఇవన్నీ కావల్సినంత ఉత్సాహాన్ని ఆనందాన్ని ఇస్తాయి ! పార్కుల్లో వసంత కాలంలో కన్నుల పండువు చేస్తాయి. ఇవవెంటీ బుంటాయి అన్ని చోట్లా. 'లక్సెమ్‌బర్గ్ గార్డెన్స్', ఐఫిల్ టవర్ దగ్గర పార్కూ చూసి తీరాలి!

సీన్ నదీ తీరానగల కాంక్రీట్ బాటలమీద నడక చాలా హాయిగా ఉంటుంది. మీకు కొన్ని నాజూకైన జనం మధ్య తిరగాలి అని ఉంటే, ఛాంజ్ ఎలిసేస్‌కు వెళ్ళండి! లేదా రివోలీ, సెంట్‌మైఖేల్ ప్రాంతాలకు వెళ్ళడం మంచిది. అక్కడ "కుర్రకారు" స్టూడెంట్లూ ఉంటారు. లేదా ప్రెసిడెంట్ విల్సన్ స్క్వేర్‌లో ప్రశాంతంగా, గంభీరంగా నడువ వచ్చును.

ఇక "మెట్రో" ప్రాంతంలో—ఎలెక్ట్రిక్ రైళ్ళు (భూగర్భ మార్గాలు) రాత్రి 1 గంట దాకా నడుస్తాయి. టాక్సీలు 24 గంటలు దొరుకుతాయి. రాత్రిపూట పగటి ఛార్జీలకు రెండింతలు పుచ్చుకుంటారు. అయితే నడక కూడా హాయే గనుక కాల గమనాన్ని మనం పరకు చేయం!

రోమ్, బ్రసెల్స్, ఏథెన్స్ వీటి అన్నింటికన్నా పారిస్‌లో వినోదమే మనకి నచ్చుతుందని అనిపిస్తుంది! ★

# కల్యాణ కింకిణి

మధురాంతకం రాజారాం



అత్యవసరంగా అయిదు రత్నాలు కావాలి!

పేరుకు రత్నగర్భే అయినా మా ఇంటి పెరట్లో నేల త్రవ్వితే రత్నాలు దొరకవు. రత్నాలు రాసులుగాపోసి, వీధుల్లో అమ్మే కాలాలుగావు. ఇంతకూ మూల్యం చెల్లించుకుంటే దొరికే రత్నాలు కావు. కావలిసినవి! అమూల్యమైన రత్నాలు.

క్షరం కాని అక్షరాల రూపంలో నాలుగు కాలాలపాటు నిశ్చలంగా నిలిచి ఉండగల పద్య రత్నాలు!

చొక్కా తీసి వంకీకి తగిలిస్తుండగా టేబిలు పైన కవరు కనిపించింది. పసుపునీటి చిలకరింపుల్లో తడిసిన కవరు. కనిపించగానే స్ఫురించింది. ఎవరికో పెళ్ళి!

ఇహలోక యాత్రలో వధూవరుల కలయికకు వివాహ మహోత్సవమన్న తతంగం స్థూల శరీరంలాంటిదైతే — పెళ్ళి పత్రికే సూక్ష్మ శరీరం. వివాహాల్లో రాక్షస గాంధర్వాది విభేదాలున్నట్టే పెళ్ళి పత్రికల్లో సైతం ఆకారాన్నిబట్టి, ఆంతర్యాన్నిబట్టి అనంతమైన వైవిధ్యం కద్దు! కేవలం తెలియజేసేందుకు మాత్రమే వచ్చేవి కొన్ని! (ఇవి పెళ్ళి జరిగిపోయిన తర్వాత వచ్చినా రావచ్చు!) శుభ ముహూర్తం రేపో మాపో ననగా రెండు మూడు వందల మైళ్ళ దూరం నుంచి ఈ పెళ్ళికి నువ్వు రాలేవులే అని వెక్కిరించినట్టుగా వచ్చేవి కొన్ని! కేవలం శుభా కాంక్షల్ని మాత్రమే ఆశించి వచ్చేవి కొన్ని! వాటిలో మనసుకు ముకుదాడువేసి, మమతలకు రెక్కలు తొడిగి పెళ్ళికి తరలించే పెళ్ళి పత్రికలు ఎన్ని?

కవరులోనుంచి పత్రికను పైకి తీశాను. మడత విప్పేసరికి పెద్దక్షరాలలో వరుడిపేరు దృగ్గోచరమైంది. ఒడలికి రోమాంచాన్ని, మనసుకు తన్మయత్వాన్ని కలిగించే అనుభవాన్ని ఎలా వర్ణించి చెప్పగలం! కాదంటే వసంత కాలంలో ప్రభాత సమయాన గది కిటికీలోనుంచీ, అల్లనల్లన లోపలికి వచ్చిన మల్లికా సౌరభం శరీరాన్ని అభిషేకించినప్పుడు కలిగే అనుభూతితో ఉపమించవచ్చునేమో! పెళ్ళి ఎవరికో కాదు! మా నాగరాజుకి!

తీయటి వూహకు, నిజమైన కలకు పర్యాయపదం చెప్పమంటే చప్పున చెప్పవచ్చు—నాగరాజు పెళ్ళి!

తన నీడను తన క్రిందనే దాచుకుని పరిసరా

ల్లోకి వెలుగుల్ని వెదజల్లడం దీప శిఖ స్వభావం. తన కష్టాలను తాను కిమ్మనకుండా భరించి, కించిత్తు ఆనందం కలిగినా దాన్ని లోకులకు పంచిపెట్టేవాడు నాగరాజు. నాగరాజుకు పెళ్ళంటే సంతోషించేవాళ్ళు అసంఖ్యాకులు!

"ఇదిగో శకుంతలా! నాగరాజుకు పెళ్ళట!" అంటూ వంట గదివైపు పరుగు దీశాను.

"అలాగా! అదేనా పెళ్ళి పత్రిక!" అంటూ ఎదురొచ్చేసింది శకుంతల. "పోస్ట్‌మేన్ తెచ్చి ఇచ్చాడు. ఈ చంటిపిల్ల తెరిచి చూడనిస్తుందిగనుకనా! అలాగైతే నాగరాజుకు పెళ్ళన్నమాట! అబ్బ, అబ్బ ఎంత కాలానికి! ఎక్కడండీ ఎప్పుడు?"

ఆ వివరాల కోసం మళ్ళీ ఆహ్వాన పత్రికనే పరామర్శించవలసి వచ్చింది. ఎక్కడ—అన్న ప్రశ్నకు లభించిన సమాధానంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు వచ్చిన చిక్కల్లా 'ఎప్పుడు' దగ్గరే వచ్చింది. నాగరాజుపైన ఒక్కింత కోపం కలిగిన మాట గూడా నిజం! ముహూర్తం రేపటి ఉదయాన్ననగా ఈరోజు మధ్యాహ్నమా నా కాహ్వానమందడం!

ఎందుకైనా మంచిదని కవరుపైని పోస్టాఫీసు ముద్రల్ని పరిశీలించి చూచాను తొందరపడి నాగరాజును అపార్థం చేసుకున్నందుకు నాకు నేనే కించపడవలసి వచ్చింది ఆ కవరును 'పోస్టు చేయడమైతే వారం రోజుల క్రిందటే జరిగింది. అది కులాసాగా కొంత భూప్రదక్షిణం గావించి — ఇలా నింపాదిగా గమ్యస్థానం చేరుకుంది!

వంకీకి తగిలించిన చొక్కా తీసి మళ్ళీ తొడుకుంటున్నాను.

"అదేమిటండీ! భోజనాల వేళప్పుడు మళ్ళీ ఎక్కడికి ప్రయాణం? సరే సరే వెళ్ళిరండి. నాగరాజుకు పెళ్ళని తెలిసింది గదా! మీకింక ఆకలెక్కడుంటుంది?"

మా ఆవిడ అభిప్రాయమేమైనా, బొత్తిగా కొట్టి పారవేయడానికి వీల్లేనిది! ఆకలిని మరపించే మంచి లక్షణం శుభవార్తకున్న మాట నిజమే!

బయల్దేరిన వేళా విశేషం గూడా మంచిది! వెళ్ళిన సమయానికి సచ్చిదానందంగారు ఇంటి దగ్గరే ఉన్నారు.

ఉన్నారేగానీ, ఆయన ఈ లోకంలో ఉన్నట్టు లేరు. వాలు కుర్చీలో పడుకుని కాళ్ళు బారగిలచాపేశారు. కుర్చీపైనుంచీ చేతుల్ని క్రిందికి దిగవిడిచేశారు సులోచనాల క్రింద కళ్ళు గట్టిగా మూసుకున్నారు అది నిద్రో, ఆలోచనో, విచారమో కాక మరేమిటో అంతు పట్టడంలేదు.

గుమ్మం దగ్గర నిల్చుని లోపలికి తొంగి చూచాను. ఆ హాల్లోని దృశ్యం కంటబడిన తర్వాత సచ్చిదానందంగారి వాలకానికి వ్యాఖ్యానం—వేరొకరు విడమరిచి చెప్పేనవసరం లేకుండా తనంతటదే బోధపడింది

ఓ పదేళ్ళ అమ్మాయి మంచంపైన పడుకుని వుంది టేబిలుపైన మందు సీసాలు, మంచంకోడు కానుకుని ఖిన్నురాలై కూర్చున్న తల్లి ఆమె ఒడిలో (బహుశా ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పోయుండేమో) పసిపాప నిద్రపోతోంది అప్పుడే బడి మంచీ వచ్చినట్టున్న పిల్లలిద్దరు తమ కంచాల్లోకి అన్నం వస్తుందో రాదో నన్న సందేహంతోనే గావచ్చు అవతలి వైపు వాకిలికి కాపలా కాస్తున్నారు.

వచ్చిన పని సంగతి దేవుడెరుగుగానీ, అక్కడ నిల్చోడానికైనా కాళ్ళాడటం లేదు. గిరుక్కున వెనుదిరికి వచ్చేయాలనే అనుకున్నాను. అంతలో ఏదో అంతర్వాణి చెప్పినట్టుగా సచ్చిదానందంగారు కళ్ళు తెరిచేశారు.

"ఏమిటయ్యా రాజశేఖరం! ఎంతసేపైంది వచ్చి! నిల్చున్నా వెందుకు? కూర్చో నాయనా, అలా అరుగుపైన కూర్చో......"

"ఏమిటండీ మేష్టరుగారూ! అమ్మాయి కేదైనా జబ్బా?"—కూర్చుంటూ ప్రశ్నించాను. అది వెర్రి బాగుల పిచ్చి ప్రశ్న అన్న విషయం నా మట్టుకు నాకే తెలిసిపోతోంది.

"జబ్బా, జబ్బున్నరా! మెల్లగా అడుగుతున్నావా రాజశేఖరం! అదేం మాయదారి జ్వరమోగానీ వారం రోజులనుంచీ ఇంటిల్లిపాదికీ వూపిరి సలప నివ్వడంలేదు. పేదవాళ్ళ కొచ్చిన జబ్బయ్యా బాబూ! దీనిపైన నూర్లూ ఆర్లూ వెచ్చించమనడం భావ్యం కాదు. అంటే డాక్టర్లు ఒప్పుకోరు. అప్పటి నేనేదో ముల్లెను ముసుగులో దాచుకుని అమ్మాయికి సరైన చికిత్స చేయించడం లేదని ఇంటావిడ మొత్తికోలు. ఉదయం నిద్రలేచి బయటికి వచ్చే సరికి ఈ అరుగుపైన ప్రత్యక్షమయ్యేవాడు ఇంటి కామందు. అతగాడికి వరుసగా మూడు మాసాల ఇంటద్దె బకాయి. పాలావిడ ఎన్నడో పాలు పోయటం మానేసింది. రోజుకొక్క శేరు పాలు లేకపోతే ఇల్లు గడవదు. స్కూలుకు ఏ దారంట వెళ్ళడమనేది అనుదినమూ నా కెదురయ్యే ధర్మ సంకటం! రోడ్డుపైన వెళ్తే బట్టలకొట్టు ఆసామి. వీధిపైన వెళ్తే చిల్లరంగడివాడు. సందు దారి పడ్తే వడ్డి కంపెనీ వాళ్ళు. ఈ బాధలన్నీ పడలేక ఎక్కడికైనా పారిపోగలిగితే బాగుండు ననిపిస్తోందనుకో రాజశేఖరం! పులి మీద పుట్రలా ఈ హెడ్మాస్టరొకడు నాకు! చచ్చినా ఒక రోజు సెలవివ్వడు......"

సచ్చిదానందంగారి దురవస్థల జాబితాను మననం చేసుకుంటూ ఇంటిదారి పట్టడం వినా గత్యంతరం తోచిందిగాదు. "పోనీలెండి మేష్టరుగారూ! కష్టాలు మనుషులకు గాక మాన్లకు వస్తాయా? వస్తే వస్తాయి. ఏం చేస్తాయి. అవే వెళ్తాయి" అంటూ మానవ జాతికి పారంపర్యంగా సంక్రమిస్తున్న ఓదార్పు మాటల్ని వల్లించి లేవడానికి ఉద్యుక్తుడి నయ్యాడు.

కానీ, సచ్చిదానందంగారు ఆ పని చేయడానికి వీలిచ్చారుకారు-

"కూర్చోవయ్యా రాజశేఖరం! ఇంతకూ ఏం పనిమీద వచ్చావో చెప్పావుకావు......"

"అబ్బే, ఈ పరిస్థితిలో మిమ్మల్ని చూచిన తర్వాత చెప్పడానికి నోరెలా వస్తుందండీ మేష్టరుగారూ! నా పని కేముంది? ఏదో ఉబలాటం కొద్దీ వచ్చాను మరి మీరు సెలవిప్పిస్తే......"

"చూడు రాజశేఖరం! చల్లకొచ్చి ముంత దాచడ మెందుకు? నా కోసం ఎవరు వచ్చినా అప్పులు వసూలు చేసుక పోవడానికే వస్తారు. నువ్వొక్కడివి ఏదో పని బడి వచ్చానంటున్నావు అంతకంటే ఏం కావాలి నాకు! ఆ పనేమిటో చెప్పరాదూ!"

"మరేం లేదు. మరి......వీలుంటే మీచేత పద్యాలు వ్రాయించుక పోదామని వచ్చాను......"

"అది గదీ! అలా చెప్పాలయ్యా రాజశేఖరం! యూనివర్శిటీ పరీక్ష లెందుకు? ఇప్పుడు గనుక నేను పద్యాలు వ్రాయ గలిగితే అష్టావధాన శతావధానాలు చేసేవాళ్ళు నాముందు బలాదూరు......"

సులోచనాలుతీసి తొడుక్కున్న చొక్కా గుడ్డతోనే కళ్ళు తుడుచుకుంటూ కొనసాగించారు. సచ్చిదానందంగారు—"ఈ కవిత్వం వ్రాయాలన్న ఉబలాట ముందే, దీనంత మొండిది ఇదే ననుకో రాజశేఖరం! కానీ ఎడారిలో వూట బావులు పడవు గదా! ఏవో పద్యాలు కావాలని వచ్చావు. మంచిదే. కానైతే నాకు నిరుపహతి స్థలాలు చూపించ గలవా నువ్వు! పోనీ రమణీ ప్రియ దూతికలచేత కప్పురపు విడా లిప్పించగలవా! ఆత్మ కింపయిన భోజనం పెట్టించగలవా! పోనీ ఇవేవీ లేకపోతే మానె— ఓ పది రూపాయలు అప్పివ్వగలవా రాజశేఖరం! వద్దులే నాయనా వద్దు. ఉన్న అప్పుల వాళ్ళే చాలు. నీబోటి వాళ్ళు గూడా వాళ్ళతో కలిసిపోతే ఇక నన్ను వూళ్ళో ఆప్యాయంగా పలకరించే వాళ్ళుండరు—"

బయట మండు టెండలు కాస్తున్న ఆ మిట్ట మధ్యాహ్న వేళ సచ్చిదానందంగారి కళ్ళు చెమ్మగిల్లడం చూచాను.

సచ్చిదానందంగారు వెళ్ళి రమ్మని చెప్పకపోయినా సెలవు పుచ్చుకోడ మొక్కటే ఇక తరువాయి. లేచి రెండడుగులు వేశాను గూడా!

"ఇంతకూ పద్యాలు ఎందుకో, ఎవరి కోసమో చెప్పావుగావు......"

"ఎందుకైతేనేంలెండి మేష్టరుగారూ! ఎంతగా వద్దనుకున్నా, అప్పుడప్పుడు ఇల్లాంటి గొడవలు మీ కెదురవుతూ ఉంటాయి. మనసు బాగుంటే ఇది మీకు పెద్ద పనేమీగాదు ఓ మిత్రుడికి పెళ్ళి. బహుశా మీకూ తెలిసే ఉంటుంది నాగరాజని......"

సచ్చిదానందంగారు తటాలున లేచి నిల్చున్నారు. "ఉండుండు రాజశేఖరం! హారి నా మతి మరపు కూలా! ఎంత పొరబాటు జరిగిపోయిందో చూచావా!' గబ గబా లోపలికివెళ్ళి ఆయన తోలు సంచీ తీసుకొచ్చారు.

"పది రోజు లప్పుడు పట్టణంలో కనిపించాడు నాగరాజు. పెళ్ళి పత్రిక ఇచ్చి, తప్పకుండా రావాలని మరి మరీ కోరాడు. బస్సులో వస్తూ, వస్తూ పద్యాలల్లేశాను. నే నల్లడ మేమిటి? పోతన్నగారు భాగవతాన్ని వ్రాశాడంటావా రాజశేఖరం! రామచంద్రుడే పలికించాడు. నాగరాజు పైన నాకున్న వాత్సల్యమే నాచేత పద్యాలు పలికించింది ఏదీ ఎక్కడుందది...."

సంచీలోనుంచి ఓ కాగితం పైకి తీశారు సచ్చిదానందంగారు.

> "రాగ భరిత మనస్కుడు నాగరాజా
> ప్రథిత గుణ గణ విభవాభి రామ—రాధ
> పూవు తావియు చేరి పెంపొంది నట్లు
> అలరు గావుత ఈ గృహస్థాశ్రమమ్ము.

ఇంతకంటే నెనివ్వ గలిగిన శుభా శీస్సు లేమున్నాయి రాజశేఖరం! ఏదో వ్రాశానుగానీ, నా ఇబ్బందుల్లో సర్వమూ మరచిపోయాను. తీసుకెళ్ళు నాయనా తీసుకెళ్ళు ....."

కాగితాన్ని జేబులో ఉంచుకుని రోడ్డు పైకి వచ్చానో లేదో సచ్చిదానందంగారు మళ్ళీ పిలిచారు. పిలుస్తూ మెట్లు దిగి దగ్గరికే వచ్చేశారు.

"చూడు రాజశేఖరం! నాగరాజుకు పెళ్ళంటే

—65 వ పేజీ చూడండి



# అప్పల నరసయ్య

'వివేకం'

కథ ప్రారంభించేముందు వాణ్ణి గురించి కొంచెం చెప్పక తప్పదు. వాడి పేరు 'అప్పల నరసయ్య. రెండేళ్లపాటుగా నా రూమ్ మేటుగా ఉంటూ, నన్ను 'ఒరేయ్!' అని పిలవడం సాగిస్తున్నందు వల్ల వాణ్ని 'వాడు' అనే అర్హత నాకుంది.

కాళ్లకి పట్టేసి ఉండే ఓ కౌ బోయ్ పాంటూ, పొరపాటున చిత్రకారుడి మోచెయ్ తగిలి వొలికి పోయిన రంగుల కలయికలా ఉండే హాఫ్‌స్లీవ్స్ బుష్ షర్ట్సూ, ఎంత దూరం నుండి కనిపించినా, ఎరిగిన వాళ్లు 'అప్పల నరసయ్య' అని ఇట్టే పోల్చేసు కుంటారు. ముఖంలో అరేబియా దేశపు రాకుమారుడి క్రీనీడలు కనిపిస్తాయి. నడకలో రోము సైనికులు కనపర్చే రీవి, దర్పం ఉట్టి పడతాయి. అప్పల నరసయ్య సిగరెట్టు కాలుస్తాడు. వాడు సిగరెట్టు కాలుస్తున్నప్పుడు ప్రొఫైల్లో నిలబడి చూస్తే, సుమారుగా షాజహాన్ పాదుషా గులాబీపువ్వు వాసన చూసి నట్లుంటుంది ఎప్పుడూ ఏదో పని ఉన్న వాడల్లే కనిపిస్తాడు. ఎంత పెద్ద విశ్లేసినా ఓ పట్టాన నవ్వడు. కాని, నవ్వుకి కూడా తన హృదయంలో స్థానం ఉందని తెలియజేయగలందులకై అప్పుడప్పుడు దక్షప్రజాపతిలా చిన్న చిరునవ్వు విసురుతాడు.

"అప్పల నరసయ్యా!" అని పిలిస్తే ఎంతో బాధ పడతాడు. అది పాత కాలం పేరుట. ఆ పేర్లున్న పీరియడే వేరుట—కాలేజీలో అమ్మాయి అందరి ముందూ అలా పిలిస్తే వాడికి తల కొట్టేసి నట్టుండేది. 'కుమార్' అని పిలవాలంటాడు. అదే వాడి పెర్సనాలిటీకి తగ్గ పేరుట.

అందరి చేతా ఔననిపించుకోడానికి, ఈమధ్య వీడు కూడా ఒకమ్మాయిని ప్రేమించడం మొదలు పెట్టాడు. వాడే చెప్పాడు. ఆమె పేరు కవితట. యూనివర్సిటీలో ఆనర్సు చదువుతోందిట. అందంలో కందెంవేసే బంగారప్పిచ్చుకలా ఉంటుందట. డ్యాన్సు చేస్తుందిట. రచయిత్రి కూడా అని చెప్పాడు. ఓసారి వార పత్రికలో బీరకాయ పచ్చడి, ఆవ పెట్టకుండా ఎలా చెయ్యాలో రాసిందిట. వాళ్ల మ్యాగజైనులో 'విద్యార్థులు—దుష్ప్రవర్తన' అని వ్యాసం కూడా రాసిందిట. ప్రతి ఆదివారం లీలా మహల్లో ఇంగ్లీషు చిత్రానికి మొదటి ఆటకు తప్పకుండా వెళ్తుందిట. అందునా స్టంటు పిక్చర్లంటే మరి వదిలి పెట్టదుట. మొత్తంమీద ఆమె కళాతపస్వి అని తెలియజేశాడు.

ఓ రోజు మిట్ట మధ్యాహ్నం వాడు నాతో, "కవిత నా ప్రేమరాణి. నేను కవితని ప్రేమించాను" అని చెప్పగా విని, "కవిత ప్రియుడు అప్పల నరసయ్య—అహ్హాహా!" అన్నవ్వేశాను. దాంతో వాడికి చిన్నతనం వేసి, గంభీరంగా "నా పేరు అప్పల నరసయ్య కాదు. కుమార్!" అన్నాడు.

"అదేవిటి?" అన్నాను రిచ్చపోయి.

"అవును. అప్పల నరసయ్య ఇక లేడు. చచ్చి పోయాడు. ఇకనుండి నేను కుమార్‌ని. కవిత ప్రియుడు కుమార్‌ని." అన్నాడు వీధులోకి చూస్తూ —తన పేరులో కూడా 'క' గుణింతం వాడుకుని.

ఆరోజు, ఇరవై రోజులు పాతబడిపోయింది.

* * *

ఆదివారం —

నిన్న రాత్రి నిద్రాదేవి ఓ తొడ మీద వాణ్ని, ఓ తొడమీద నన్ను పడుకో బెట్టుకుని నిద్రపోయింది. నేను నిద్ర లేచి కళ్లు నులుముకుని చూసేసరికి, టేబులు మీది టైంపీసు ఎనిమిది చూపిస్తోంది. నేను నిద్రాదేవి ఒడిలో లేను. మధ్య గొయ్యి పడిన మడత మంచంలో ఉన్నాను. బాల భానుని ఉదయ కిరణాలు కిటికీలోంచి ఒంటి మీదపడి పలకరించ లేదు—కారణం—మా గదికి ఏ వైపునా కిటికీ ల్లేవు—ఆశ్చర్యం!!— అప్పల నరసయ్య కనిపించక పోవుట.

ఏమిటి విచిత్రం?! అనుకున్నాను. ఈ మెడికల్ కాలేజీ జీవితంలో, ఆదివారం పూట వీడు ఇంత పొద్దున్నే నిద్ర లేవడం ఇదే మొదటిసారి. ఏ సంగతీ చెప్పా చెయ్యకుండా ఎక్కడికి పోయినట్టు? ఎంత వూహించినా వాడెందు కిలా వెళ్ళిపోయాడో నా కంతు పట్టలేదు.

ఆశ్చర్యాన్ని అనుమానాన్ని కుక్కి మడత మంచంలో వదిలేసి — ఆరోజుకి సిద్ధం అయ్యాను.

* * *

అద్దం ముందు నిలబడి పళ్లు సగం వూడిపోయిన దువ్వెనతో అవస్థ పడుతుంటే— అప్పల నరసయ్య ప్రతిబింబం భుజంమీద మెదిలింది.

"ఎక్కడికి పోవుయారా పొద్దున్నే?" ప్రతిబింబాన్నే అడిగాను.

"పోస్టాఫీసుకి—రేపే కవిత పుట్టిన్రోజు— గ్రీటింగ్స్ పంపడానికి" రొప్పుతూ చెప్పాడు.

"పంపావా?"

"లేదు ఇవాళ ఆదివారం. పోస్టాఫీసు కట్టేశారు. రేపే కవిత పుట్టిన్రోజు. ఎల్లుండికాదు" అన్నాడు గద్గద స్వరంతో.

"పోనీ ఇంటికి తీసుకువెళ్ళి ఇయ్యి"

"మిక్కిలి ప్రమాదం. వాళ్లనాన్న మిలిటరీ నుంచి తిరిగి వచ్చేశాడు. యుద్ధం అయిపోయిందిట."

"వాళ్ళ నాన్న మిలిటరీనుంచి తిరిగి వచ్చాడని నీ కెవరు చెప్పారు?"

"ఎవరూ చెప్పలేదు. నిన్న సాయంత్రం అజంతా హొటలు కార్నర్ దగ్గర నిలబడి కనబడ్డ ప్రతి పీనుగునీ పిలిచి మరీ చెప్తున్నాడు. అంతిమ విజయం మనదేట తను ఇద్దరు చైనా వాళ్లని కాల్చి చంపేశాట్ట అందులో ఒకణ్ణి వీడికంటె ముందుగా ఇంకో డెవడో సిక్కు సైనికుడు కాల్చేశాట్ట. తర్వాత వీడు పదిసార్లు కాల్చి చంపేశాట్ట వాణ్ణి ఇంకో సైనికుణ్ణి రెండుసార్లు కాల్చి చంపేశాట్ట తీరా చూస్తే అందులో గుళ్ళు లేవట. పాపం వాడు గుళ్లున్నాయనుకొని చచ్చి పోయాడుట."

"ఏడిశాడు. అసలు వాణ్ణి అలాగే ఎవడో కాల్చేసి ఉంటాడు" అన్నాను

ఉన్నట్టుండి— చొక్కా విప్పేసి హేంగరుకి తగిలిస్తూన్న అప్పల నరసయ్య "ఆ—తట్టింది" అని ఎగిరి గంతేశాడు.

"ఏమిటి?" అని ఇటు తిరిగాను

ఒక చేతిలో హేంగరూ, మరో చేతిలో చొక్కా పట్టుకుని—వెర్రి చూపులు చూస్తున్నాడు. దువ్వెనతో చేతిమీద గోకాను. దువ్వెన పళ్లు రెండు విరిగిపోయాయి. వాడు కదల్లేదు.

"ఏమిటి?" మళ్లా అడిగాను.

కళ్లు పెద్దవిచేసి చూశాడు "హేంగరు వలన చొక్కా చిరిగి పోయింది." దుఃఖం ఆపుకుంటూ అన్నాడు.

"అసలు సంగతి చెప్పవేసి" అని దువ్వెనతో బుర్రమీద కొట్టాను. దువ్వెన రెండుగా విడిపోయింది.

వాకేసి తిరిగి దీనంగా చెప్పడం మొదలు పెట్టాడు. "ఏం చెప్పను వేస్తుం? ఈ రోజునుండి లీలా మహల్లో—బుల్‌విప్! భయంకర కొండా

దెబ్బ. గొప్ప ఎడ్వంచరస్ ఫిల్ము. ఫస్ట్ షోకి కవిత తప్పకుండా వస్తుంది. సినిమా హాలు దగ్గర నా ప్రేయసిని కలుసుకుని గ్రీటింగ్స్ ఇద్దామను కొన్నాను కాని—కాని."

"ఉ—కాని......"

"చొక్కా చిరిగిపోయింది. నా హృదయ చొక్కా కూడ చిరిగి పోయింది. నా అదృష్టపు కుండ బ్రద్ద లైంది. మన చాకలి పీనుగ బట్టలు తెచ్చేవరకూ ఈ చొక్కా ఒక్కటే నాకు దిక్కు. ఇప్పుడెలా? రేపు ఎలా?" అని వాపోతూ ముగించాడు.

"ఏడవక్కు బ్రాడూ! నా చొక్కా తొడుక్కు వెళ్ళు" అన్నాను ఉదారంగా. అన్నానేగాని, నేనూ వాడి పరిస్థితిలోనే ఉన్నాను. చాకలి బట్టలు తెచ్చేవరకూ నా క్కూడా ఆ చొక్కా ఒక్కటే దిక్కు. ఆ సంగతి వాడికీ తెలుసు.

"మరి నీకో?" అన్నాడు.

"అవును మరి నాకో?" అన్నాను.

"ఈ రోజుకి రూములో కూర్చుని గడుపు."

"కష్టం కష్టం. సాయంత్రం భక్తవత్సలం వస్తా నన్నాడు. వాడితో బజారుకి వెళ్ళి కుంపటి కొనాలి. వాళ్ళావిడ రోజూ పేచీ పెడుతోందట నన్ను సాయం రమ్మన్నాడు. చొక్కా లేకపోతే ష్టం" అన్నాను.

"బజారుకి రేపు వెడితే ఏమిటి కష్టం?"

"వాళ్ళావిడ ఇవాళే కావాలందట. ఇవాళ్లే తేవా లందట వాళ్ళావిడ మాటంటే వాడికి చాలా ఇష్టం."

"భక్తవత్సలం నిన్న వచ్చి రిక్వెస్ట్ చేశాడు" అన్నాను—ఇంతలో నా కంటిముందు సినిమాలో లాగ ఒక తక్కెడ కనిపించింది. క్షణంలో—ఒక తక్కెడ పళ్ళెంలో కుంపటి, మరో పళ్ళెంలో అప్పల నరసయ్య—ప్రత్యక్ష మయ్యారు. కాసేపు తక్కెడ ఇటూ అటూ వూగింది. విచిత్రం! ఉన్నట్టుండి అప్పల నరసయ్య తేలిపోయాడు. కుంపటి బరువై పోయింది—అంతే—తక్కెడ మాయమయి పోయింది. అంతా కలలో లాగ జరిగి పోయింది.

"మానేయడానికి వీల్లేదురా" అన్నాను బాధగా.

"నీకు నా ప్రేమ కంటె—భక్తవత్సలం కుంపటి ఎక్కువా?—వాళ్ళావిడ కోరిక ఎక్కువా?—చెప్పు చెప్పు!" అని ఒళ్ళంతా కుదిపేశాడు.

"అప్పల నరసయ్యా!!" అన్నాను ఆవేశంగా.

"వాడెవడు? వాడి పేరు ఇప్పు డెందు కొచ్చింది? నీ కిదేం బుద్ధి?" అన్నాడు.

"కుమార్!—నన్నర్థం చేసుకో. నే చెప్పేది పూర్తిగా విను. భక్తవత్సలం ఎవరనుకున్నావ్?"—కిటికీలోంచి శూన్యంలోకి చూస్తూ చెబుదామను కొంటే కిటికీలేని రూము అది. అందుకని గోడ వేపు తిరిగి, వూడిపోతున్న బెల్లుకేసి చూస్తూ నాటక ఫక్కీలో చెప్పాను.

"ఇప్పటికి సరిగ్గా నాలుగేళ్ళ క్రితం యూని వరి టీలో షష్ఠి పూర్తి మహాలు దగ్గర ఎవరో హఠాత్తుగా డేష్ యిస్తే వెనక్కి తూలి తలెత్తి చూశాను. సన్నగా, పల్చగా ఆరడగుల మనిషి కనిపిం చాడు. నన్ను చూసి చిరునవ్వు నవ్వేడు. సారీ చెప్పాడు, క్యాంటీనుకి తీసుకువెళ్ళి, కాఫీ ఇప్పించాడు—నే యాంత్రికంగా త్రాగాను. అడిగిందే తడవుగా అయిదు రూపాయలు అప్పిచ్చాడు. అంతే—నాలుగు రోజుల తర్వాత నుంచీ నాతో నాలు గేళ్ళపాటు రూమ్ మేటుగా వుండిపోయాడు, ఎవరు?—భక్తవత్సలం. అడిగినప్పుడల్లా లేదన కుండా అప్పిచ్చిన భక్తవత్సలం. నాలుగేళ్ళుగా రూమ్ మేట్‌గా వుండి నా లోట్లు దిద్దాడు. నాకు సలహా లిచ్చాడు. సిగరెట్టు కాల్చడం నేర్పాడు. నన్ను మనిషిగా తయారు చేశాడు. భక్తవత్సలం!—మళ్ళీ ఇన్నాళ్ళకి ఇక్కడ కనిపించాడు. కొత్తగా. పెళ్ళి చేసుకున్నాడు. మనసులో కుంపటి మెదిలినట్లుంది అవును. సంసారానికి మంచి నాంది. ఆ—భక్తవత్సలం ఈ సాయంత్రం నా దగ్గరరికివచ్చి 'కుంపటి కొనాలి. బజారుకి రావూ!' అని నోరు తెరిచి అడిగినప్పుడు నిరాకరిస్తే బాగుంటుందా చెప్పు! చెప్పు కుమార్ చెప్పు!" అని బరువుగా ఇటు తిరిగాను. ఆశ్చర్యంతో అప్పల నరసయ్య లేడు. ఎప్పుడో నా కళ్ళముందే మాయమయ్యాడు. చిరిగిపోయిన వాడి చొక్కా నేలమీద పడివుంది. ఒంగి చొక్కా తీసి, హేంగ రుకి తగిలించి స్టాండు వైపు నడిచాను. మళ్ళీ ఆశ్చర్యం!—నా చొక్కా లేదు. ఉన్నట్టుండి ఒళ్ళు మండిపోయింది. ఒక్కసారి భక్తవత్సలం, వాళ్ళావిడ కోరికా, కుంపటీ, కళ్ళముందు లీలగా మెదిలారు. ఖిన్నుడినై తిరిగాను. టేబులుమీది తెల్ల కాగితపు ఉత్తరం వెక్కిరించింది. తీసి చదివాను—

ఒరే బ్రదరూ!



సారీ! నీతో చెప్పి వెళ్ళడానికి టైము లేక పోయింది. నేను నీ చొక్కా తొడుక్కుని చాకి రేవుకి వెళ్తున్నాను. చాకలివాణ్ణి మన బట్టలు అడిగి తీసుకుని వెంటనే వచ్చేస్తాను. అందాకా రూములో ఉండు. —కుమార్.

'దొంగ వెధవ! నాతో చెప్పి వెళ్తే ఏం పోయింది' అనుకుంటూ ఉండగా, వీధి గుమ్మంలో రిక్షా ఆగిన చప్పుడైంది. 'ఎవరా?' అని చూసేంతలో—ఓ బెడ్డింగూ, రిక్షావాడూ, అప్పల నరసయ్య ఫాదరూ లోపలి కొచ్చేశారు.

''ఓ! మీరా? ఎప్పుడ్రావటం!—కూర్చోండి'' అని అందమయిన అసలు మడత కుర్చీ వాల్చి కూర్చో బెట్టాను. రిక్షావాడు బెడ్డింగుని కుదేసి, డబ్బులు తీసుకుని వెళ్ళిపోయాడు.

''హాఁ—ఇస్స్—ఉక్కబోత—ఎండలు వేసంగి—విపరీతం'' అని లాల్చీ విప్పేశారు ఆయన.

''కూజాలోవి కాసిని మంచినీళ్ళు ఇప్పించబ్బాయ్'' అన్నారు.

''కూజా నిన్నే పగిలిపోయిందండి. కంచు బిందెలో ఐసు ముక్కలు వేసిన నీళ్ళున్నాయి. నిమ్మకాయ పిండి తీసుకు వస్తానండి.'' అని గది మూలకి వెడిచి, కాసేపు కిందా మీదా పడి షర్బతు చేసి తెచ్చి యిచ్చాను. ముసిలి ప్రాణం—ఎండలో వచ్చాడేమో! గుటు గుటూ చప్పుడు చేస్తూ త్రాగేశాడు ఆయన.

త్రాగేసి, 'హాయ్' అన్నారు.

''ఏడీ? మావాడు?—ఎక్కడికి పోయాడు?'' అని అడిగారు

''ఇక్కడే. స్నేహితు డింటికి. వెళ్ళాడండి. చాలా సేపయింది, వచ్చేస్తాడు.''

''అబ్బాయ్! ఇదేమన్నా బాగుందా? ఆదివారం వాడు మిట్ట మధ్యాహ్నం స్నేహితుల ఇళ్ళకి షికార్లేవిటి చెప్పు? హాయిగా గదిలో కూర్చుని చదూకోక. హాయ్—ఇస్స్!''

''వచ్చేస్తాడు. కాస్సేపు విశ్రాంతి తీసుకోండి.''

''విశ్రాంతేవిటి? నా కవతల బోల్డు పనుంది.

# అప్పల నరసయ్య

నే నిప్పుడు ఇక్కడికి ఎందుకు వచ్చానో తెలుసా అబ్బాయ్?—''

''తెలియదండి.''

''చెప్తా విను. మా అబ్బాయ్ ఉన్నాడు చూశావ్''

''చూశానండి.''

''వాడికి పాతికేళ్ళు నెత్తిమీద కొచ్చాయ్. ఇంకా పెళ్ళి చెయ్యకుండా ఇలా గాలికి వదిలేస్తే — రేపో మాపో ఏ కాని పిల్లనో లేవదీసుకు చక్కా పోతాడు—అంటుంది. ఎవరు?—వాళ్ళమ్మ అందుకని రేపొచ్చే మాఘమాసంలో ముహూర్తం పెట్టించి, ఆ శుభ కార్యం కాస్తా జరిపించేస్తాను. పిల్ల సిద్ధంగా వుంది. ఇక్కడే. ఈ వూరే. వాడికి వేలు విడిచిన మేనమామ ఒక డున్నాడు. అదుగో—అత గాడి కూతురు. ఏదో కాలేజీ చదువే చదువుకుంటోం దిట. పిల్ల నిక్షేపంలా ఉంటుంది. ఏమంటావ్?—పొద్దున్నే పిల్ల తండ్రితో మాట్లాడే చక్కా వచ్చా నిక్కడికి. కుర్రాణ్ణి చూస్తా నన్నాడు. సరే సాయంకాలం తీసుకు వెడదాం అవటా అన్జెప్పేసేసి వచ్చాను—వెధవ! వీ డింకా రాలేదు. ఎక్కడికి పోయినట్టు. అబ్బాయ్! హాయ్! ఇస్స్! నువ్వు కుర్రాడివి దగ్గరున్నావ్. వాణ్ణి కొంచెం అటూ, ఇటూ తిరక్కుండా కనిపెట్టి చూడాలి మరి! నువ్వు బుద్ధి మంతుడివేటగా! మీ నాన్నగారు చెప్పార్లే—అందుకనే నీ దగ్గర పెట్టాను వీణ్ణి. హాయ్—ఇస్స్! ఉక్కబోత. ఎండ—విసినికర్రుందా?''

''అబ్బే! విసిని కర్రెందుకండీ? ఫాను వేస్తాను'' అని ఫాను ఆన్ చేశాను.

''ఏవిటి వీడింకా రాడు? ఎండలో ఈ తిరుగుడేవిటి? కాళ్ళు కాలవ్? నెత్తి మాడదూ? ఓసారి చూసొస్తా వేవిటీ? ఎందుకంటే మళ్లీ సమయం కాస్తా మించిపోతుంది. ఓసారి పిల్చుకు రద్దూ!'' అన్నా డాయన.

''అబ్బే!—ఇక్కడికే వెళ్ళాడు. వచ్చేస్తాడండి'' అన్నాను మనస్సులో మా వాణ్ణి తిట్టుకుంటూ.

''ఇక్కడ కామట్టే నిన్నోసారి చూసి రమ్మంటున్నా. దూరమైతే ఈ ఎండలో నిన్ను పంపుతానా చెప్పు'' అన్నాడు. ఇక తప్పదురా బాబూ—అనుకున్నాను. ఆయన గోడవైపు తిరిగి కేలెండరు చూస్తున్నారు. మెల్లగా ఆయన చూడకుండా బనీనుతోటే వీధిలోకి వచ్చేసి, దారిన పోతున్న రిక్షాని పిలిచి, ఒక్క క్షణమైనా ఆలస్యం చెయ్యకుండా ఎక్కేశాను.

''ఎక్కడికండి?''

''చాకి రేవుకి—''

''సెప్పండి. నాతో యాళాకోళ మేటికాని—'' అన్నాడు రిక్షావాడు సిగ్గుపడుతూ.

''వేళాకోళంకాదు. ముందు చాకి రేవుకి తగులడు'' అన్నాను.

కాస్సేపు తొక్కిన తరువాత, ''ఎదురుగా లండి, టాపు తీసేస్తాను'' అన్నాడు.

నాకు ఒళ్ళు మండిపోయింది. నేను బనీనుతో ఉన్నానని వాడికిమాత్రం తెలియదు గనుకనా? ఈ నడి బజార్లో టాపు, తర్వాత నా పరువూ—తీసేస్తాడా?''

''తియ్యొద్దు పోనీ!'' అని గట్టిగా అరిచాను.

''చుక్కేశారేటి గబాబయ్యా! నాకు తెల్సు'' అని ఇక మారు మాట్లాడకుండా హుషారుగా తొక్కుకుంటూ చాకి రేవుకి సాగిపోయాడు — దిగి రిక్షావాణ్ణి ఉండమని చెప్పి నాలు గడుగులు వేసి తలెత్తి చూశాను.

—ఫర్లాంగు దూరంలో చాకలి వాళ్ళంతా గుంపుగా గుమిగూడిపోయారు. వాళ్ళల్లో వాళ్ళేదో ఘర్షణ పడుతున్నారు. ఆ గుంపు దాటి మరో ఫర్లాంగు నడిస్తేకాని మా చాకలివాడి స్థావరం రాదు. నడుస్తూ నెమ్మదిగా చాకలి గుంపు దరికి చేరాను. ఆశ్చర్యం!—దాదాపు ఓ పాతికమంది చాకలి వీరులు అప్పల నరసయ్యని చుట్టు ముట్టేశారు. వాడి ఒంటిమీదవున్న(నా) టెర్లిన్ చొక్కాని ప్రక్కనున్న బుర్ర మీసాల చాకలివాడు ఒలి చేసుకుని, తలారిలా గుడ్లురిమి చూస్తున్నాడు. మరో పల్చటి ఎత్తుపళ్ళ చాకలాడు అప్పల నరసయ్య బనీను కాలర్ పట్టుకుని ''సెప్పు! సెబుతావా సెప్పవా?'' అంటున్నాడు. గుంపులోంచి సంగీతం మేష్టరిలావున్న మరో చాకలి, ''దొంగ నాయాల! ఆడెందుకు సెబుతాడు? సంపీసిండి నా కొడుకుని'' అంటున్నాడు. అప్పల నరసయ్య ఏడుపు మొహంతో, ''నాకేం తెలియదు మొర్రో! నన్ను వదిలి పెట్టండ్రోయ్!'' అంటున్నాడు. నేను మధ్యకి దూరుదా మనుకొంటే, ఒక్క పీనుగూ నాకు సందివ్వలేదు. మరో కాస్సేపట్లో పరిస్థితి విషమించేట్టు కనబడుతోంది. రాక్షస ప్పీనుగులు వాణ్ణి చంపేసినా చంపేయగలరు. ఆ క్షణాన చాకళ్ళమధ్య అప్పల నరసయ్య, రాక్షసుల చేతిలో చిక్కిన దేవకన్యలా రెపరెప లాడుతూ కనిపించాడు నా కంటికి. ఏమైనా, నా వల్ల ఏమీ అయ్యేట్టు కనబడలేదు. వెంటనే మా చాకలివాడి దగ్గరికి దగ్గరికి పరుగు తీశాను. క్షణంలో వాడికి సంగతి కాస్తా చెప్పి కూడా, తీసుకు వచ్చాను. చాకలి మూరా అప్పల నరసయ్యని ఇంకా వేధిస్తున్నారు. మా చాకలివాడు వాళ్ల మధ్యకి ఈదుకుంటూ వెళ్ళి, ఆపద్బాంధవుడిలా అడ్డుపడి, అప్పల నర



నయ్యా ఎవరో చెప్పి, వాళ్లందరికీ సర్ది చెప్పి— చివరికి విడిపించుకొచ్చాడు తర్వాత మా బట్టలు తీసుకుని రిక్షాలో కొచ్చి పడ్డాం. మా వాడి మొఖాన్ని ఏడుపు కళ ఇంకా పోలేదు

"ఏం జరిగిందిరా?" అని అడిగాను.

"ఏం జరిగిందని చెప్పను? దారుణం జరిగిపోయింది. ఇందాక వాళ్లందరూ నన్ను పట్టుకున్న చోటికివెళ్ళి మన చాకలివాడికోసం వెదికాను. ఆ వెధవ కనిపించలేదు. చుట్టూ చూశాను. అక్కడ ఎన్నో రకాల చొక్కాలు తాడుమీద ఆరేసి ఉన్నాయి. అందులో గళ్ళ చొక్కా నాదిలా కనిపించింది. మనకి అర్థంటుగదా! తర్వాత వాడితో చెప్పొచ్చుగదా అని ఆ తాడుమీది గళ్ల చొక్కా మీద చెయ్యి వేశానంతే వెంటనే అక్కడ బట్టలు ఉతుకుతున్న పీనుగు లందరూ మిడతల్లావచ్చి నన్ను చుట్టు ముట్టేశారు. నా ఒంటిమీది చొక్కా కాస్తా విప్పేసుకుని, "దొంగ నాయాలా! నువ్వెవరో చెప్పు? ఏ వూరు నీది? అని ప్రాణాలు చిలికేశారు. సమయానికి నువ్వు రాకపోతే ఆ వెధవలు నన్ను కాస్తా నీలి మందేసి ఉడక బెట్టేద్దురు" అని చెప్పాడు.

"మన చాకలాడు అక్కడే ఉంటాడని ఎలా అనుకున్నావు?"

"నువ్వోసారి చెప్పావుగా—మన చాకలివాడున్న చోట ఎలక్ట్రిక్ స్తంభం ఉంటుందని. అలాగని గుర్తు పెట్టుకు వెళ్లాను."

"ఏడవలేక పోయావ్! ఎలక్ట్రిక్ స్తంభం ఉందని గుర్తు పెట్టుకున్నాట. చచ్చు తెలివి! ఎద్దు పడుకుందని గుర్తు పెట్టుకోలేక పోయావ్? వెధవ ఎలక్ట్రిక్ స్తంభాలు, ప్రతీ ఫర్లాంగుకీ ఒకటి చొప్పున ఉన్నాయి" అని— తర్వాత వాళ్ల తండ్రి వచ్చిన సంగతీ, అదీ చెప్పి ముగించేసరికి రిక్షా మా రూము దగ్గర ఆగింది.

లోపలికి అడుగు పెట్టేసరికి అప్పుల నరసయ్య ఫాదరు "ఏరా నర్సూ! ఎక్కడి కెళ్లావ్?— నీ కోసం మధ్యాహ్నం మనగా కూర్చొని ఎదురు చూస్తోంటే ఉ—ఉ చప్పున కాస్త మొహం అదీ కడుక్కొని తయారవు వాళ్ళు మనకోసం ఎదురు చూస్తూ ఉంటారు. ఆ పిల్లకి నీమీద ఒకటే వ్యాస" అన్నా రాయన గుక్క తిప్పుకోకుండా.

"హు ఈజ్ దట్ గర్ల్స్?" అని ప్రశ్నించాడు అప్పుల నరసయ్య. వీడి దగ్గరున్న రోగమల్లా ఇదే. ఆ ముసిలాయనకి తెలుగు తప్ప మరో భాష రాదు. ఆయనతో ఈ పీనుగు ఇంగ్లీషు తప్ప తెలుగు మాట్లాడడు.

"ఆ అమ్మాయి పేరు అడుగుతున్నాడండి" అన్నాను నేను.

"తెలుగులో ఏడవ కూడదూ? వెధవవేషం! అమ్మాయి పేరు మహాలక్ష్మి. లక్షణంగా ఉంటుంది. నీకు మేనకోడలు వరస."

"నో—నో. నేను రాను. నా కిష్టంలేదు. ఐ డోంట్ లైక్" అన్నాడు.

"అదేవిట్రా? పిల్లని చూడకుండానే ఇష్టం లేదంటావ్?" అన్నా రాయన విస్తుపోయి.

"యు డోంటునో ఫాదర్! దట్సాల్!" అన్నాడు ధృఢంగా అప్పుల నరసయ్య. ఆయన కేమీ అర్థం గాక, నా వైపు తిరిగి, "యావిటి వీడి పిండా కూడు?" అన్నారు

"నా కిష్టంలేదు ఫాదర్! నేను రాను." అన్నాడు అప్పుల నరసయ్య కవితని వూహించుకుంటూ.

"రావూ? ఎందుకురావు?" అని అడిగారు ఆయన

"నేను ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. దట్సాల్!" అన్నాడు నరుసు.

"ఏమిటి? ప్రేమించి పెళ్ళి చేసుకుంటావా? లేకపోతే చేసుకోవా?"

అప్పుల నరసయ్య తల అడ్డంగా తాటించాడు. ఆయన విజృంభించారు.

"నే నెల్లా చేసుకున్నాను?— అసలు నా పెళ్ళి ఎలా జరిగిందని? నీకు తెలియదు. నువ్వింకా పుట్టలేదు ఏముందీ? మీ అమ్మనిలా తీసుకు వచ్చారు. అలా కూర్చో బెట్టారు మీ తాత అంటే మా నాన్న. 'వూ' అనమన్నాడు. అన్నాను. అంతే నాలుగోరోజు తెల్లవారేసరికి అంతా అయిపోయింది అసలు చచ్చిపోయిన వాళ్ల గురించి అనకూడదుగాని, దానంత తలతిక్క మనిషి మరెక్కడా ఉండదు. ఓమాటు సిమ్మెంటు గోళెం, పులుసూరాచిప్పా కొనేదాకా ప్రాణాలు తోడేసింది. ఏం చేశాను అనుభవించాను. అంతేగాని, ఇప్పట్లా చందమామ కిందా, ఆ బీచి ఒడ్డునా కూర్చొని అవస్థ పడ్డావా? పెళ్ళయింది దానంతటదే పుట్టుకొచ్చింది ప్రేమ"

అదేదో షాపులో లోపల ఎలుకలున్న బోనులు అమ్ముతున్నాగుట.

పి శారద (ఒంగోలు)

"మరయితే తాతయ్య, బామ్మ నెలా పెళ్ళి చేసుకున్నాడు?— ప్రేమించి కాదూ?" అని అడిగాడు పాయింటు లాగుతూ.

"నీ కెల్లా తెలుసు?"

"బామ్మే చెప్పింది."

దాంతోటి ఆయన చల్లబడిపోయి నాకేసి చిన్న చూపు చూశారు. (అంటే వోరకంట చూశారు) వెంటనే నేను అప్పుల నరసయ్యని బలవంత పెట్టసాగాను. ఆయాసం తీర్చుకుని ఆయన మళ్లీ తగులుకున్నారు.

"అసలు నీ కేవిటి జబ్బు—పిల్లని చూడ్డానిక్కూడా రాక పోవడానికి అసలు నిన్ను ఒంటిగా ఇక్కడ తగలెట్టి నెల నెలా డబ్బు పంపడం దోషం. తండ్రి మాటంటే పీస మెత్తు ఖాతరు లేని పీనుక్కి చదువేవిటి? నా చిన్నతనంలో ఇలాగే అఘోరించావా? తండ్రి పేరు చెబితే పులిని చూసి నట్టుండేది. తండ్రి గీసిన గీటు దాటి ఎరగం. అయినా నిన్నని ఏం లాభంలే తల్లిలేని పిల్లాడివని గారంచేసి నెత్తి కెక్కించుకున్నాను. నాదీ తప్పు. మీ అమ్మే వుంటే ఇలా మాట్లాడే వాడివిరా ఒంటిగాణ్ణి చేసి యింత మనిషినీ గడ్డిపరకని తీసేసి నట్టుతీసేస్తావా? నిన్ను పెద్ద చేసి—పెళ్ళిచేసి— నువ్వూ కోడలు పిల్లా కలిసి నలుగురు పిల్లల్ని కంటే చూసి సంబర పడాలని అందరిలా నాకుమాత్రం ఉండదురా? నీ కిదేం బుద్ధిరా? పిల్లని చూడ్డానికి రమ్మంటే రావూ?" అని అరగంట సేపు లెక్చరిచ్చేశారు. యోగి వేమన పోజులో మంచం మీద కూర్చుని అన్నీ విన్నాడు. చివరికి ఏమనుకొన్నాడో ఏమో—"సరే. పద వెళ్దాం" అన్నాడు.

ఆయన, "నువ్వు కూడా రా అబ్బాయ్" అన్నారు నన్ను.

ముగ్గురం బయల్దేరి వాళ్లింటికి వెళ్ళేసరికి సాయంత్రం ఐదున్నరయింది.

మేం హాల్లోకి అడుగు పెట్టగానే బలంగా, పొడుగ్గావున్న ఒకాయన నవ్వుతూవచ్చి ఆహ్వానించాడు. హాల్లోకి తీసుకువెళ్ళి కూర్చోబెట్టాడు. ఇల్లు, వాతావరణం—భాగ్యవంతులని తెలియ జేస్తున్నాయి. కాస్సేపు ముసిలివాళ్లిద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. ఇంతలో ఒకమ్మాయి కాఫీ, ఫలహారాలు తీసుకు వచ్చింది.

"మా అమ్మాయి. మహాలక్ష్మి. యూనివర్సిటీలో ఆనర్సు చదూతోంది" పరిచయం చేశాడు ఆయన. నవ్వుతూ నమస్కారం చేసింది. అందంగా నిండుగా వుంది. అ. న. తండ్రి మా ఇద్దర్నీ పరిచయం చేశారు. మావాడు ఆశ్చర్యంగా చూస్తూ ప్రతి నమస్కారం చేశాడు. ఆ ముసిలాయన ఈ ముసిలాయన్ని "తోట చూపిస్తాను రండి" అని తోలుకుపోయాడు—డ్రామాలో పాత్రల్లా క్లియరయ్యారు. అప్పుల నరసయ్య నా చెవిలో 'కవిత!' అని గొణిగాడు. నా కర్థం కాలేదు

"మీ పేరు కవిత కాదూ?" అని అడిగాడు మహాలక్ష్మిని.

"అది నా పెన్ నేమ్. నా అసలుపేరు మహాలక్ష్మి" అంది. దాంతో సందేహం కాస్తా తీరిపోయింది. మావాడు ఒక్కసారి పొంగిపోయి, "గ్లాచ్యూ మీచ్యూ" అన్నాడు. అరగంటసేపు హుషారుగా గడిచి పోయాక ముసిలివాళ్ళిద్దరూ తిరిగి వచ్చారు.

"లీలా మహల్లో మంచి పిక్చరుంది. వెళ్దామా" అంది క్లైము చూసుకుంటూ కవిత.

"ఓ తప్పకుండా!—" అన్నాడు.

"కమాన్ — లెటజ్ గో" అన్నారు పిల్లవేపు ముసిలాయన. అందరం కలిసి సినిమాకి బయల్దేరాం

—సినిమా మొదలయింది. వాడెవడో, జడలు పెంచుకుని, కనిపించిన వాళ్లనల్లా కొరడాతో కొట్టి, పొట్టలో గుద్ది చంపేస్తున్నాడు. అది చూసి, అప్పుల నరసయ్య తండ్రి ఉండబట్ట లేకపోయారు. అప్పుల నరసయ్యతో అన్నారు. "వాడెవ్రరా? ఆ జులపాలవాడు? అందర్నీ కొడతాడు. మరీ అంతంత జులపా లేవిటి గాంధో భీ వాడిలాగ? మంచీ, మర్యాదా ఉండక్కర్లా?"

అప్పుల నరసయ్య వినిపించుకోలేదు కవిత చెక్కిళ్లకేసి చూస్తున్నాడు. ఆయన మెల్లిగా చెవిలో, "పిల్ల నచ్చిందిరా" అని అడిగారు.

"నచ్చింది ఫాదర్!" అన్నాడు అప్పుల నరసయ్య చూపు తిప్పకుండా. ఆయన ఆనంద సముద్రంలో పడి ఈత రాక మునిగిపోయారు.

* * *

మర్నాడు పొద్దున్న వాడూ, నేనూ నిద్ర లేచేసరికి అ. న. ఫాదరు గుండెలు బాదుకుంటూ వచ్చి, "ఒరే అబ్బీ! మహాలక్ష్మి ఎవడ్నో ప్రేమించిందిట. లేచి పోయిందిరా నాయినా!" అని కుర్చీలో చతికిలబడి పోయారు. ★

## గ్రహస్థితి

మిధునంలో రాహువు, సింహంలో సూర్య, శుక్రులు, కన్యలో అంగారక, బుధులు, ధనుస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, కన్య, తుల, వృశ్చిక ధనుస్సులలో చంద్రుడు.

**23-8-1963 శుక్రవారము మొదలు**
**29-8-1963 గురువారము వరకు**




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

### మేషం:

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ప్రస్తుతం శ్రమ పడవలసిన సమయం. మనస్సులో ఆందోళన కలుగుతు ఉంటుంది. మీరు చేయు పనులకు పూర్తి ఫలితం కనుపించదు. మీ ఆరోగ్యం బాగుంటుంది. బాహ్య కార్య కలాపాలలో గొప్పవారి అండ దండలు లభిస్తవి. ఖర్చులు మాత్రం అమితంగా తోచగల సమయం. కోర్టు, కచేరీలలో సమయం చూచి పనులు జరుపుకొన వలసి ఉంటుంది. వృత్తిలో చాలావరకు స్వేచ్ఛ, పై వారివల్ల ప్రోత్సాహము లభిస్తవి. సత్కథా కాలక్షేపాలకు అవకాశం లభిస్తుంది. అగ్నియంత్రి సంబంధమైన పనులలో జాగ్రత్తగా ఉండండి. ఈ సమయంలో విశేషంగా లాభించగల అవకాశాలు, సూచనలు కనుపించినా, పూర్తిగా నమ్మవద్దు. సాటివారితో విరోధ సూచ లున్నవి. 23, 24 తేదీలలో సంతోష వార్త, ప్రయాణము.

* * *

### వృషభం:

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఈ సమయంలో గొప్పగా మాటలు చెప్పిన వారు ఎవరు మీకు ఉపయోగించరనే విషయం గుర్తుంచుకొనండి. ఏ పనిలో ప్రవేశించినా స్వశక్తి మీదనే ఆధారపడవలసి ఉంటుంది. కుటుంబ కార్య కలాపాలు, భేదాభిప్రాయాలతోనే సాగుతవి. సమయంలో బుద్ధి బలంతో వృత్తి, వ్యాపారాదులను సాగించుకొన గలుగుతారు. ఒకటి రెండు సందర్భాలలో ఇతరుల మాట విని దండగ ఖర్చులు పైన వేసుకుంటారు. సంతోష వార్తలు తెలుస్తవి. ఎవరికి ఎంత మేలు చేసినా, ఏదో ఒక చిన్న విషయంలో మనస్పర్థలు ఏర్పడే సమయం. అలంకార నిమిత్తము, విలాస కార్యములలోను, ధనవ్యయం చేస్తారు. ఉష్ణాధిక్యంవల్ల శిరో భాగములలో బాధలు కలుగుతవి. స్వల్ప విషయాలలో కూడా ఉద్రేక పడతారు. 24, 25 తేదీలలో శ్రమ, విరోధ సూచనలు.

* * *

### మిధునం:

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఈ సమయంలో ఒకరిని నమ్మక తప్పదు. అందువల్ల బాధ పడకను తప్పదు. అయితే దైవానుగ్రహంవల్ల ధన గౌరవాలకు హాని రాదు. అనుకున్న పనులు సమయం దాటకుండా సాగిస్తారు. పదిమందికి సంబంధించిన వ్యవహారాలలో మంచితనంతో ఎదటివారిని సరి చేసుకొన కలుగుతారు. ప్రయాణాలు హాయిగా జరుగుతవి. కార్యభారం అసౌఖ్య లక్షణాలు కనుపిస్తవి. ముఖ్య కార్యాలలో పాల్గొంటారు. ముఖ్యంగా ఆడంబరం నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. బంధువుల రాక పోకలు అధికం కావచ్చు. మీ అధికారాన్ని వినియోగించుకొని సాటివారికి మేలు చేయగలుగుతారు. రాబోవు కాలాన్ని గురించి ఆలోచనలు, నిర్ణయాలు జరుగుతవి. ఉదర కోశాలలో బాధ కనుపిస్తుంది. 25, 26 గౌరవం, దైవ కార్యాలు.

* * *

### కర్కాటకం:

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

గతవారంకన్నా ఈ వారం మనశ్శాంతి లభిస్తుంది. వృత్తి, ఉద్యోగాలలో పరిస్థితులకు అనుగుణంగా పోగలుగుతారు. ఇతరుల దూషణ, భూషణలను లెక్కపెట్టకుండా స్వబుద్ధితో చురుకుగా ముందుకు పోగలుగుతారు. విద్యారంగంలో అభివృద్ధికరమైన కాలం, మీ నిత్య కృత్య వ్యవహారాలలో నిగ్రహంతో మసలుకోగలుగుతారు శుభ లాభ వార్తలు తెలుస్తవి. అయితే స్థిరాస్తులు కొనే ప్రయత్నాలు అంత సుముఖంగా కనుపించవు. ఆదాయం మామూలుగా ఉంటుంది. సంఘ కార్యాలలో తోటివారి అసూయాభావము, విరుద్ధ ప్రసంగాలు మీ ఉత్సాహాన్ని తగ్గించగల అవకాశా లున్నవి. అధికారులవలన సాధారణ ఉపకారం మాత్రమే ఉంటుంది. 26, 27 తేదీలలో ధన వ్యయము, దేహ శ్రమ.

* * *

## ఈ వారము ధరలు

పసుపు ధర తేజీ అవుతుంది. ప్రత్తి, నూలు ధరలు సాధారణంగా ఉంటవి. మిర్చి ధర వారాంతంలో పెరిగే సూచన లున్నవి. నూవులు, నూవుల నూనె ధరలు కొద్దిగా తగ్గుతవి.

### సింహం:

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ఉత్సాహవంతమైన సమయం. పోయినవనుకొన్న వస్తువులు లభిస్తవి. మీరు చేయు ప్రతి పనికీ ప్రోత్సాహము, ప్రతిఫలము బాగుంటవి. హుందాతనంతో మాటను సాగించుకొనగలరు. అయితే ఎదటివారి మనస్సును గ్రహించటం అవసరం. వృత్తిలో భారం పెరుగుతుంది. ధన సంబంధమైన వత్తిడి కనుపిస్తుంది. కుటుంబంలోని వారి ఆరోగ్యం బాగుండదు. ప్రస్తుతం ఆరంభించే వ్యవహారము సులభంగా కనుపించదు. ధైర్యంతో గమ్యస్థానం చేరుకొంటారు. స్వయంగా తెలుసుకొనకుండా మధ్య వారి మాటలకు విలువ ఈయవద్దు. వృత్తి మార్గంలో ప్రతి బంధకాలు క్రమంగా తగ్గిపోతవి. శుభవార్తలు తెలుస్తవి. ప్రయాణ సూచన లున్నవి. 27, 28 తేదీలలో దేహ బాధలు.

* * *

### కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

గుట్టును కాపాడుకొంటు మాట్లాడటం అవసరం. చిక్కులు వచ్చినట్లే వచ్చి తేలిపోతూ ఉంటవి. దైవానుగ్రహంవల్ల కోర్టు, కచేరీలలో మీ మాట నెగ్గుతుంది. ఆరోగ్యం బాగుంటుంది. క్రొత్త అవకాశాలు కలిసి రాకపోయినా వృత్తి ఉద్యోగాలలో మీ స్థితికి ఎంత మాత్రం లోపం రాదు. బాహ్య ఆడంబరం తగ్గించుకొనటంవల్ల సుఖం లభిస్తుంది. స్నేహితుల గురించి కష వార్తలు తెలియగల సమయం. సంఘ కార్యాలలో ప్రస్తుతం చికాకు పెరుగుతుంది ఆత్మీయుల ఆరోగ్య భావం అసంతృప్తికరంగా ఉంటుంది. కొన్ని వారాలుగా ఆలోచిస్తున్న కార్య కలాపాలు మరొక అడుగు ముందుకు సాగుతవి వారం రెండవ భాగంలో మనశ్చాంచల్యము, అకారణ భయముతో తోచగల అవకాశా లున్నవి. 28, 29 తేదీలలో పోటీ మాటలు, దండగ ఖర్చులు.

* * *

### తుల:

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

విరుద్ధ స్వభావంగల పెద్ద మనుష్యుల మధ్య జాగ్రత్తగా నిలబడవలసిన సమయం. అనేక సందర్భాలలో మృదువుగా తప్పుకొనవలసి ఉంటుంది.

మీ ఓర్పుకు పరీక్షా సమయం. స్వవిషయం ఎలా ఉన్నా, ఇతరులకు సహాయం చేయవలసి వస్తుంది. దైవ కార్యాలు జరుగుతవి. ముందు చిక్కులను ఎదుర్కొన్న తరువాత ధన సహాయం లభిస్తుంది. ప్రయాణాలు చేస్తారు వృత్తి, వ్యాపారాలలో మీరు తలచినంత ఉపయోగం కనుపించదు. శారీరకంగా అలసట, ఆరంభించిన కార్యక్రమాలలో ఆటంకాలు వస్తు ఉంటవి. మనోధైర్యము, జాగ్రత్త పెరుగుతవి. క్రొత్త స్నేహితులవల్ల గౌరవం, లాభం, ఉంటవి 28, 29 తేదీలలో శుభ వార్తలు, ప్రయాణాలు, ఆందోళన కలిగే వార్తలు.

* * *

## వృశ్చికం:

**(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ప్రస్తుతం మీ ప్రయత్నాలకు చివరి ఘట్టం వస్తుంది. ధన వ్యయం పెరుగుతుంది. మనస్సు ఉత్సాహంగా ఉన్నా చిన్న చిన్న కారణాలు అడ్డు పడగల అవకాశా లున్నవి ఇంతకుముందున్న పేచీలు తొలగిపోయి, వృత్తి ఉద్యోగాలలో ఒక స్థాయికి రాగలుగుతారు. అన్నివిధాలా స్వేచ్ఛ, లనేది తోస్తుంది ఆ కారణంగా వ్యాపించిన అపవాదులు తేలిపోతవి. స్నేహితులు మిమ్ములను గౌరవిస్తారు. కోర్టు కచేరీలలో జయం లభిస్తుంది. విలువగల వస్తువులు మొదలయినవి కొంటారు. మీ మాటవల్ల ఎదటి వారి మనస్సు బాధ పడకుండా చూచుకొనండి. శుభవార్తలు తెలుస్తవి. 27, 28 తేదీలలో ధన లాభం, శుభవార్తలు.

* * *

## ధనుస్సు:

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఎన్నో ఆలోచనలు చేస్తు ఉంటారు. బాహ్య ఆడంబరం అధికం. ధనాదాయం సాధారణంగా ఉంటుంది. నీచులతో కలహ ప్రసంగాలు వస్తుంటవి. దేని కది చిన్న పనిగా కనుపించినా మొత్తం మీద విశ్రాంతి మాత్రం ఉండదు. తోటి వారి ప్రోత్సాహము మిమ్ములను ముందుకు తీసుకు వెళ్ళ గలుగుతుంది. ఇంతకుముందు భయపడి విరమించిన కార్య కలాపాలు క్రమంగా సాగించ గలుగుతారు. కుటుంబంలోని భావాలు ఒక దాని కొకటి కలవక పోవచ్చు. వారం రెండవ భాగంలో ఎదురు చూస్తున్న ఫలితం చేతికి వస్తుంది. 26, 27 తేదీలలో దేహశ్రమ, వస్తునష్ట సూచన.

* * *

## మకరం:

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

తరచు సందేహాలతో సతమత మవుతు ఉంటారు. దానికితోడు స్నేహితుల ప్రసంగాలు కూడా అదే ధోరణిలో ఉంటవి ధనాదాయం బాగుంటుంది. కుటుంబంలోనివారు మీ ఆలోచనలను వెంటనే ఆమోదించక పోవచ్చు. సాధ్యమైనంతవరకు దేహ పరిశ్రమను తగ్గించుకొనటానికి ప్రయత్నించండి. ఎవరితో, ఏ వ్యవహారం జరిపినా మీరున్నంత ఉదారంగా అవతలివారు ఉండక పోవటంవల్ల నిరుత్సాహం కలుగుతుంది. వృత్తిలో అభివృద్ధి సూచన లున్నవి. మీ బాధ్యతలను ఎప్పటి కప్పుడు తగ్గించుకొంటు ఉండటం అవసరం. పిల్లల ఆరోగ్యం బాగుండదు. లాభవార్తలు తెలుస్తవి. అధికారుల వలన అనుకూలత ఉంటుంది. 25, 26 తేదీలలో ధర్మ కార్యాలు, ధన లాభం.

* * *

## కుంభం:

**(ధనిష 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

సమయం అనుకూలంగా ఉన్నది. ఎదటివారికి సహాయం చేస్తు మీ పనులను కూడా అదే సమయంలో చక్కబెట్టుకొన గలుగుతారు. వ్యాపార సంబంధమైన పనులలో గౌరవం, ధనలాభం ఉంటవి. అనుకోకుండా అధికారులను కలుసుకొంటారు. మీ జాగ్రత్తవల్ల అపాయమునుంచి తప్పించుకొంటారు. స్వల్ప విషయాలలో కూడా తీవ్రంగా ఉద్రేకం కలిగే సమయం. వారం రెండవ భాగంలో స్నేహితులు విరుద్ధంగా ప్రవర్తిస్తారు. మీరు ఆరంభించిన పనులు మరొక విధంగా పూర్తి అవుతవి. ధనాదాయం పెరుగుతుంది. దూర ప్రయాణాలు చేస్తారు. 24, 25 తేదీలలో శుభకార్యాలు, గౌరవ ప్రాప్తి.

* * *

## మీనం:

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

మీ మాటకు పోటీ కనుపిస్తుంది. లెక్క చూడకుండా ఖర్చు చేయవలసి రావచ్చు ప్రయాణం చేస్తారు. పైకి ఎంత మంచినా కనుపించినా, ఒక రిద్దరు బంధువులు మిమ్ములను నిరుత్సాహ పరుస్తారు. మీ క్రిందివారివల్ల పొరపాట్లు జరుగకుండా చూచుకొనటం అవసరం ఉద్యోగ రీత్యా కార్యభారము, మానసిక ఆందోళన పెరుగుతవి. క్రొత్తవారితోచేరి ఏ వ్యాపార విషయాలు సాగించ తగిన సమయంకాదు. అనుకొన్న శుభ కార్యాలు శ్రమపడి చేయ గలుగుతారు. సాహసంతో చేయతగిన చట్టా వ్యాపారంవంటి పనులలో దిగవద్దు. ధన సహాయం చేస్తామన్నవారు తప్పుకొంటారు. 23, 24 తేదీలలో కష్టవార్తలు, ఫలితంలేని శ్రమ. ★



# తెర మీద
# తెర వెనుక

పీ రా జీ



రెండు కళ్ళు నాలుగు వున్నాయి
విశ్వాసపాత్రమైన యీ శునకాలు!



### జై పాతాళభైరవి!

‘షేక్స్పియర్’ నాటకాలాడటం తెలుసు .. మంచినీళ్ళ ప్రాయంగా వచ్చును కూడా నట!

‘షైలాక్’ గా ప్రశంసలందుకున్న శ్రీ ఎస్వీ రంగారావుకు తెనుగు ప్రతిభను దిశలలో చాటాలనుంది.

“విదేశాలకి వెళితే మనం ఉన్నాం, అని మాతృభూమి పేరు నిలబెట్టాలి ... అలా మన ప్రతిభను నాటక, నటనా, శక్తులను చూపాలి” అంటా డాయన. ‘అంఫట్’ నిజంగా నేపాళ మంత్రమేనా? పాతాళభైరవిలో క్రూరంగా రంగారావు.

# "కొత్త రచయితలూ కావాలి కొత్త దృక్పథమూ కావాలి" రంగారావు.

ఇప్పుడు తమిళంలో గొప్పగా బోలెడు సినిమాల్లో నటిస్తున్న తెలుగు ఎస్. వీ. రంగారావు తెనుగులో బ్రహ్మాండమైన నటుడు. తెనుగు తెర కొక ప్రత్యేకమైన ప్రతిపత్తి ఇచ్చిన నటులలో శ్రీ ఎస్వీ రంగారావు పేరు కొందరు మొదట చేరుస్తే, చాలామంది అభ్యంతరం చెప్పరుకాని, అసలు మానేస్తేమాత్రం అందరూ తిడతారు. తెనుగు తెర తారలలో శ్రీ రంగారావును వదిలేయడం పాతాళభైరవి నాటినుంచీ కూడా తప్పుగానే భావించారు ప్రేక్షకులు.

శ్రీ ఎస్. వి. రంగారావు నేపాళ మాంత్రికుడిగా 'ఢంఫట్' మంటూ జనం గుండెలు దోచుకున్న నటుడు. అటు తర్వాతనుంచీ అతనికి లభ్యమైన పాత్ర లన్నింటికీ ఒక ప్రత్యేకతను, పాత్ర చిత్రణలో ఒక ఒరవడిని పెట్టుకుంటూ రావడం, అతని పెట్టుబడి అయితే దానికి ప్రేక్షకుల ఇచ్చినది ఆదరాభిమానాల లాభం!

కళను ఇలా వ్యాపార దృష్టిలో చూసినా గొప్ప క్రెడిట్ రంగారావుది.



కారక్టర్ ఏక్టర్ రంగారావు
తెర వెనుక రెండు పోజులలో

## నేపాళ మాంత్రికుడూ హరిశ్చంద్రుడూ

'ప్రవరాఖ్యుడు' వేషం కట్టాడు పాత రోజుల్లో. ఆ సినిమా నేను చూడలేదు. ప్రేక్షకులలో చాలా మంది అప్పుడు కూడా చాలామంది చూడమన్నారుట!

ఇవాళ ఇది ఒక కవితా గాథ అని సినిమా అభిమానులు—రంగారావుగారి 'ఫాన్స్' భావిస్తారు.

"అబ్సర్డ్! రంగారావ్ బొమ్మ పేల్యారా?" అన్నాడు మాయాబజార్ సినిమా రాక పూర్వమే, బంగరుపాప రోజుల్లోనే ఒక మిత్రుడు.

కాని, అది సక్సస్ అయితే తెనుగుతెర దరిమి లాప తమిళ తెర రెండూ కూడా ఒక కారక్టర్ ఏక్టర్ని ఒక ఉత్తమ కళాకారుణ్ణి పొందలేక పోయిన దౌర్భాగ్యస్థితిలో ఉండేవి!

తొమ్మిదీ ఇంటూ పదిహేను అడుగుల పెద్ద తెరమీద చూస్తేనే అంత పొడుగూ, ఇంత విగ్రహం అగుపించే నటుడుకాదు ఎస్వీ. సామాన్య ప్రమాణంలో —కూడా నిండైన భారీ విగ్రహం, నడకలోనూ మాటలోనూ, తీవి, హుందా (హుక్కా పీల్చే అలవాటు సైతం వుంది) అగుపిస్తాయి!



'సహేతుకమైన విమర్శ చాలా గొప్పది'

# తెరమీద తెరవెనుక

## మాయలమరాఠీ? నేడు మంచి వాడు మంచినటుడు

పెద్ద పులుల్లాంటి నాలుగు కుక్కలను పెంచుతున్నాడాయన. అందులో ఒకదానిపేరు 'సీజర్'—

చెయ్యెత్తు మనిషి, గంభీరమైన విగ్రహం, తీక్షణమైన డేగ చూపు, దార్ఢ్యమైన నడక, ప్రక్క పెద్ద పెద్ద ముళ్ళేలా, తోకలూకల ఆల్సేషియన్ కుక్కలు ఇంటిముందు ఆవరణలో వస్తూవుంటే సాధారణంగా, ఎక్కువ మంది తమిళ ప్రేక్షకులు గేటు దగ్గర గూర్ఖాలతో "మేం రంగారావుగారిని చూస్తా"మని ఘర్షణ పడుతూంటారు. అయితే శ్రీ రంగారావు మాయల మరాఠీ, ఒక కొత్త పంథా తెర కెక్కించిన బాలనాగమ్మ నటుడూ—నిజంగా 'మాయల మరాఠీ' కాదు. మంచి నటుడు.

తాను చూస్తే మాత్రం గూర్ఖాలను అదిలించ టివ్వక, కుక్కలను నిలదియ్యనివ్వక, అభిమానులను పలకరించి, కుశల ప్రశ్నలువేసి పంపేస్తూంటాడు.

తెనుగువాళ్ళు గర్వంగా అనుకునే యస్వీ—తమిళులకు అత్యంత ప్రేమపాత్రు డయ్యాడు.

నెప్పుడూ నా పద్ధతిలో వారు—అంటే ఉభయ తారకమైన పంథాలో వస్తే కాదననేలేను" అన్నారు కీచకుడిగా మరోసారి తెనుగు తెరను వెలిగించనున్న శ్రీ రంగారావు.

"కీచకుడి వేషంలో ఒక ప్రత్యేకత వేదేనా ప్రవేశ పెడతారా?"

"నిజంగా నాకు పాత్రను పూర్తిగా సృష్టిచేసి, దానికి, నాకూ కూడా ఒక చిరస్మరణీయతను ఇవ్వాలని ఉంటుంది—అలాంటి ప్రయత్నం బాల నాగమ్మలో, మాయల మరాఠీగా చూపించాను. కీచకుడి వేషమే వేరు. ఆ పాత్రలో వైవిధ్యమూ ఉన్నది. రసికతా వున్నది" అన్నాడాయన.

**శ్రీ ఎస్వీని మనం ఘటోత్కచుడుగా మరిచిపోలేము. పురాణ పురుషులైన రాముడు క్రిష్ణుడూ వేషాలు వేరు, ఇతి హాసికపు వేషాలైన ఘటోత్కచుడు, హిరణ్యకసిపుడూ వేరు. మాయబజారు సినీ**

**తపస్సును నటకృష్ణను ధారపోసే నటుడు మీాకు అభిమాన కళాకారుడవుతాడు. శ్రీ రంగారావు అలా మీాగుండెలను కదిలించుతూ ఒక సినిమానుంచి మరోసినిమాకి గొప్ప నటుడై పెరిగిపోయాడు.**

అతని దొక ఫక్కీ. అదోమాదిరి. దాని కొక ప్రత్యేత వుంది. ఆ పాత్ర పోషణ ఒక పాఠ్య గ్రంథంగా ఉండాలి.

పాతాళ భైరవిలో అసలు ఆకర్షణ "అం ఫట్!"

నేపాళ మాంత్రికుడు "హాలంగితం శాయక శృంగార సేయవే బుల్ బుల్" అంటాడు (థాంక్స్ టు ది రైటర్!) నిజంగా కథ మరోలాగ ఉండక పోతే, ఆ బుల్ బుల్ శృంగారం చేసునేమో!

అదీ రంగారావు రసికతను రాక్షస పాత్రలతో పోషించే తీరు!

శ్రీ ఎస్. వి. కి నాటకాల అనుభవం వుంది! తన శక్తి తా నెరిగిన నటుడు!

అధ్యయనం ఉన్నది. సంభాషణ చెప్పడంలో ఒక కొత్తదనం ఒక విరుపు, వడి, సాధించిన ఘనత, ఈ తరం నటులందరిలోను ఆయన ఒక్కడికే వెళ్ళింది.

పౌరాణికంగా ఒక రకంగా, సాంఘికంగా ఇంకో రకంగా డైలాగును చెబుతూ, ఆ రంగారావు వేరు ఈ ఎస్ వి వేరు అనిపించే ఈ ఎస్. వి. రంగారావు నిజ జీవితంలో పట్టుదల, ఆశయం గల వ్యక్తి!

## కథకుడు: చిత్రకారుడు

కథలు రాయడం అంటే చాలా ఇష్టం...... చేటంత ఇష్టం! అంటాడాయన. చిన్ననాటినుంచి కాలేజీలో అన్ని రకాల హాబీలుగల ఉషారైన వ్యక్తి శ్రీ రంగారావు.

"కథలు రాస్తాడు. చిత్రాలు గీస్తాడు—కాబానా లాడటం, తుపాకీతో పేల్చడం—వాదన యుగ్ర ట వస్తే "సై సై" మంటూ వాగ్యుద్ధం చేయడం ఇవన్నీ అభ్యాసాలైన కూసు విద్యలే!"

పురాణ పాత్ర అయితే దాని "ఎనాలిసిస్ చాలా జాగర్తగా చేస్తా" నంటా డాయన.

శ్రీ రంగారావు పాత్రలో లీనమై నటించాలని భావించే నటుడే.

"పూర్తిగా పాత్రలో లీనమై పోవటం అప్పుడప్పుడు సెట్‌మీద నెర్వస్ బ్రేక్‌డౌన్ రావడం కూడా కద్దు"

శ్రీ ఎస్. వి. రంగారావు సినిమాలన్నీ మణి పూసలు. అందులో ప్రేక్షకులను



హరిశ్చంద్రుడుగా రంగారావు.

తెనుగు నిర్మాతలు కొందరు శీతకన్ను వేసినా, అతని యశస్సు మాత్రం జంట పూలు పూస్తూనే వుంది!

## ప్రతిభ వాడుకోడం

తెనుగు సినిమాలవాళ్ళకి ప్రతిభను సరియైన పద్ధతిలో అంతగా వాడుకోటం తెలీదనే అభిప్రాయం ఉన్నది శ్రీ రంగారావుకి. తెనుగు సినీమాలు బాగుపడటం గురించి, ప్రస్తుతం వాటి నైతిక కళాత్మక స్థాయి అంతగ బాగులేదనే ఉద్దేశంతో నేను ఆయనతో మాట్లాడాను.

"తెనుగు సినిమాయేకాదు. ఏ సినిమాయైన కేవలం వ్యాపారంగా ఉంటున్నంత కాలం అది బాగుపడదు."

ప్రస్తుతం అనే కానేక రకాల పాత్రలను, ప్రజాహితంగా నటిస్తున్న తమిళ నటుడు శ్రీ ఎస్వీని "తెలుగు సినిమాలలో ఈమధ్య అరుదుగా వస్తున్నారు. తమిళ సినిమాలు "ప్రిఫర్" చేస్తున్నారా?" అన్నాను.

"లేదు......లేదు నాకు అటువంటి తేడాలు లేవు. తమిళ నిర్మాతలు వారి అభిమానమూ, ప్రేక్షకుల మన్ననా నన్ను ముగ్ధుడను చేస్తున్నాయి. నేను తెనుగులో నటిస్తాను—నిర్మాతల

**మాలో ఘటోత్కచుడు ఒక ఆదర్శ పురుషునిగా ఒక ధర్మానికి ఒక నీతికి కట్టుబాటు చేసేవానిగా అగుపిస్తాడు.**

"ధుష్ట చతుష్టయ హ హ్హాహ్హా' అని ఘటోత్కచుడు కసిగా నవ్వినది ఒక నాయకుడు నవ్విన నవ్వుగాని, రాక్షసుడు గాదు. అదో ప్రత్యేకత. రంగారావు పాత్ర పోషణలో ఒక ఉదాత్తత తీసుక రాగల ధైర్యశాలి.

హిరణ్యకశిపుడుగా చెంచులక్ష్మిలో అగుపించిన ఎస్వీని, నమ్మిన బంటులో తెనుగు రైతుగా వ్యక్తిత్వమున్న పేదవానిగా అగుపించిన రంగారావుని, జ్ఞాపకం తెచ్చుకుంటే, శ్రీ రంగారావు నటనా శక్తి, ప్రతిభ, తారాపథంలో ఏ మండలంలో ఉంటాయో సులువుగా వూహించుకోవచ్చును.

"ఆటమ్మా పాటమ్మా
తోలూ బొమ్మ లాటమ్మా"— బంగారపాప.

**సినీమాకూడా అంతేగాని ఆబొమ్మ కదలిక, మీా గుండెలను జివ్వుమని పిస్తోంది. దానికి తన కళా**

**మెస్మరైజ చేసిన మాయ బజారులున్నాయి. చకితులను చేసిన** బాలనాగమ్మ లున్నాయి. ముగ్ధులను చేసిన బంగారు పాపలు, మెప్పించిన నమ్మినబంటూ ఉన్నాయి.

అదో ప్రత్యేకత
దాన్నే "కారక్టర్ ఏక్షన్" అంటాం.

**శ్రీ రంగారావు నిస్సందేహంగా సినీమా రంగాన ఒక కొత్తబాణి తెచ్చిన నటుడు!**

**(మిగతా పైవారం)**

# మీ రాజకీయ పరిజ్ఞానం ఎంత?

1) మంత్రులు, గవర్నర్‌లు మొదలయిన వారి ప్రధాన కర్తవ్యం :
   - అ) ఉపన్యాసాలు ఇవ్వటం, ఆవిష్కరణలు చెయ్యటం.
   - ఆ) పరిపాలన సరిగ్గా కొనసాగించటం.

2) ప్రతిపక్షం పార్టీలవారు ముఖ్యంగా చెయ్యవలసిన పని :
   - అ) సృజనాత్మకమయిన విమర్శలు చెయ్యటం.
   - ఆ) ఒకరితో ఒకరు పోట్లాడుకుని మరికొన్ని ప్రతిపక్షం పార్టీలు సృజించటం.

3) 'విమానం గొడుగు', 'ఆకాశంలో విన్యాసాలు' :
   - అ) ఇంచుమించు ఒకటే.
   - ఆ) పూర్తిగా వేరు.

4) దేశంకోసం త్యాగం అంటే :
   - అ) ప్రజలుమాత్రం చెయ్యవలసినది.
   - ఆ) రాజకీయ నాయకులతోబాటు అందరూ చెయ్యవలసినది.

5) లక్షాధికారులూ, (కోటీశ్వరులూ), వ్యాపారం చేసుకునేవారు సయితం సోషలిస్టులు :
   - అ) అవును.
   - ఆ) కాదు.

6) వార్తాపత్రికలలో ప్రచురించవలసినవి :
   - అ) కొందరు ప్రముఖుల నీతిబోధలు.
   - ఆ) ఇతర వార్తావిశేషాలు.

7) పార్టీకోసం అని మంత్రిగారు ఇప్పిస్తే విరాళం, మరి దేనికయినా ప్రభుత్వోద్యోగి పుచ్చుకుంటే లంచం అవుతుంది అంటారు కొందరు. ఇది :
   - అ) నిజము.
   - ఆ) అబద్ధము.

8) పరిపాలనలో :
   - అ) అన్నిటికీ బాధ్యత రాజకీయ నాయకులదే.
   - ఆ) మంచిపనుల బాధ్యత మాత్రం నాయకులదీ, చెడుపనుల బాధ్యత క్రిందివారిదీ.

9) మీరు 'డాక్టర్' అవాలంటే :
   - అ) డిగ్రీలు పుచ్చుకోవాలి.
   - ఆ) రాష్ట్రపతి కావాలి.

10) ఎయిర్ కండిషన్డ్ గదులలో మాత్రమే కూర్చుని, దిగుమతి అయిన కార్లలోమాత్రమే ప్రయాణంచేస్తూ ఉన్నప్పటికీ పార్టీసమావేశాలలో ఖద్దరు టోపీధరించి నేలమీద దిండ్లకి ఆనుకుంటే గాంధీతత్వం అవలంబించినట్లే :
   - అ) అవును.
   - ఆ) కాదు.

[జవాబులు 96 వ పేజీలో]



అందరూ మెచ్చిన తార
జనం యిష్టపడు తార
లీడింగ్ స్టారై వెలిగెను చాల!

అందుకే అంజలీదేవి
మూడు భాషలందు
ముచ్చటగా ముమ్మారు మేటి నటి
పైపెచ్చు నిర్మాత కూడా!

(తెరమీద—తెరవెనుక 9—8—63)

మంచి పాత్రలు చెడ్డపాత్రలూ మంచిగా నటించిన అంజలీదేవి ఇప్పుడు సొంత చిత్రంలో నటిస్తున్నది.

— క్రిటిక్

# కథ కాని కథలు

## అలుక పాన్పు

ఈ మధ్య మా రావు గాడికి వివాహం అయింది. మా వాడికి 'అలుక పాన్పు' వేశారు. అప్పుడు మా వాడికి ఏమి కావాలో కోరుకో మన్నారు వాడి మావయ్యగారు. [అప్పుడు అల్లుడు ఏమి కోరుకుంటాడో అని మావయ్యగారికి దిగులే అనుకోండి.] కాని అప్పటికి మా వాడు సిగరెట్టు కాల్చి రెండు గంటలైంది.

అందుచేత మొహం దిగాలేసి కూర్చొన్నాడు. మా రావుగాడు ఏమి కోరుకుంటాడో అని అక్కడ వున్నవారందరూ శ్రద్ధగా చూస్తున్నారు. కాని మావాడు ఒక 'సిగరెట్టు' అని కేక వేశాడు. ఇక చూడండి అక్కడవున్న వాళ్ళందరూ విరగబడి నవ్వారు.

కోలా (కాకినాడ)

* * *

## గజ దొంగ!

ఆ రోజు శనివారం ఆ రోజు మధ్యాహ్నం వరకూ గల పనులను ముగించుకొని మా ఊరినుండివచ్చిన కొందరుమిత్రులకు "జూ" చూపించుదామని తీసికొని వెళ్లాను. అక్కడ శ్రీకాకుళం జిల్లానుండి వచ్చిన ఒక సాహుకారుతో పరిచయం ఏర్పడినది అతను స్వంత ఊరు విడచి కలకత్తాలాంటిమహానగరం రావడం అదే ప్రథమం.

మేమంతా కలసి 'జూ' అంతా తిరిగి ఒక ఏనుగ దగ్గరకు వచ్చాము. అక్కడ ఆ ఏనుగు కొంతమంది జనాన్ని ఎక్కించుకొని అలా కొంతదూరం త్రిప్పుకొని వస్తున్నది. త్రోవలో గుంపులుగా కూడిన జనం రకరకాలైన వస్తువులను ఏనుగకు అందిస్తున్నారు. ఆ ఏనుగ పళ్లూ, ఫలములు అయితే తనే భక్షించి, డబ్బులు మొదలయినవి తొండంతో ఎత్తి మావటివానికి అందిస్తున్నది. ఈ వింత చూసి సాహుకారుగారు కూడా ఒక రెండు నయాపైసల బిళ్ళ ఏనుగకు అందించవలెననే కోరికతో బరువైన తన పర్సుని బయటకు తీసి రెండు నయాపైసల బిళ్ళను తీస్తుండగా, ఏనుగ అమాంతంగా ఆ పర్సు మొత్తాన్ని అందుకొని మావటివానికి అందించింది. అది చూచి సాహుకారుగారు 'అయ్యో నా పర్సు...నా పర్సు!' అని గుండె లదిరేటట్లు అఱుపులు, కేకలు పెట్టాడు. పాపం మావటి వాడు వెంటనే ఆ పర్సుని తిరిగి ఆయనకి ఇచ్చివేశాడు.

సాహుకారుగారు వెంటనే అనుమానంతో కంగారుగా డబ్బా దస్కం లెక్క పెట్టుకోవడం మొదలుపెట్టాడు. ఆ వింత అంతా చూసి మాతోసహా అక్కడ వున్న జనానికి నవ్వు ఆగింది కాదు. దానికి తోడు "ఈ సారి అయినా పర్సు జాగ్రత్తగా చూచుకోండి. లేకపోతే ఈసారి పిక్ పాకెట్ అయిపోగలదు" అని బెంగాలీలో అన్న పెద్దమనిషి మాటలు తోడైనవి.

మూర్తి జి. (కలకత్తా)

* * *

## కాఫీ కాదు

మా క్లాసులో జ్యోతి అనే అమ్మాయి ఉండేది. ఆ అమ్మాయికి ఇంటివద్ద పని ఎక్కువగా ఉండి క్లాసుకు ఆలస్యంగా వచ్చేది. అందుకని ఆ అమ్మాయి ఎప్పుడేది వ్రాయవలసి వస్తే, ప్రక్కనున్న అమ్మాయి దగ్గర చూసి వ్రాసేది. ఒకరోజున హిందీ మాస్టారి క్లాసులో ఆయన చెప్పింది ప్రక్కనున్న అమ్మాయి దగ్గర చూసి వ్రాసేస్తోంది అది మాస్టారు చూసి "జ్యోతీ! కాపీ చేస్తున్నావా!" అని అడిగారు. దానికా అమ్మాయి పరధ్యానంగా "లేదండీ! వ్రాసుకుంటున్నాను" అంది. క్లాసంతా గొల్లుమంది. ఆశ్చర్యం నుంచి కోలుకుంటున్న మాస్టారు, అప్పుడే తలెత్తిన ఆ అమ్మాయి కూడా సంగతి తెలుసుకొని మాతో నవ్వు ప్రారంభించారు.

కుమారి పల్లా వరలక్ష్మి (జగ్గంపేట) ★






## జరిగిన కథ

పద్మావతి తల్లి జయమ్మ అనుమతితో వాల్తేరు పోయి ఎమ్మేకి అప్లికేషన్ పెట్టి గుంటూరు వస్తూ బెజవాడలో భాస్కరం—నేస్తం పద్మావతి తన నేస్తం సురేఖను భాస్కరానికి పరిచయించేస్తుంది. భాస్కరం పిన్ని జానకమ్మగారు కూతురు వసంత పెళ్ళిచేద్దామనీ, తర్వాత భాస్కరం పెళ్ళి చేద్దామని, ప్రయత్నాలు చేస్తోంది. సురేఖవాళ్ళ దొడ్డమ్మగారిదీ బెజవాడే చదువు వంక మీద భాస్కరం పెళ్ళికి విముఖత చూపుతూంటాడు. కానిజానకమ్మగారి ముచ్చటవేరు ఆమెకు అధికారం, ప్రేమా - రెండూ ఎక్కువ ధనమ్మ రాఘవేంద్రరావులు వసంతను ముకుందరావుకు చేసుకోడానికి చూశారు. భాస్కరం విముఖతను పసిగట్టిన వసంత భాస్కరాన్ని నిలదీస్తుంది. జానికమ్మగారి బలవంతాన పెళ్ళిచూపులకని వెళ్ళి అక్కడ సురేఖను చూసి హతాశుడైపోయాడు. ధనమ్మ భాస్కరాన్ని సురేఖను చేసుకోవాలని తీర్మానించుకుంటుంది. జానకమ్మగారు భాస్కరం వివాహతపు ఆరాలాతియ్యా జూస్తుంది ధనమ్మ పంతం పెరుగుతుంది. జయమ్మ, పద్మావతి గురించీ, వాల్తేరు చదువు గురించీ ఆందోళనగా గతంతల పోస్తూంటుంది. పద్మావతీ సురేఖా వాల్తేరు వస్తారు మూర్తి భాస్కరం నేస్తం. ఇద్దరూ బీచ్‌లో పద్మావతి గురించి ప్రస్తావించుకుంటారు. భాస్కరం సురేఖకు చెప్పి బెజవాడ వెళ్తాడు. సురేఖపద్మావతి కలిసి సినిమాకు వెళ్తారు

## 26

సినిమాలో వెనకవేపు విద్యార్థుల సజ్జు ఒకటి చేరింది. వాళ్ళు తమకు తెలిసిన "హిస్టరీ, జాగ్రఫీ, సినిమాటోగ్రఫీ సినీతారల బయోగ్రఫీ" వరకూ గల శాస్త్రాలన్నీ తెగ మాట్లాడేస్తున్నారు. ముఖ్యంగా సురేఖ వచ్చిందో నలుగురికీ "కీ" యిచ్చి వదిలేసి నట్లు 'వాగు'తారు—"నువ్వు హాలీవుడ్ స్టార్ వోయ్" అంటుందందుకనే పద్మావతి సాధారణంగా "బ్యూటీ" అని సురేఖకి మరో పేరు.

హాలులో ఎక్కువ భాగం పెద్ద చదువులకని "దూరాభారం" వచ్చిన విద్యార్థులే. "తప్పించుకు తల దూర్చుకుందికి సినిమా లొక్కటే చోటు" అన్నది పద్మావతి ఎవర్నీ గమనించకుండా

సురేఖ నవ్వింది. "తప్పించుకోకూడదే భామామణీ! ఎదురీదాలి" అన్నది.

"అసలు నీళ్ళల్లో ఉంటేకదా? ఒడ్డునపారేస్తే?" అన్నది పద్మావతి.

అసలు కథ తెరమీద ప్రారంభమైంది. ఆవేళ కప్పుడే పద్మావతి వెనక్కి స్మృతి పథంలోకి కరిగిపోయింది.

నిజంగా భాస్కరం తనను మనసారా ప్రేమించడం లేదా? కేవలం ఒక తాత్కాలికమైన భ్రాంతియేనా? "తనెంత మంచివాడు. అతని ఉత్తరాల్లో అక్షరాల్లో ప్రాణాలతో లేచివచ్చే ప్రేమానురాగాలన్నీ పొల్లు మాటలా?" "కాదు కాదు" అనుకుంది.

"ప్రేమకోసం మనుషులు చేసే త్యాగాలు వాళ్ళను దేవతలను చేస్తాయి పద్మా!" అన్న భాస్కరం—హోదా కోసరం.......తనను........ తనను "యింపాజిబిల్" అనుకుంది.

......ఒకసారి—

"ఏమండీ! మా అమ్మ ఒక్కర్తే నాకు దిక్కు. తను మీకు పెద్ద కట్నాలు అవీ ఇచ్చుకోలేదు" అన్నది తను.

అంటే "నీ కంటే ఎక్కువ కట్నం నేనేం కోరగల్ను. చెప్పు—" అన్నాడు తను తన తల నిమిరి! "నువ్వు నా ప్రపంచానివి" అంటాడు అక్కున అదుముకుని

"మీ పిన్నిగారు ఒప్పుకుంటారా? అమ్మకి ఎందుకనో భయం—ఎవ్వర్నీ నమ్మవద్దంటుంది" అడుగుతుంది పద్మావతి దూరంగా జరిగి.

"మా పిన్ని చాలా మంచిది. మీ అమ్మగారికి నన్ను తెలియదు—లేపోతే ఇలా అనరు" అనే వాడు భాస్కరం, ఆమె పొదాల వ్రేళ్ళు లెక్కిస్తూ.

"నేను, నాకు మా అమ్మా, తప్ప మరెవ్వరూ లేరు నాకు ఈ ప్రపంచంలో......." అంటే, ఆమె చెయ్యి తను గుండెల కదుముకుని, "నేనున్నాను..... నువ్వు నన్ను ఎరుసు చేస్తున్నావు" అని ఎంతగా గానో నొచ్చుకునేవాడు భాస్కరం—

"నిన్ను చూడకుండా బ్రతకలేను పద్మా...... నువ్వు వాల్తేరు రావాలి......నిన్ను చూస్తేనే చాలు. ఏదో చల్లని భావన మలయ మారుతం వీచినట్లుంటుంది. నీతో మాటాడితేనే చాలు—మానసుకుల్లాసంగా ఉన్నట్లు ఉంటుంది—నీతో గడిచిన క్షణాలు ఈ జీవితం మీద విపరీతమైన మమకారానికి పునాదులు పద్మా! . ." అంటాడు భాస్కరం.

"నేను కవినికాదు. అంచేత ఇవన్నీ సత్యాలూ" అనీ, "కావాలంటే నీ ముక్కు మీద ఒట్టు" అనీ అనడమూ అతనికి అలవాటు.

పద్మావతికి భాస్కరం మీద పూర్తి భరోసా ఉన్నది. అందుకే అంత సాహసంగా వాల్తేరు వచ్చింది.

ఏ పని చేస్తున్నా, భాస్కరం మాటలే. ఉదయమే లేచి బడలికగా ఒళ్ళు విరుచుకుంటూ, భాస్కరాన్ని తల్చుకుంటే—మనసుకు ఆహ్లాదంగా ఉండేది. పొద్దున్నే పెరట్లో గులాబీ పువ్వు వికసించి పలకరిస్తే "ఆయన చూస్తే చాలు...... ఇది కోసి నా తలలో ముడుస్తారు" అనిపించేది

పువ్వును కోసి, రహస్యంగా భాస్కరాన్ని తల్చుకుని ముద్దెట్టుకుని తలలో ముడుచుకుంటే అదో ఘన కార్యం చేసినట్లుండేది.

"పద్మా! నీ కోసరం నేను ఈమధ్య చాలా జాగర్తగా ఆరోగ్యం కాపాడుకుంటున్నాను. లావెక్కడం మానేశా ......... లేపోతే నీ ప్రక్కన నడుస్తూ వుంటే నలుగురూ, "ఎవడ్రా ఈ ముష్కరుడూ పువ్వులాంటి ఆ చిన్నదాని ప్రక్కనా. అనుకోరూ" అని రాసే వాడు భాస్కరం.

"ఇవాళ పిన్ని నన్ను ఆలస్యంగా భోజనానికి వచ్చేవని కోప్పడింది తెలుసా? కాని, నా పద్మావతి కోసరం పిన్నిచేత దెబ్బలేం కర్మ ఏమేనా తింటాను" అని రాసేవాడు భాస్కరం గుంటూరు తన కోసరం వచ్చి, తిరిగి బెజవాడకు వెళ్ళి,

"నువ్వు వాల్తేరు రా పద్మా! ఇక్కడ సముద్రం ఎలాంటిదో తెలుసా? నువ్వు నడుస్తూవుంటే నీ చీరె కుచ్చెళ్ళల్లోని చురుకుదనానికి, దాని కెరటాలు పోటీలు పడతాయ్.. ....దూరంగా, స్నిగ్ధంగా, నీలంగా, లోతుగా, నీ చిలిపి మాటల వెనుక దాగిన

విండైన ప్రేమలాగ అగుపిస్తుంది సముద్రం—నేను నీ కోసం ఈ సముద్రాన్ని ఇక్కడ ఓ ఏకాంత ప్రదేశాన్ని దాచి, నిత్యమూ వెయ్యి కళ్ళలో పూజిస్తున్నాను ఆ రెంటినీ నీ పాదాలముందు పారేసి, వాటితో నువ్వాడుకుంటూ వుంటే. దొంగతనంగా నీ సౌందర్యాన్ని నే దోచుకుంటాను— నీ కనుల వంగింతాన్ని త్రాగుతాను......."

భాస్కరం గురించి ఆలోచించని క్షణంలేదు పద్మావతి. "తను వాల్తేరు రాగానే అమ్మకి చూపిస్తాను. అమ్మకి నచ్చుతాడు—యిక హాయిగా తాను నిబ్బరంగా...... ...." అని రక రకకాలుగా అనుకున్నది; పద్మావతి. కాని, భాస్కరం రానేలేద తన ఇంటికి.

'ఔను నాదే తప్పు సాంప్రదాయాలు ఎంచి ప్రేమించాలిగాని, నా కన్నా మంచి కుటుంబంలో వున్న వారిని ప్రేమించడమేమిటి?" అనుకుంది.

"ఇంతకీ తనకేం తక్కువ—ఏది తక్కువ....?"

గభిక్కున లైట్లు వెలిగినట్లనిపించింది. "అరె! అప్పుడే అయిపోయిందా?" అన్నది పద్మావతి ఉలిక్కి పడ్డట్లు.

"బాగుందే తల్లీ? ప్రశ్న ... ఇది ఇంటర్ వెల్... . .ఇంకా కథలో విలన్ హీరోయిన్‌ని కిడ్నాప్ చేయందే" నన్నది నవ్వుతూ సురేఖ.

"పోదా మేమిటి?" అన్నది కణతలు నొక్కుకుని పద్మావతి.

"నువ్వు నీనుంచి పారిపోవాలనుకుంటున్నావ్ పద్మా ........ సినిమాలోనించి కాదు .....అంచాత ఇక్కడే ఉండు—భాస్కరంగారు ప్రేమా కాస్సేపూ దూరంగా ఉండనీ—క్లాసూ పాఠాలు జ్ఞాపకం తెచ్చుకో. ....అదుగో అటు చూడు—నీ కోసరం ఎంతమంది మన ఫ్రెండ్సు హడావుడిగా మరోసారి అవతలి కెళ్ళి, అద్దం ఉన్న దగ్గరికల్లా వెళ్ళి తలలు దువ్వుకుంటున్నారో...... ..వాళ్ళని డిసెప్పాయింట్ చెయ్యకు ........" అన్నది.

సురేఖ మాత్రం నిర్విచారంగా వుంది గనుకనా? అయినా, నవ్వుతూ సర్దాగా ఉండటం అలవాటు ఆ అమ్మాయికి.

సురేఖ "తిరిగి ఇంటికి వెళ్ళి తీరుతానూ అమ్మ ఒక్కర్తే ఉంటుంది" అన్న పద్మావతిని బలవంతం చేయలేకపోయింది, బస్సెక్కించి తాను రిక్షా ఎక్కి పోయింది.

"ఈ భాస్కరంగారు చాలా దగాకోరు. పద్మావతికి చాలా ప్రేమ లేఖలు రాసి ఉంటాడు....." అనుకుంది త్రోవలో

"పద్మావతి భాస్కరాన్ని ప్రేమించింది. ఇది నిస్సందేహం" అనుకుంది ఎట్టకేలకు తాను ఒక నిర్ణయానికి వచ్చినట్లు . కాని భాస్కరం?. ..

* * *

జయమ్మ కూతురి కోసరం కాచుకుని కూచున్నది

"ఏమే అమ్మాయీ! మీ స్నేహితురాలి దగ్గర కన్నావు కదూ . ఇంతసేపు ఉన్నావేం? ప్రతీ బస్సూ చూస్తున్నా ననుకో.... ..." అన్నది అన్నం వడ్డిస్తూ.

"నువ్వు పడుకో అమ్మా! నే తింటానుగాని...." అన్నది పద్మావతి. "సురేఖ సినిమాకు లాక్కుపోయింది ..." అని చెప్పింది, పీట తెచ్చి వేసుకుంటూ.

"నేను నువ్వు పుస్తక మేదో తెరిచి ఉంచావు












# ప్రేమకు పగ్గాలు

కదా అని....వచ్చి చదవాలేమోనని, పెద్ద లాంతరులో చమురు పోసి ఉంచాను......వెలిగించనా?" అన్నది జయమ్మగారు.

"వద్దమ్మా! నీకు మరీ ఈమధ్య నా చాకిరీ ఎక్కువైంది" పద్మావతి నొచ్చుకుంది.

"బాగుందే అమ్మాయ్! ఎవరికోసరం చేస్తాము... చదువుకోసం దూరాభారం వచ్చావా లేదా?" అన్నదామె.

"పైగా మగ దిక్కులేని సంసారమాయె" నన్నది.

"చదువు కోసమా ప్రేమ కోసమా?" అన్నారెవరో పద్మావతి గుండెల్లో.........ఆ మాటలు గొంతులో పడి పొలక మారింది.

"అబ్బ! నిన్నెవ్వరు తల్చుకున్నారే? తల్లీ....." అన్నది జయమ్మగారు గాభరాగా వచ్చి.

పద్మావతి "ఆయనగారే అయ్యుంటారు...... చెప్పకుండా వెళ్ళి పెళ్ళి స్థిరపరుచుకుందామని వెళ్ళిపోయారుగా" ననుకుంది......పైకేమీ అనలేదు.

భోజనంచేసి నాలుగూ ఎత్తిపెట్టి తల్లి మంచం ధగ్గర కూచుని ఆమె కాళ్ళను ఒత్తుతూ, "అమ్మా!" అన్నది.

"ఏమే బాగా అలసిపోయావు కాబోలు పోయి పండుకో........లేదా చదువుకో.........." అన్నదామె.

"కాదే.........పాపం నీకు కాళ్ళు పడతానూ..."

"ఎక్కడ ఏ దేశాలు తిరిగి వచ్చావు గను కనే నేనూ......." ఆమె నవ్వింది కూతురి విశ్వాసానికి తృప్తిగా.

"నాన్నగారు నిన్ను చేసుకున్నప్పుడు అందరూ ఒప్పుకున్నారే......" పద్మావతి ఏదో అడుగుదామని ఏమో అడిగింది.

"సరిపోయింది.......అదా నీ ప్రశ్న ఇప్పుడు..... పాపిష్టిదాన్ని నేను నూతిలో పడ్డప్పుడు కళ్ళు మూసుకున్నా పోయేది, ఆ మహానుభావుడు — కాని మీ తండ్రి అలాంటివాడు కారే అమ్మాయి.... ఆయన మాటకి కట్టు బడ్డారేగాని—నన్ను కట్టుకుని అయిదారేళ్ళు నలుగురి చేత అనరాని మాటలు తిన్నారు........" జయమ్మగారు కూతురు కుతూహలాన్ని గమనించలేదు. ఆమెకు పాత రోజులు జ్ఞాపకం వచ్చాయి.

వాస్తవానికి సాంబమూర్తి ఆనాడు తనకు మరో సమ్మంధం చూసి, పెళ్ళి చేస్తానన్నాడు. కాని, తను పసిపిల్లలా అతని పాదాలకు పెనువేసుగుంది.

"అమ్మో! నే నెవ్వరి దగ్గర బ్రతకలేను మావయ్యా" అంది.

అందుకనే సాంబమూర్తి ఆమెను ప్రేమించాడు. ఏనాడూ వాత్సల్యం, అనురాగం తప్ప, కాముక ప్రవృత్తితో దరిజేరి ఎరుగడు అదివరకు.

"మీ నాన్నగారు సంఘ సంస్కారి అన్నమాట ఇవాళ కాకపోయినా రేపైనా నిలిచే మాటే" నన్నది జయమ్మగారు.

"ఒక ఆత్మహత్యను ఒక బలవంతపు పెళ్ళిని ఆపారే ఆయన."

అయితే జయమ్మ విశ్వాసం తర్కానికి విలు

**స్తుందా? ఇలాంటిది సంఘ సంస్కరణమే అయితే** ఇక ఇవాళ పద్మావతి సంప్రదాయానికి వంక ఎక్కడ?

అదే ఆలోచించింది పద్మావతి

"ఛీ! మా అమ్మ యింత మంచిది.. ..మా నాన్న గారు యింత త్యాగధనుడు ... మరి యింకా ఏం సంప్రదాయం చూస్తారో ... ఈ మనుషులు .... రాపీ ఆయన్నే అడుగుతాను .." అనుకుంది.

పుస్తకం తెరిచి భాస్కరం మీద కసిగా ఆలోచిస్తూ కలత నిద్దురలో పడిపోయింది.

కలలో సురేఖ వచ్చి భాస్కరాన్ని ఎత్తుకు పోతున్నట్లు అగుపించింది

కెవ్వున కేకవేసి లేచింది. జయమ్మగారు లేచి "అదేమిటే ఝడుసుకున్నావా ?" అని అడిగి — గ్లాసుతో మంచినీళ్లు ఇచ్చి "త్రాగి ప్రక్కకి తిరిగి పడుకో"మంది."

అలాగే చేసింది కాని తలపులు తగ్గందే. "ఔను — రాగానే ఆవేళ యూనివర్సిటీలో ఆయన "సురేఖగారు వచ్చిందా" అన్నారు.... మొన్నటికి మొన్న టెలిఫోన్ దానికే చేసి వెళ్లారు." అని నొచ్చుకుంది పద్మావతి. మొదటిసారిగా సురేఖను ఈర్ష్యగా ఆలోచించుకున్నది పద్మావతి—

మళ్లీ కల ...

మళ్లీ కలత.... మళ్లీ కల ... చివరికీ ఈ పోరాటంలో పద్మావతి ఆంతర్యమే నెగ్గింది .. రెక్కలు గట్టుకుని ఎగురుతూ ఉన్న సురేఖ భాస్కరాన్ని తన ప్రోల పడేసి మేఘాలమీదికి ఎగిరి పోతూన్నట్లు కలవచ్చింది. పద్మావతి లేచి దేవుణ్ణి తల్చుకుంది. నిశ్చింతగా పడుక్కుంది

ఉదయం ఎనిమిదిన్నర గంటల దాకా ఆ పిల్ల నిద్ర లేవక పోవడం జయమ్మగారు ఆశ్చర్యంగా గమనించింది.

## 27

భాస్కరాన్ని చూస్తూనే పిన్ని చాలా సంబర పడ్డది

"నాకు తెల్సు నా భాసడు నా పరువు దక్కిస్తాడు." అన్నది గర్వంగా

సుబ్బారావుగారు "సాయంకాలం నీతో మాట్లాడాలిరా, అబ్బాయ్!" అన్నారు.

వసంత అన్నయ్యను తల ఎత్తి చూడనే లేదు దానికి యెక్కడలేని సిగ్గు ముంచుకు వచ్చింది

సుబ్బారావుగారు భాస్కరంతో ఆ సాయంతరం, పార్కులో కూచుని మాట్లాడారు

"కట్నాలు ఇవ్వనూ, చట్టమూ అనడానికి ఎలా అవుతుందిరా అబ్బాయ్ ? ఇదేమైనా స్థిరాస్తి చరాస్తి మార్పిడి అయితే అంతేననుకోవచ్చును. గాని పిల్లదాని సుఖానికి సంబంధించిన విషయమాయిరి ! . ఆ ధనమ్మ ఈ రాఘవేంద్రానికి కట్నం పుచ్చుకోడమే సమాజంలో ఒక హోదా అని నూరిపోసింది" అన్నారాయన

నిజమే మరి భాస్కరం స్వయంగా ఎరుగును._ "ఎంతోయ్ ! కట్నం" అంటే

"ఏ పది ఎంతలే మాలాంటి బీదవాళ్లకి" అంటారు మిత్రులు— ఘనంగా

వయస్సు పై బడ్డదా ?

ప్రయోజకత్వం కుంటువడ్డదా ?

**కట్నం కామా లేని పిల్ల ఎందుకురా ?....** అంటారు చాలామంది.

"మా ఫ్రెండ్‌కి పదివేలు ఇచ్చారట. వాడికే అంత ఇస్తే ... ఇక అన్నీ ఉన్న నాకో" అంటారు కొందరు యువకులు.

**భాస్కరం యేమీ అనలేక పోయాడు. "సరే నాన్నగారూ! అమ్మ ముచ్చటగూడా అదే కదా ?" అన్నాడు.**

**"మరే.... కాని మీ పిన్ని సంగతి నీకు తెల్సుగా నువ్వు పెళ్లి చేసుకోనంటే అది సహించదురా...."** సుబ్బారావుగారు ప్రాయశ్చిత్తపూర్వకంగా అన్నాడు.

"నేను చేసుకోనూ అనలేదుగా" ముళ్ల మీద కూర్చున్నట్లుంది భాస్కరానికి

'వసంత పెళ్లికి అది ఆయత్త మవ్వాలీ అంటే నువ్వు "వూఁ" అనాలిరా.... వస్నేం చెయ్యమంటావ్ అంతా మీ పిన్ని ఇష్టం' ఆయన వెనక్కు ఆనించిన చేతులు తీసి దులిపేసుకున్నాడు.

"అది సరే నాన్నగారూ ! ఈ సురేఖనే చేసుకోవాలీ అనే ప్రతి బంధకం ఏమిటే మరొకరు కారాదా?"

"ఆ మరొకరు ఎవరూ?" ఆయన కుతూహలం వ్యక్తపరిచాడు.

"అహఁ .....అది కాదు నాన్నగారూ! ..... ఈ ధనమ్మ అనుకున్నదేగాని, ఆ సురేఖ మాత్రం నన్ను ఇష్టపడొద్దూ ......" భాస్కరం తప్పించుకుంటున్నాడు అని ఆయన గ్రహించాడు.

"చదువుకున్న అమ్మాయి గనుక ఎవరినో ఒకర్ని ప్రేమించే ఉంటుందంటావు?. ...అహ . అంతేనా నీ భావన.. . ..చెప్పు చెప్పు.... .నేను నీ ఫ్రెండు ననుకో......ఫర్వాలేదు" సిగ్గు, బిడియమూ పడుతున్న కొడుకుని ఆయన బుజ్జగించారు.

భాస్కరం సురేఖను ఏ మాట మాత్రం ఎలా అనగలడు?—చదువుకున్న అమ్మాయి కదాని ఇవాళ ఆమెను కాదంటే—రేపు పద్మావతి మాత్రం చదువు కున్నది కాదా? పైగా పద్మావతి ఉద్యోగం కూడా చేస్తుందేమో!

"ఒక్క ఏడాది ఆగండి నాన్నగారూ"

"నేను పదేళ్లు ఆగుతానురా అబ్బీ! మీ పిన్ని మాట . .....దానికి నువ్వు ఇంకా ఐదేళ్ళ పసి బాలుడుగా ఉన్నావురా......." ఆయన నిట్టూర్చాడు

ఇద్దరూ ఏ మాటాడాలో తెలియనట్లు గడ్డి పరకలు త్రుంపుతూ వూరుకున్నారు

**"వసంత పెళ్ళి కానివ్వండి నాన్నగారూ!" పిన్నికి** చెబుతాగా" నన్నాడు ఎట్టకేలకు.

ఇద్దరూ లేచారు ... బరువుగా...... "మీ పిన్ని గుండె నీర్సంగా ఉంది కాస్త "పోటు" కూడా ఉన్నది జాగర్త" అన్నాడు సుబ్బారావు గారు.

**వేసు ఏడిస్తే సరి తానే వూరుకుంటుంది.** అనుకున్నాడు భాస్కరం గాని ఎలా "దగా" చెయ్యడం అంత సుళువా?......

జానికమ్మ భాస్కరాన్ని పిలిచి, "నువ్వు ఈ ఏడాది పెళ్ళి వద్దన్నావు సరే పై ఏడాది ఐనా ఈ సురేఖను చేసుకుంటావా ఖచ్చితంగా చెప్పు. ...

కావాలంటే కట్నం యివ్వొద్దూ మా వాడు స్వార్జితంగంజీ—నీళ్లూ త్రాగుతాడూ అంటాను" అని నిలదీసి అడిగింది పిన్ని.

భాస్కరం పిన్ని పాదాల దగ్గర కూచున్నాడు. "అమ్మా" అన్నాడు భక్తితో.

"ఛీ! నన్నలా పిలవ్వొద్దూ" ఆమె ఎడంగా జరిగింది.

"పిన్నీ!"—ఆమె పాదాలమీద చెయ్యి వేశాడు.

"ఊఁ"

"మరి కట్నం వద్దూ అంటే ఈ స్వాతిశయం వున్న ధనమ్మ సమ్మంధం ఎందుకే. ...సలక్షణమైన పిల్లలు కాస్తగా పోతే కాస్తైనా నీ గుణాలు ఒకటి రెండు పుణికి పుచ్చుకున్నవారు దొరకరే. "

ఆమె కొడుకును కళ్లింతలేసి చేసి జూసింది.

"నువ్వు ధనమ్మని కాదుగా కట్టుకునేది?" అన్నది.

"అది సరేగాని ఎవ్రా? ఆ బీదపిల్లా...?" అన్నది తక్షున.

గాభరా పడ్డాడు భాస్కరం.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా, కాలం పేరుకుంటున్నదా అన్నట్లు గడిచాయి.

ఆ ఇద్దరూ ఒకర్ని ఒకరూ వదులుకోలేరు. "సరే ....ఈ సురేఖను చేసుకోనూ అంటే ధనమ్మ ఏమందో తెలుసా? తన యావదాస్తి ముకుందానికి రాసి, అతగాణ్ణి ఇల్లరికం చేసుకుంటానన్నది."

జానికమ్మగారు కళ్ల నీళ్ళు కొడుకు చూడకుండా అటు మొహం తిప్పుకుంది.

కత్తివేస్తే నెత్తురు లేదు భాస్కరం మొహాన... నిలువునా మనిషి నీరైపోయాడు.

"ఛీ! పాపిష్టిది . ..." అన్నాడు కసిగా.

"సరిలే! నీకు నచ్చని పిల్ల నా కెందుకు. ....



వసంతకు మరో మంచి సమ్మంధం నువ్వే చూసుకో నాకు నీకంటే అది ఎక్కువ గాదు......" ఆమె భాస్కరాన్ని తల నిమిరింది

భాస్కరం సిగ్గుతో కుచించుకు పోయాడు.

"ఆ సురేఖ ఒప్పుకుంటే నేను ఆ అమ్మాయిని పెళ్ళాడుతాను అని చెప్పు .. ముకుందరావు మన వసంత కోసరం ఎంతేనా త్యాగం చేయగలడు ........" అన్నాడు అతి కష్టంమీద.

"ఆలస్యంచేస్తే ఆ రాఘవేంద్రం అటువేపే మొగ్గు చూపుతాడు" అనుకున్నాడు కూడా.

"ఎందుకు ఒప్పుకోదూ?" అన్నది పిన్ని బరువుగా.

# ప్రేమకు పగ్గాలు

ముకుందరావును వసంతనూ ఒక చోట చేర్చాలి వాళ్ళ మాత్రం ప్రేమికులు కారూ? ...

*    *    *

భాస్కరం ధనమ్మగారితో సహా అందరితోనూ, తండ్రి కూడా వెళ్ళి అన్నీ మాట్లాడి, నాలుగు చక్కబెట్టుకుని వసంత పెళ్ళి స్థిరపర్చుకున్నాడు.

"అయితే మీ చెల్లాయి పెళ్ళిలో మా సురేఖకు ప్రధానం జరుపుకోమంటావు?"

"అది మీ ఇష్టం మీ అమ్మాయి ఇష్టం" పోడిగా నవ్వాడు భాస్కరం. కసిగా చూశా డామెను.

"ఈ కుర్రాణ్ణి బుర్ర తిరుగు అని అన్నాడే రాఘవేంద్రం. ... పాపం. . నాలిక కూడా లేనంత అమాయకుడూ, బుద్ధిమంతుడూ అనుకున్నది." ధనమ్మగారు 'కట్నం ముక్కు గుద్ది మరి యిస్తాను' అని కూడా అనుకుంది.

వసంతకు ముకుందరావుకి శుభలేఖలు స్వైతం ఎంచి ఏర్పాటు చేశాడు భాస్కరం.

జానికమ్మగారు సంతోషంగానే ఉందిగాని, ఆమెకు తానేదో తప్పిదం చేయడం లేదుకదా అనే శంక పీడిస్తున్నందున కాస్త నీర్సంగా ఉన్నది.

"ఒరే, భాసా! మీ అమ్మలాగే నేనూ ఈ పాటికే పోయివుంటేనా" అన్నది

భాస్కరాన్ని ఎవరో శూలంతో పొడిచి నట్లైంది.

"అమ్మా! అమ్మా! ఎవరమ్మా! నువ్వే నమ్మా నాకు అన్నీను" అన్నాడు కోపంగా.

"ఆడిన మాట తప్పలేనురా నేను నీకు ఇష్టం లేని గుదిబండను కట్టిస్తున్నాడేమోరా నా చేత దేవుడూ" ఆమె దిగులు పడ్డది.

## 28

ఆ మర్నాడు పౌర్ణమి కాబోలు.

సముద్రం జోత్స్నాభిసారికలాపరవళ్ళ త్రొక్కుతున్నది. సురేఖ ఒక ఏకాంత ప్రదేశాన కూచున్నది. ఇసికెలో బొమ్మలు గీస్తున్నది—ఏనాడూ ఒంటరిగా దిగాలుగా కూచొని ఎరుగదు సురేఖ.

సాయం సధ్య కరిగి చీకటి తెరలు జారుతున్నాయి.. సంద్రపు టలల హొరు ఎక్కువైంది—తొవెన్నెల సముద్రంమీద బంగారు మలామా చేస్తున్నది

"ఈ భాస్కరం ఇలా అనుకోకండా అకస్మాత్తుగా నా జీవితంలో ప్రవేశించడమేమిటి?"

"ఒకవేళ పద్మావతిని అతగాడు ఆమె అనుకునే దృష్టిలో ప్రేమించడం లేదేమో......" ఇది ఎన్నోసారోగాని అదే ఆలోచన పీడిస్తున్నది.

"అర్థంలేని మాట..... ఈ వయస్సులో వేరే ఆకర్షణ, మరో ప్రలోభమూ ఎక్కడనుంచి వస్తాయి? అలాంటివన్నీ ఇక భాస్కరానికి తనమీద రావాలి."

సురేఖ ఎంత వారించుకున్నా, ఆమె మనసు విపరీతంగా ఆలోచిస్తూనే ఉన్నది.

దొడ్డమ్మతో చెప్పాలి ...ఈ భాస్కరం పద్మావతి అనే ఒక అమాయకురాలిని దగా చేశాడని?

"భాస్కరం పద్మావతిని దగా చేశాడా?"

"పోనీ! ఈ అబ్బాయి నాకు వద్దూ. ... నీ ఆస్తీ నాకు వద్దు. " అందామనుకుంది. కాని, దొడ్డమ్మ గత పది సంవత్సరాలుగా బ్రతుకుతున్నదీ తన సుఖం కోసరమే ఆమెను ఎలా నిరాశ పుచ్చడం?

ప్రేమకు ఒక పురుషుడికీ స్త్రీకి మధ్య గల ఆకర్షణ అని మాత్రమే నా నిర్వచనం .....ప్రణయం ఎన్నాళ్ళు నిలుస్తుంది?—దొడ్డమ్మది 'ప్రేమ' కాదా?

ఒడ్డునపడి విరిగే ఆ కెరటంలాగ యువ్వనం పొంగున లేస్తుంది. పెరుగుతుంది కాని, ఆ వెనుక దూరాన లోతుగా గల సంద్రంలాగ నిలిచేది అనుబంధం కాదా?

ఐతే "ఇవాళ భాస్కరాన్ని కాదన్నంత మాత్రాన దొడ్డమ్మ అనురాగం పోతుందా?" అనిపించింది సురేఖకు.

"పోదుగాని. ......" అనుకుంది. పాళ్లీ ఆలో చించింది అహంకారంకొద్దీ -- భాస్కరం పెళ్లి పెళ్ళి తప్పించి ఆ ముకుందాన్ని నా మెడ గడతా వంటుంది దొడ్డమ్మ "

సురేఖకు కెవ్వున కేక వెద్దామనిపించింది.

ముకుందరావు వసంతను తన హృదయేశ్వ రిగా చేసుకున్నాడు.... పుల్కొడు సంబరంగా వచ్చి "సురేఖా సురేఖా! నాకు నాకూ........" అన్నాడు.

"ఏమిటి నీకూ.........." అని తాను నవ్వింది.

"నా పెళ్ళికి నీకేం బహుమానం కావాలి?" అన్నాడు.

"ఆడ బడుచు లాంఛనా లిప్పించ"మంది గభిక్కున తను.

"ధన్యుణ్ణి—నీలాంటి పెంకె పిల్లలు నిజంగా దేవ తలు అని ఎంతమందికి తెలుసు సురేఖా! ఒక్క నాలాంటి అదృష్ట వంతులకు తప్ప" అన్నాడు ముకుందరావు.

"ముద్దుగా పూల మొక్కలను, చేవుల పిల్ల లను పెంచినట్లు పెంచుకుంటారు పిల్లల్ని. .... ఆకన దాని ఖరీదు రక రకాలుగా వసూలు చేస్తారు ఈ దొడ్డమ్మల్లాంటివాళ్ళ...... పాపం.. . . పద్మా వతి తన పెళ్ళి చూపుల వైనం చెబితే యేమవు తుందీ?"

సురేఖకు పద్మావతి ప్రేమ కోసరం ముకుంద రావు వాత్సల్యం కోసరం కూడా తాను త్యాగాలు చెయ్యాలనుంది! కాని దొడ్డమ్మ ప్రేమ ఈ రెండిటి కన్నా ప్రతిబంధకమే దాన్నేం చెయ్యాలి?

'తాను ఇన్నాళ్లు వెచ్చించిన దానికి ఖరీదు అడుగు తున్నది దొడ్డమ్మ.'

"హే భగవాన్! ఈ సముద్రంలోపడి చద్దునా" అనుకుంది

అటు చూసింది. కెరటాలు తుళ్లి తుళ్లి పడుతున్నాయి. వెన్నెల్లో మిల మిలా తళతళా మెరిసి పోతున్నాయి.. ......ఆ వెన్నెల కాంతుల్లో కెర టాలు ఒడ్డుకు తెచ్చి పారేసిన ఒక తాటికాయ తళు క్కున మెరిసింది

"అదోదాన్ని విసిరేసినట్లే తనను కూడా పారే స్తుందీ సముద్రం... .అప్పుడు తన శవాన్ని చూస్తే పద్మావతి భాస్కరాన్ని నిండుగా ప్రేమించదూ..... దొడ్డమ్మ తన ఆస్తి నస్పలు ఇక ప్రేమించనే ప్రేమించదూ. ......"

సురేఖకు ఈ పీడ కలల్లాంటి పిచ్చి ఆలోచనలతో ఏదో భయం వేసింది –"మధ్యని నేను చావడం ఎందుకు?" అని లేచి గబగబా బయలు దేరింది

సముద్రం ఇంచుమించు ఒంటరిగా వెన్నెల్లో ఆడుకుంటోంది – ఉప్ప కొంచెంమంది నగరోన్ముఖులై పొయ్యారు.

"భాస్కరంతో మాట్లాడి పద్మావతి గురించి తెల్సుకుంటాను" అనుకున్నది వడివడిగా నడుస్తూ.

ఒక రిద్దరూ స్కూటర్ వాలాలు, కాస్త నెమ్మదిగా స్కూటర్‌లు నడిపి, ఆమెను వెన్నెల్లో పోల్చగలమా అన్నట్లు ఆశగా చూశారు.

"క్రూర వెధవలు" తిట్టుకుంది సురేఖ.

"ఇలా వెంటబడతారు — తీరా మీరే మాకు గతి అని ఎవడినేనా గుండెల్లో దాచు కుంటే గాయాలు చేసిపోతారు" అనుకుంది. మళ్లా తన అనవసరమైన కసికి తానే నవ్వుకుంది.

సురేఖ నేరుగా మెస్సుకు కూడా వెళ్ళలేదు. రూమ్‌కి వెళ్ళిపోయింది.

అక్కడ తీవ్రంగా ఎదురు చూస్తూ, తన మంచ అంచున కూచున్న పద్మావతి అగుపించింది.

"ఏమిటోయ్!" పలకరించింది.

"ఏమిటోయ్!" పలకరించింది సురేఖ ...

"అబ్బ! ఎందుకనోగాని నీ కోసరం బెంగపడుతూ కూచున్నాను సుమా!" పద్మావతి లేచి నిలబడి స్నేహితురాలి నెదుర్కొన్నది.

"ఏమయిపోతానోయ్! నీ చాదస్తం గాకపోతే" సురేఖ ప్రక్కమీద వెల్లకితలా కూలబడుతూ నవ్వింది.

పద్మావతి ఆ పిల్ల ప్రక్కనే కూచుని "ఏమో మరి! ఎవర్నేనా లేవదీసుకుని......" వేళాకోళంగా కిలకిల నవ్వింది పద్మావతి సురేఖ బుగ్గ మీద చిటికవేసి.

"ఏ మొహం ..... ఎవర్ని ఎత్తుకుపోయినా నీ ప్రియుణ్ణి మాత్రం ముట్టుకోనులే....." పొడిగా నవ్వింది.

"ఛ! ఏం మాటలే అవీ ...... పోకిరీ" పద్మా వతి సురేఖను కౌగలించుకుంది.

సురేఖ ఏం కదలలేదు.

పద్మావతి సురేఖ ముంగురులు సవరించింది. "ఈ అందాల రాశిని చూస్తూవుంటే ఆడదాన్ని పరాయి దాన్ని ఐపోయినదాన్ని నేనే చలించిపోతున్నానే, ఇక ఏమగాడు......"

"అబ్బ! ఉండవే.....సొద. . తలకాయ నొప్పిగా వుంది.... .." అటు తిరిగి పడుక్కుంది సురేఖ.

పద్మావతి దిగులుపడిపోయింది "చురుకైన సురేఖ ఇలా ఐపోయిందే?"

వాస్తవానికి పద్మావతి సురేఖను మంచిగా ప్రాధేయపడి "భాస్కరం నీ వాడేనే" అనిపించు కుందామనే వచ్చింది. ఆ ఉద్దేశం ఆమెకు ఉద్దేశ పూర్వకంగా లేదుగాని అంతర్గతంగా వున్న భయమే ఆమెను — సాయంకాలంనించీ ఈ సురేఖ కోసరం కాచుకుని కూచోమన్నాయి.

పద్మావతికి ఆందోళన ఎక్కువైంది. సురేఖలో ఉత్సాహం సన్నగిల్లడంతో తాను మరీ బేలపడి పోయింది.

"కాలేజీలకు ఇందుకా మీరు వస్తున్నారు— చదువులకు కాదూ" అన్నారెవరో మనసులో.

"ఏమోయ్! సురేఖా! నోట్సు రాద్దామా?" అన్నది పద్మావతి "అన్నట్లు నువ్వు భోంచేశావా?" అని అడిగింది.

సురేఖ మాటాడలేదు.

"నే వెళ్తున్నా" నిరాశతో లేచింది పద్మావతి.

"వద్దు—పడుకో"మని ప్రక్కకి జరిగింది సురేఖ

"సురే! నిన్ను దేవుడు పుట్టించినప్పుడు బహుశా వాడికి పెద్ద రాజ్య కాంక్ష ఉందేమోనే" పద్మావతి అడిగింది.

"పిచ్చిదానా? రాజ్యాలేం చేస్తాయే రాజ్యాలు సుఖాల నిస్తే కాశీమజిలీ కథల్లో రాకుమార్తెలు లేచిపోవడం, పారిపోడం ఎందుకు చేస్తారూ?"

# ప్రేమకు పగ్గాలు

"ఏమో! బాబూ నీ కవిత్వం నా కర్థం కాదూ... అది సరేగాని" ఉలిక్కిపడి లేచి కూచుంది పద్మావతి

"ఏమిటి ..." [illegible]

"పొరాలా? గుణపాఠాలా?"

"అందుకే పాపం — ఓ రచయిత కష్టపడి, నష్టపడి, ఈ తొలి మలుపు బాధలన్నీ రాస్తే ఓ విమర్శకుడు, "ఏం! హాయిగా యూనివర్శిటీకి వెళ్ళి చదువుకోడం మాని, సినిమాలు, ప్రేమలూ ఎందుకూ?" అని రాశాడట......."

"ఆ విమర్శకుడు" చిన్నతనాన్ని పాతికముప్పై ఏళ్ళక్రితం ఎక్కడో పారేసి, మరిచిపోయి ఉంటాడు. మనం అనుబంధాలు అనురాగాలు కావాలని తెచ్చుకుంటాముటే ........ శీతగాలికి పెదాలు పగిలినట్లు, యువ్వనంలో హృదయానికి ఈ "టివ్వు టివ్వు" మనే దోషం వస్తుందిగానీ......" సురేఖ మాటలకు పద్మావతి విస్తుపోయింది.

"నువ్వు ప్రేమలో పడ్డావా?"

"ఆహా! మా దొడ్డమ్మ నన్ను తన చరాస్తి అనుకుంటోంది. ....కాని నేను నీ ప్రేమలో పడ్డాను— నువ్వు .....నువ్వు. . ..." సురేఖ, పద్మావతిని ముక్కు నులిపింది.

"ఇష్ష ....... మీ రూమ్‌మేటు సెకండ్ షో సినిమాకు వెళ్ళి వస్తోంది బివేర్" పద్మావతి సురేఖ నోరు సున్నితంగా నొక్కింది.

"అది వార్డెన్ ఫ్రెండుగా! ఆ ఇద్దరూ పోతారు. అది వాళ్ల అఫైర్. ఇది మన అఫైర్."

సురేఖ రూమ్‌మేటు కాదు. ఎవరో ఆ వరండాలో అటుగా నడిచి వెళ్ళిపోయారు.

సురేఖ అన్నది. "పద్మా! అనగనగా, ఓ అమ్మాయి ఓ అబ్బాయిని ప్రేమించిందట ........ ఊఁ కొడుతున్నావా?"

"ఊఁ.......మించి?" పద్మావతి అడిగింది.

"కాని ఆ అబ్బాయిని మరో అమ్మాయి సంరక్షకురాలు ప్రేమించిందిట—"

"ఛా! రంకు గాథ" నవ్వింది పద్మావతి

"కాదే! కేవలం అహం అంటే సెంట్ పర్సంట్ మరే మీ మిక్స్‌గాని సినలు ప్రేమేనే ఆమెది. తన కూతురికిచ్చి, ఆ అబ్బాయిని పెళ్ళి చేస్తానందీ"

"ఐ సీ ......... అయితే ఫర్వాలేదు" పద్మావతి నవ్వింది.

"ఏమిటే నీ మొహం. ఫర్వాలేదు. ఆ ప్రేమించిన అబ్బాయి—ఆ మొదటి అమ్మాయినేం చెయ్యాలి?"

పద్మావతి గుండెలు కెలికి నట్లైంది. "నా మొహం! నీ పాటి తెలివి యివ్వలేదు నాకు దేవుడు! పోనీ ఆ అబ్బాయి—ఆ సంరక్షకురాలిని "ఫో నరసమ్మా! నీ ముద్దుల పట్టి నాకు వద్దు" అంటాడు అనుకో"

"అనడనుకో"

"నాన్‌సెన్స్—అయితే ఆ అబ్బాయి ఆ మొదటి అమ్మాయిని "లవ్" చేయడం హుళక్కన్నమాటా!" పద్మావతి చెప్పింది.

"అంతేనంటావా?" సురేఖ సీలింగ్‌కేసి చూసింది సాలోచనగా.

"ఏమో బాబూ! నా కెలా తెలుస్తుందీ?.... నువ్వీమధ్య మాటిగా మాట్లాడటం మానేస్తున్నావూ" అన్నది.

"చూడు పద్మా! జీవితం గ్రఫు షీటుమీది బిందువు లాంటిది. దీన్ని దీని ఉనికిని గుర్తించాలి అంటే అనే కానేక అంశాలను పరిశీలించాలి...... నువ్వు ఉన్నావనుకో. ... .మీ అమ్మగారు నిన్ను ప్రేమిస్తున్నారా లేదా? ఆమె ఇష్టం ఒకటి ఉన్నది కదా? ..." అంటే పద్మావతి అనే అమ్మాయి స్వేచ్ఛకి వాళ్లమ్మ 'ప్రేమ' అనే పగ్గ ఒకటి ఉన్న దన్నమాట " సురేఖ ఆలోచిస్తున్నది మాట్లాడటం లేదు గట్టిగా ఆలోచిస్తున్న దంతే!

వేరే ప్రత్యేకమైన ఒక ఆకర్షణ శారీరకమైన వాంఛ ప్రవేశించనంతవరకూ, కుటుంబమూ అందులోని వ్యక్తులూ, వీరి అనుబంధాలు, ఆటంకాలు వీటికి మించిన తియ్యని అనుభవాలుండవుగాని— తారుణ్యపు తొలి రోజుల్లో ప్రణయం కోసరం మనం ఉవ్విళ్లూరుతున్నప్పుడు ఈ అనురాగాలు అనుబంధాలు అన్నీ బందాలై పోతాయి.'' — సురేఖ మాటలను పద్మావతి విన్నది. ఏమో అందామనుకున్నా, నోరు పెగల్లేదు.

సముద్రం కెరటాలు చూసి భ్రమసి ఇది ఎంత చంచలమైనదీ అనుకున్నట్లే, చిలిపి సురేఖను చూసి "ఈ పిల్ల ఎంత చీకూ చింతా లేనిదీ అనుకున్నాను కాని సురేఖకు తనకంటే ఎక్కువ సత్యాలు తెలుసు" ననుకుంది పద్మావతి.

"నన్నేం చెయ్యమంటావే......" అన్నది ఎట్టకేలకు

"బుద్ధిగా చదువుకో......మీ అమ్మగారు నువ్వు మాష్టరీ చెయ్యాలని నిన్ను పాతికేళ్ళు కన్నులలో ఒత్తులు వేసుకుని పెంచారు.'' సురేఖ నవ్వింది— వూరికే సర్దాగా అన్నట్లు ధ్వనించాలని ఆమె ప్రయత్నం.

"చిత్తం......అలాగే ... .మరి చదువుకోసమేగా ఈ వూరొస్తా" పద్మావతి స్నేహితురాలికి దగ్గరగా జరిగింది.

"ఉహూ!. .....అది ఆత్మవంచన.........అలా అనకు ప్రేమ కోసమను" సురేఖ నవ్వింది.

(ఇంకా ఉంది)

## హా! భారత పౌరుడా!

దిన దినము పెరుగు ధరలతో
తిన తిండియె దొరకదనుచు దిగులొందకు మీ
ఘన మగు నా పంచవర్గ
ప్లానులతో కడుపు నింపుకొనవలె నయ్యా.

ప్లానంటె ప్లానులా మరి
ప్లానుకు వేలాది కోట్ల ధనవ్యయమట, ఆ
ధన మేగతి జనుచున్నది
అని మాత్రము అడుగవలదు అది యొక బాధో.

ప్లానులు చదువుచు వినుచును
ప్లానులె దైవంబు లనుచు భక్తిదలచుచున్
ప్లానుల కొరకై ప్రాణము
లైనను విడువంగ సిద్ధ మనవలె నయ్యా!

ప్రాణము పోయిన తదుపరి
ప్లానుల ఫలమేమి యనుచు వాపోవకు, నీ
ప్రాణము లేరికి గావలె
ప్లానులు పూర్తైన చాలు పరమార్థ మదే.

ఎప్పటి కవునో ప్లానులు
అప్పటికీవుండవనెడి అనుమాన మేలోయ్!
అప్పటికి ఎవ్వరుండరు
తప్పక ప్రళయంబు వరకు తగ్గవు ప్లానుల్.

ఎనుబదియవ ప్లానుకు నీ
మనుమల మనుమళ్ళ వారి మునిమున మనుమల్
మనెదరు భూతల స్వర్గము
ననియెడు మాటలతో కడుపు నిండుటలేదా?

పన్నులు కట్టుము నవ్వుచు
పన్నుల ఆవశ్యకతను ప్రశ్నింపకుమా
ఎన్నెన్నో ఖర్చులున్నవి
అన్నియు నీ మంచికొరకే యని పడు తృప్తిన్.

కట్టిన పన్నులతో పై
మెట్టున కూరుచున్న మంత్రి వరేణ్యుల్
పెట్టెడు ఖర్చులు చూచుచు
పెట్టకు కన్నీరు ఫలితమేమియు లేదోయ్.

ఐదేళ్ల కొక్క పరినీ
పాదంబుల వ్రాలి ప్రియపు పలుకుల ఓటున్
ప్రాథేయ పడుచు వేడుట
పదవులలో నున్న సుఖము మరిగెయెకాదా.

కనకం బట నీ భవిష్యత్
కనుకనె కనకమ్ము పయిని కనువేయ ప్రభుల్
కనకం బావిరి ఆయెను
కనకమె వర్షించు కాచికొనుముర తండ్రీ!

అన్నిట వేసిరి పన్నులు
ఉన్నది ఇక పీల్చుగాలి ఒకటియె ఫ్రీగా
తిన్నగ దానికి పైతురు
పన్నును, నేర్వుముర త్వరగ ప్రాణాయామమ్.

—అ. భారతీదేవి.

# వంటగది వీరుడు



(గత సంచిక తరువాయి)

"నీ వేడికోలు వృథా అవకుండా ఉండాలంటే ఈవిడ నన్ను అర్థించాలి," అన్నాడు గారెత్.

"ఎన్నటికీ ఆ పని చెయ్యను. ఒక పని వాడిని అర్థించటమా!" అన్నది లినెట్.

"అయితే అతను చావాలిసిందే" అన్నాడు గారెత్.

"రక్షించండి!" అని వేడుకున్నాడు పచ్చ నైట్ "నా తమ్ముడిని చంపారన్న సంగతి కూడా మరిచిపోయి, నా ఏభయిమంది అనుచరులతో బాటు, నీ క్రింద పని చేస్తాను."

"లాభం లేదు. ఆమె అడిగితేనే నీ ప్రాణం దక్కుతుంది," అన్నాడు గారెత్

"ఛీ! పాడు మనిషీ! అతన్ని చంపకు!" అని కేక వేసింది లినెట్

"మీ ఆజ్ఞ శిరసావహిస్తాను. పచ్చ నైట్ గారూ, మీ ఏభయి మంది అనుచరులతోనూ కామెలాట్ కి వెళ్ళి ఆర్థర్ రాజుకి లొంగిపోండి. వంటగది నైట్ మిమ్మల్ని పంపించాడనండి."

ఆ సాయంత్రం పచ్చ నైట్ గారెత్ కీ, లినెట్ కీ తన భవంతిలో విందు చేశాడు. ఆమె తప్ప మిగిలిన వారందరూ అతన్ని అమితంగా గౌరవించారు.

"ఇతన్ని ఈవిధంగా మర్యాద చెయ్యటం తప్పు!" అని అరిచింది ఒకసారి.

"ఈమాత్రం మర్యాద చెయ్యక పోతేనే తప్పు," అన్నాడు పచ్చ నైట్.

మర్నాడు పొద్దున అడవిలో నుంచి వెడుతూఉండగా సర్ గారెత్ అన్నాడు: "లేడీ లిన్నెట్, మీరు నన్నిలా తిట్టడం భావ్యం కాదనుకుంటున్నాను. ఇంతవరకూ నన్ను వోడిస్తారన్న వారందనీ గెలిచాను మీ రేమన్నా సరే, ఈ కార్యం సాధించేవరకూ మీ వెంటనే వస్తాను."

"ఇప్పుడు నిజంగా నిన్ను మించిన వాడిని కలుస్తావులే! నీలం నైట్ భవనం దగ్గరికి వస్తున్నాము. సర్ లాంసెలాట్, సర్ గవెయిన్, సర్ బార్స్, లేక కింగ్ ఆర్థర్ కాని అతన్ని జయించలేరు వాళ్ళయినా మా అక్కయ్యని నిర్బంధించిన రెడ్ నైట్ ని వోడించగలరా అని నా అనుమానం. అతనికి మంత్ర శక్తి ఉందని నా నమ్మకం."

"ఎంత గొప్పవారిని జయిస్తే అంత గొప్ప!" అన్నాడు సర్ గారెత్.

అడవిని వదిలి నీలం పువ్వు మొక్కలు పరచినట్లున్న మైదానం మీదకి వచ్చారు దానిమీద అక్కడక్కడ నీలం రంగు గుడారాలున్నాయి; నీలం దుస్తులు వేసుకున్న నైట్ లూ, వారి స్త్రీలూ అటూ యిటూ తిరుగుతున్నారు. మైదానం మధ్య ఒక పెద్ద చెట్టు ఒకటి ఉంది దాని కొమ్మలమీద ఎన్నో డాలులు వేళ్లాడుతున్నాయి. ఇవన్నీ నీలం నైట్ చంపిన వీరులవి. వీటన్నిటి కన్నా కింద ఒక పెద్ద నీలపు డాలు తగిలించి ఉంది. దాని మధ్యనే నేల గుచ్చిన నీలం రంగు వేసిన ఈటె చెట్టుకి కట్టి ఉన్న బూడిద రంగు గుర్రం కనిపించాయి.

"పారిపో! నీలం నైట్, అతని వందమంది అనుచరులూ అడుగో!" అన్నది లేడీ లిన్నెట్.

"అయితే పోట్లాడి తీరుతాను!" అన్నాడు గారెత్. "ఒక్కొక్కరుగా వస్తే కొందరినైనా గెలుస్తానేమో!"

"మీ రెవరో తెలీదు కదా!" అంది హఠాత్తుగా తన ధోరణి మారుస్తూ "మీది నిజంగా గొప్ప వంశం అయి ఉండాలి—ఒక స్త్రీ ఇంత అవమానపరిస్తే కూడ సౌమ్యంగా జవాబిస్తూ నా వెంటనే వస్తున్నారే!"

"లేడీ లిన్నెట్," అన్నాడు గారెత్ గంభీరంగా. "ఒక స్త్రీ ఎత్తిపొడుపులకే తట్టుకోలేని నైట్ ఏమి చెయ్యగలడు? మీ మాటలు నన్ను బాధపెట్టిన మాట నిజమే—కాని ఆ కోపంలోనే శత్రువులని మరింత తీవ్రంగా ఎదిరించ గలుగుతున్నాను నా జన్మరహస్యం విషయం అంటారా, మర్యాదగా నా ధర్మం నేను నెరవేరుస్తాను. అంతకన్నా చెప్పలేను."

"బోమెయిన్స్ గారూ," అని వెక్కి వెక్కి ఏడిచింది లిన్నెట్, "నన్ను క్షమించండి! అదలా ఉంచి

## వంటగది వీరుడు

ఇప్పటికయినా వెనక్కి తిరిగిపొండి. ఏ అపాయాలు వస్తాయో!"

"సంతోషంతో క్షమిస్తున్నాను" అన్నాడు గారెత్. "కాని వెనక్కి పోవటం అంటూ ఉండదు!"

ఆక్షణంలో నీలంనైట్ గారెత్‌ని చూసి గుర్రం మీదకి ఎగిరి కూర్చుని, "ఓయీ నల్ల కవచం నైట్! గుర్రం దిగి నా పాదం ముద్దు పెట్టుకున్నావా సరే సరి! లేదా, నిన్ను నిర్దాక్షిణ్యంగా చంపేస్తాను."

"నువ్వే నా ముందు మోకరిల్లు. ఇంతమంది నైట్‌లను చంపిన నిన్ను క్షమించటం అంటే తేలిక కాదు!"

నీలం నైట్ గుర్రం మీద అతి వేగంగా గారెత్ మీద వచ్చిపడ్డాడు. ఇద్దరూ కలుసుకున్నారు. ఆదెబ్బకి ఈటెలు రెండూ విరిగి తునకలయ్యాయి. గుర్రాలు నేలమీద దొర్లాయి. నైట్‌లు ఇద్దరూ ఖడ్గాలతో కలియబడ్డారు. వాటి దెబ్బలకి రవ్వలు వచ్చాయి. చివరికి గారెత్ వేటుకి నీలం నైట్ శిరోరక్ష ఊడి, అతను పడిపోయాడు. గారెత్ అతన్ని చంపబోతున్నట్లు కత్తి ఎత్తాడు.

లేడీ లిన్నెట్ అతన్ని వదిలెయ్యమని వేడుకుంది. నీలం నైట్ ప్రాణం దక్కింది. అతను గారెత్‌కి లొంగిపోయినట్లు అంగీకరించాడు

"నీవంటి సాహసికుడిని చంపటం కూడా సరి కాదు," అన్నాడు గారెత్ "కింగ్ ఆర్థర్ సభకి వెళ్ళి నీ వందమంది అనుచరులతో లొంగిపో! వంటగది నైట్ పంపించాడని చెప్పు."

ఆరాత్రికి అందరూ నీలం నైట్ ఆతిథ్యం స్వీకరించారు. మరునాటి దినం ఉదయం వీరు బయలుదేరుతూ ఉండగా అతను లేడీ లిన్నెట్‌ను

అడిగాడు, "లేడీ లిన్నెట్, ఈయన్ని ఎక్కడికి తీసుకువెళుతున్నారు?" అని.

"నీలం నైట్‌గారూ, 'కాసిల్ డేంజరస్'లో మా అక్కయ్య బందీగా ఉంది. అక్కడికి పోతున్నాము."

'అంటే మీరు ఎర్ర నైట్‌నే ఎదిరిస్తారన్నమాట! ప్రపంచంలో కెల్లా ప్రమాదకరమైన మనిషి దయా దాక్షిణ్యాలు లేనివాడు. ఏడుగురి బలం ఉందతనికి. మీ అక్కయ్య ఉన్న కోటని భేదించేవాడే కాని మార్గనా లెఫే రాణి (మంత్రకత్తె కూడా) వప్పుకోలేదు. ఎవరయినా పెద్ద నైట్‌లు లేడీ లియోనెస్‌ని రక్షిద్దామని వస్తే చంపేద్దామని కాచుకుని ఉన్నాడు. సర్ గారెత్‌ని వదిలిపెట్టడేమోనని భయపడుతున్నాను.'

"భగవంతుడు ఎలా నిర్ణయిస్తే అలా జరుగుతుంది" అన్నాడు సర్ గారెత్. "నేనే అతన్ని చంపాలని రాసి ఉందేమో!"

నీలం నైట్ వద్ద సెలవు పుచ్చుకుని ఒక దట్టమైన అడవిని ప్రవేశించారు. కొంత సేపటికి అడవిని వదలి ఒక బయలు మీదకి వచ్చారు. దాని మీదంతా ఎర్రని పూలచెట్లు, మధ్య ఎర్ర రాతితో కట్టిన కోట; కోట చుట్టూ ఎర్ర గుడారాలు! ఇద్దరూ ముందుకి సాగిపోయారు. కొంత దూరం వచ్చిన తర్వాత ఎర్రని చెట్టు ఒకటి ఎదురయింది. దాని ఎర్ర పువ్వుల మధ్య ఎన్నో మృత కళేబరాలు వేళ్ళాడుతున్నాయి. ఇవన్నీ కవచాలతో ఉన్న నైట్‌లవే.

"వీరంతా లేడీ లియోనెస్‌ని రక్షించటానికి వచ్చిన వారి దేహాలు. ఎంత నిర్దాక్షిణ్యంగా చంపేశాడో ఎర్ర నైట్ వీరందరినీ!" అన్నది లిన్నెట్.

"వాడితో యుద్ధం చేసే సమయం వచ్చింది!" అన్నాడు గారెత్ క్రోధంతో. చెట్టుకి తగిలించి ఉన్న ఒక దంతపు బాకా తీసి ఊదబోయాడు.

"ఆగండి!" అంది లిన్నెట్. "ఎర్ర నైట్ బలం మధ్యాహ్నం వరకూ పెరిగి క్షీణిస్తుందిట. అంతవరకూ ఉండండి!"

'అతని బలం తగ్గిన తరువాత పోట్లాడటం నాకు పరువు తక్కువ." అంటూ గారెత్ కోటగోడలు సైతం దద్దరిల్లేట్లు ఆ బాకా ఊదాడు. కోటలో వారందరూ కిటికీలలో నుంచి తొంగిచూశారు, ఎవరా బాకా ఊదేది అని.

"నాన్నా! నాన్నా! నువ్వు పదిమందికి సహాయపడమని చెప్పావు. ఇవ్వాళ నేనలా చేశాను. ఓ ముసలమ్మను రోడ్డు అవతలకి తీసుకెళ్ళబోయాను, కాని ఆ ముసలమ్మ కారు క్రిందపడి దెబ్బలు తిన్నది" అని మొత్తుకున్నాడు. అమ్మా నాన్నా మాట వినే సుపుత్రుడొకడు.

రంగారావు (రేగడపల్లి)

'సర్ గారెత్, అదిగో లేడీ లియోనెస్ కిటికీ దగ్గర నుంచుని ఉంది.'

గారెత్ ఆ స్త్రీవైపు తిరిగి వినయంగా ఒకసారి తలవంచాడు.

ఇంతలో ఎర్రకవచం తొడుక్కుని ఎర్రగుర్రం ఎక్కి వస్తున్న ఎర్రనైట్ కోపంగా అరిచాడు: "ఆవిడ వంక చూడక-ఆవిడ నాది! నన్ను చూడు! నువ్వు చూసే ఆఖరి మనిషిని నేనే!"

ఈటెలు ఎక్కుపెట్టి కలియబడ్డారు ఇద్దరూ. ఆ అఘాతానికి రెండు గుర్రాలూ చనిపోయాయి. ఇద్దరూ స్పృహతప్పిపడి పోయారు.

"మెడలువిరిగి చనిపోయారేమిటి! ఈ కొత్తనైట్ ఎవరో ఘనుడిలాగే ఉన్నాడు. అసలు ఎర్ర నైట్‌ని గుర్రం మీదనుంచి పడగొట్టిన వారే ఇంతకు ముందు లేరు!" అనుకున్నారు ప్రేక్షకులు.

కాని ఇద్దరూ నైట్‌లూ కోలుకుని కత్తులుతీసి యుద్ధం ప్రారంభించారు. మిట్టమధ్యాహ్నం వరకూ నిర్విరామంగా పోరాడరు. సరిగ్గా పన్నెండు గంటలకి ఎర్రనైట్ గారెత్ చేతిలో నుంచి కత్తిపడగొట్టేసి చంపేద్దామని మీదికి ఉరికాడు. అయినా సర్ గారెత్ ఉత్తచేతులతోనే అతన్ని ఎదుర్కొని, కిందపడేసి కత్తి లాక్కుని తలకొట్టెయ్యటానికి ఉద్యుక్తుడయ్యాడు.

"అయ్యా! కరుణించండి!" అని అరిచాడు ఎర్ర నైట్. "నేను మీ బానిసను!"

"నిన్ను ఊరికే వదిలిపెట్టకూడదు. ఇందరు నైట్‌లను ఉరి తీశావే! క్రూరమయిన అవమానం కదా అది!" అన్నాడు గారెత్.

"సర్ నైట్‌గారూ! ఇదంతా ఒక స్త్రీకోసం చేశాను. తన దుర్గం ఆమె నిర్మించినదే. తన అన్నదమ్ములు కొందరు కింగ్ ఆర్థర్ నైట్‌లతో పోరాడి చనిపోయారట. అందుకనే రౌండ్ టేబిల్ నైట్‌లలో పదిమందిని చంపితే నన్ను వరిస్తానన్నది. వారందరినీ ఆ ఎర్ర చెట్టుకి వేళ్ళాడదియ్యమంది!"

లేడీ లిన్నెట్ కూడా వచ్చి ఎర్ర నైట్‌ని వదిలివెయ్యమని కోరింది.

"ఇదంతా మార్గనాలెఫే చేసిన పని. ఈ నైట్‌గారు మంచివాడే. సర్ అయిరన్ సైడ్ ఎప్పటికయినా రౌండ్ టేబిల్ వద్ద కూర్చోవలసినవాడు!" అన్నది.

"సర్ అయిరన్ సైడ్ మీరు లేవచ్చు. మీ ప్రాణాలు మీకు దక్కాయి. వెళ్ళి కింగ్ ఆర్థర్

# వంటగది వీరుడు

లొంగిపోండి వంటగది నైట్ పంపాడనండి."

సర్ గారెత్ పది రోజులపాటు సర్ అయిరన్ సైడ్ అతిథిగా అక్కడే ఉండిపోయాడు. గాయాలన్నీ నయమైపోయిన తర్వాత కాసల్ డేంజరస్‌కి బయలుదేరాడు. కాని కోట ద్వారం సమీపించగానే తలుపు వేసేశారు అక్కడివాళ్ళు. ఇదేమిటో అర్థం కాలేదు గారెత్‌కి. ఇంతలో లోపలనుంచి లేడీ లియోనెస్ అరిచింది:

"బోమెయిన్స్, వెళ్ళి పో! వంటగది నైట్‌వి! నువ్వు మంచి వంశం వాడివైతేనే నిన్ను వరించగలను!"

దానితో గారెత్ వళ్ళు మండి మాట్లాడకుండా గుర్రం వెనక్కి తిప్పి వెళ్ళిపోయాడు. అతని వెంట మరి గుజ్జు కూడా వెళ్ళాడు.

లేడీ లిన్నెట్ తన అక్కని చివాట్లు వేసింది.

"నిన్ను రక్షించిన నైట్‌కి కృతజ్ఞత చూపే విధం ఇదేనా? నువ్వనుకున్నట్లతను మామూలు వంశం వాడు కాదు!" అన్నది.

లేడీ లియోనెస్ తన అన్నగారయిన సర్ గ్రింగామర్‌ని పిలిచి, "బోమెయిన్స్‌ని అనుసరించి అతను నిద్ర పోతున్నప్పుడు అతని వెంట నున్న మరిగుజ్జును తీసుకువచ్చెయ్. వాడికి తన యజమాని పేరు తెలీకుండ ఉండి ఉండదు," అన్నది.

తన చెల్లెలు చెప్పినట్లే ఆరాత్రి మరిగుజ్జుని ఎత్తుకు వచ్చేశాడు. మరిగుజ్జు కేకలు విన్న గారెత్ లేచి వారిని వెంబడించాడు. చివరికి కాసల్ డేంజరస్ చేరుకున్నాడు. "నా పనివాడిని నాకు తిరిగి ఇచ్చెయ్యకపోతే ఊరుకోను!" అంటూ వచ్చాడు అప్పటికే గారెత్ ఎవరో అందరికీ తెలిసిపోయింది.

లేడీ లియోనెస్ అతనికి స్వాగతం ఇచ్చింది.

"సర్ గారెత్ మీకు సుస్వాగతం-నన్ను రక్షించారు, నా ప్రేమను చూరగొన్నారు," అన్నది.

"లేడీ లియోనెస్," అని సమాధానం ఇచ్చాడు సర్ గారెత్ "ఇంతకుముందు లేని ఈ మంచి మాటలన్నీ ఎక్కడనుంచివచ్చాయి మీ అతిథిగా కావలిస్తే వస్తాను కాని మీరంటే నాకు ప్రేమలేదు!"

ఆవిడకి చాలా కోపం వచ్చింది కాని బయటకి తెలియనివ్వకుండా అతనికి అన్నిమర్యాదలూ చేసింది.

ఆరాత్రి అతను నిద్రపోతూ ఉంటే ఒకపరిచారకుడికి కత్తి యిచ్చి చంపమని పంపించింది. వాడు పొడవబోతూ ఉండగా గారెత్‌కి తెలివి వచ్చి పక్కకి తప్పుకున్నాడు. కత్తి తొడకి గుచ్చుకుంది, అంతే. గారెత్ అలాగే లేచి ఆ పరిచారకుడిని ముక్కలు ముక్కలుగా నరికి వేశాడు.

లేడీ లియోనెస్ పొద్దునే లేచి కామెలాట్‌కి వెళ్ళిపోయింది. అక్కడ కింగ్ ఆర్థర్‌ని కలుసుకుని గారెత్ తన్నెలా రక్షించిందీ చెప్పింది. గారెత్ పేర నైట్‌ల మధ్య యుద్ధాలు ఏర్పాటు చెయ్యమంది. గారెత్ ఈపాటికి ప్రమాదంగా గాయపడో, చనిపోయో ఉంటాడని ఆమె ఊహ.

గారెత్ గాయపడ్డాడని తెలిసిన లిన్నెట్ వెంటనే అతని గదికి వెళ్ళి తనకి తెలిసిన విద్యలన్నీ ఉపయోగించి నయం చేసింది. అతను కోసం కామెలాట్‌లో జరుగుతున్న యుద్ధాలకి వెళ్ళగలిగాడు. అక్కడ చాలా మందిని గెలిచాడు. పోటీలన్నీ ముగిసిన తర్వాత చేసిన విందులో సర్ గారెత్ లేడీ లిన్నెట్ వేలికి ఒక ఉంగరం తొడిగాడు. అతను నిజంగా ఎవరో అందరికీ తెలిసిపోయింది. త్వరలోనే గారెత్, లిన్నెట్‌ల వివాహం జరిగింది.

లేడీ లియోనెస్ తన ప్రవర్తనకు పశ్చాత్తాప పడింది. కొన్ని సంవత్సరాలకి ఆమెని గారెత్ అన్న సర్ గాహెరిస్ పెళ్ళిచేసుకున్నాడు. ★




కేవలం చిన్న (కారు) ప్రమాదమే!

ప్రియా! మీకు ఎటువంటి ఆపదా కలుగ కుండా ఉండాలని నిత్యమూ భగవంతుడ్ని ప్రార్థిస్తున్నా!

మీరు చేస్తున్న సహాయాన్ని మేము ఈ జన్మలో తీర్చుకోలేము ఎల్లప్పుడూ మేము ఋణ పడి ఉంటాము. నా మాటను పాటించి కాలేజీలో మాట్లాడించటానికి ప్రయత్నించనందుకు మీ విశ్వలమైన ప్రేమకు అబ్బుర పడుతున్నాను.

నీలవేణి."

ప్రేమకు కత్తిపోట్లు సహజమేనను కుంటా! కలుషితమై పాప పంకిలమైన సంఘంలో మా లాంటి విశ్వల ప్రేమికులకు తావు లేదు.

## కథకుడు

రామ్మూర్తి—నీలవేణుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు శర పరంపరలుగా సాగిన తరువాత 'నీలవేణి అన్నయ్య' అనేవాడు రెచ్చిపోయి రంగంమీదకు లంఘించాడు. అదేం పాపమోగాని, బలిసిపోయిన కండలను అదేపనిగా చూసుకుంటూ 'తంతా! తంతా!' అనటం తప్ప ఇంకో మాట అతనినోట నుంచి వెలువడ్డంలేదు... ..రామూర్తి కనపడితే కూరలో ముక్కగా భావించి నంజుకొని నోట్లో వేసుకుంటాడేమో (నీలవేణికి మిగలకుండా) అనే భయంతో ఈ వ్యవహారాన్ని పరిష్కరించటానికి పూనుకున్నాను.

ఇంతవరకూ తనకు తెలియకుండగా నీలవేణితో ప్రేమ లేఖల వ్యవహారం నడిపినందుకు పాప పరిహారంగా 'రెండు వందలు' నీలవేణి అన్నయ్యకు సమర్పించటం మొదటి షరతు. ఇహ ముందు ఇటు వంటి పనులు చేయకుండా ఉండటానికిగాను, శాశ్వితంగా జ్ఞాపకం ఉండేటట్లు కథా నాయకుడు రామ్మూర్తి.........మూడుసార్లు అందరి సమక్షంలో ముక్కు నేలకేసి రాయటం—రెండవ షరతు

రామ్మూర్తి వీటికి ఒప్పుకోలేదు. 'మాది అమర ప్రేమ'—ఈ అడ్డు గోడలను తుత్తునియలు చేస్తా నన్నాడు! 'నాయనా! రామూర్తీ! అడ్డు గోడలమాటేమోగానీ, నీ వీపును ఆ వస్తాదు తుత్తునియలు చేయగలడు. తస్మాతే! జాగ్రత్త!' అని బెదిరించినప్పటికిని, బెదరలేదు సరిగదా రెచ్చిపోయి సంధి—సంప్రదింపులకు వెళ్ళిన వాముందు స్వైర విహారం చేయటం మొదలెట్టాడు. ఇహ ఇది లాభం లేదనుకొని రామూర్తిని బజారు మిషతో బయటకు తీసుకొని రాగానే—'నీలవేణి అన్నయ్య' అమాంతంగా పట్టుకొని రెండు చరుపులు చరిచాడు!...... రామ్మూర్తి మాట్లాడలేదు కొంచెంసేపు దిమ్మెరపోయి—తెలివి తెచ్చుకొని 'ఏమిటిది? నేనేం చేశాను? అయినా ఇందుమీదట నాకీ ప్రేమ శాశ్వితం గాదని తెల్సింది. అంతా మిధ్య! (నీలవేణి అన్నయ్య దెబ్బలు తప్ప). మానవునకు ముక్తి ప్రసాదించేది వేదాంతమే!' అని తను యట పారేసిన వేదాంత గ్రంధాలను దులిపి తెచ్చుకొని బీరువాలో పదిలంగా పెట్టుకొని కొన్ని సవరణలతో ఆ రెండు షరతులను ఆమోదించాడు.

సుబ్బిగాడూ, రమణా చూస్తుండగా రామ్మూర్తి ముక్కు నేలకేసి రాయటం 'ప్రిస్టేజి క్వొష్చను'గా భావించాడు. గాబట్టి, ఎవరూ లేకుండా వాడు సరిగ్గా నేలకేసి రాశాడా లేదా చూడటంకోసం నేను 'జడ్జి'గా వ్యవహరించాలి!

# ప్రేమాయణంలో...

25—వ పేజీ తరువాయి

ప్రస్తుతం రెండు వందలు ఒకేసారి ఇవ్వాలంటే కష్టం కాబట్టి......వాయిదాల పద్ధతి మీద చెల్లించబడ్తాయి! మొదటి వాయిదాకు ఇంకా మనిఆర్డరు ఇంటి దగ్గర్నుంచి రాలేదు కాబట్టి, రామ్మూర్తి దగ్గరున్న వేదాంత గ్రంథాల్లోంచి రెండింటిని మాత్రమే అమ్మి, వచ్చిన డబ్బుతో 'ఉపాహారశాల'లో మిత్ర మండలిని సంతృప్తి పరిచి, డబ్బులు వచ్చిన తరువాత వాయిదా చెల్లించడం!....... ఇవీ సవరణలు!

## రామ్మూర్తి

'అమర ప్రేమ'కు పరాజయము తప్పదు! ప్రేమ మాట దేవుడెరుగుకానీ, ముక్కు నేలకేసి వ్రాయాల్సి వచ్చెగదా!. .....అటు చూద్దామా ప్రేయసి నీలవేణి నే నెవరో తెలియనట్లే నటిస్తున్నది ......అయినా ఇంకెంత కాలం ఈ నటన? ఉత్తరాల్లో ప్రేమను అఘోరించడమే తప్ప ఎదురుగ్గా మాట్లాడితేనా?

—నీలవేణి అన్నయ్య జ్ఞాపకం వచ్చినప్పుడల్లా చలి జ్వరం వస్తున్నది! అయినా మరీ మనుష్యులకు అంత పొడుగు మీసాలెందుకు? చూడ

"నే చేసే కర్మలో సగం దుబారా అని ఒప్పుకుంటా," అన్నాడు సీతారామయ్యగారు. "కాని ఏ సగమో తెలియక చస్తున్నా!"

కె. వి. ఎన్ (చీరాల)

పోతే వాడి శరీరంలో కండలు లేనట్లున్నది .....ఇనుప ముక్కలు. వాడు చరిచిన రెండు చరుపులు .. అబ్బ! అమ్మోరు జ్ఞాపకం వచ్చింది. అయినా మరీ అంత పెడసరంగా అట్లా గుద్దడ మేమిటి? దడుచుకున్న వాళ్ళను వీపు చరిచినట్లు? ప్రేమ మాట దేవు డెరుగుగాని, కొంకులు విరిగాయి! ఆపైన రెండు వందలతోపాటు నీలవేణికి పంపిన మూడు పచ్చ నోట్లు గాలికి ఎగిరి పోయాయి.

## కథకుడు

అనుకున్న ప్రకారంగా రామ్మూర్తి నీలవేణి అన్నయ్య ముందు ముక్కునేలకేసి మూడుసార్లు రాసాడు. రమణగాడికి బుద్ధిలేదు—బడాయి గాకపోతే, రామ్మూర్తి ముక్కు నేలకేసి రాస్తుండగా చూసిన వాడు మెదలకుండా వూరుకుంటే ఏం? పెద్ద గొప్ప పని చేసిన వాడిలాగా కిటికీలోంచి తలకాయ కిరికించి 'అరేయ్! రామ్మూర్తీ నేను చూశాన్రోయ్!' అని అరుస్తాడూ!

*　　*　　*

## రామ్మూర్తి

నేను డైరీలో ఈ విధముగా వ్రాసుకుంటిని.

"ప్రేమ అనునది తాత్కాలిక సంఘటనలవల్ల జనించు ఉద్రేకము. దానికి రంగు, రుచి, వాసన ఇత్యాది లేవియును లేవు. ఎంత తెలివిగల మానవుడైనన్నూ, ప్రేమకు అతీతుడుగా వ్యవహరించలేడు. (ఉదా: నేను) అయినప్పటికిని ఈ కల్పిత ప్రపంచములో మోక్షమును సంపాదించుకొనుటకే ప్రయత్నించుట మంచిది.

నేను గ్రహించిన నీతి—'ప్రేమ' అను పదము జోలికి పోవుట ప్రమాదకరము. దానిని మన దగ్గరకు రాకుండానే నిర్మూలించుట మంచిది.

(నిరోధ మార్గము — బ్రహ్మచర్యమును కఠినముగా అవలంబించుట)

*　　*　　*

## కథకుడు

ఈ ప్రేమాయణం ముగిసిన పదిహేను రోజుల తర్వాత నాకు రమణగాడి దగ్గర్నుంచి ఒక కవరు అందులో నూటయాభై రూపాయలూ వచ్చాయి.

ఉత్తరం విప్పాను

'ఒరేయ్!

ఈ నూటయాభై ఉంచుకో! శ్రమకు తగ్గ ఫలం ముట్టిందనుకుంటా! నీ ముందుకువచ్చి జరిగిన సంగతి చెబుతే కాళ్లకుక్కవవుతావు! భయమేసి ఉత్తరంద్వారా విన్నవించుకుంటున్నా! ఈ సాయంత్రం నీ గదికి వచ్చినప్పుడు నన్ను తన్ననని సుబ్బాయితో చెప్పింపుతేనే వస్తా!

'నీలవేణి'కి, 'రామ్మూరి' అనే మానవుడు ప్రపంచంలో ఒక మూల నివసించడమే గాకుండా, తను చదువుతున్న కాలేజీలోనే చదువుతూ, తనను నిర్దాక్షిణ్యంగా ప్రేమిస్తున్నాడన్న సంగతి ఏమాత్రం తెలియదు. నీవు నమ్మవుగానీ, ఇది అబద్ధంలాంటి నిజం! అసలు నా ఉద్దేశ్యంలో ఆ అమ్మాయి కనీసం వీడ్ని చూసి అయినా ఉండదు!

.. ....కోపగించుకోకు! మన సుబ్బాయిలేడూ? నే నెంత వద్దని చెప్పినా వినిపించుకోకుండా ఈ నాటకం నాచేత ఆడించాడు. రామూర్తి, ఆ అమ్మాయిని చూసి, తక్షణం ప్రేమించిన నాటి రాత్రి నా దగ్గరకువచ్చి, ఆ అమ్మాయిని చూసిందగ్గర్నుంచి మనసులో మనసు లేదని వాపోయాడు. రామూర్తి వాలకాన్ని చూసి, సరదాగా నాటకాన్ని ఆడాలనుకొని (సుబ్బిగాడి బలవంతం వలన) రెండోరోజు ఒక ఉత్తరాన్ని వ్రాసి టెన్నీసు బంతులు ఇచ్చే కుర్రాడికిచ్చి, రామ్మూర్తి కిమ్మని పంపించాము. (సరదాగా అందులో డబ్బులు గూడా పంపమని వ్రాశామనుకో) అసలు మా ఉద్దేశ్యం అంతటితో ఈ రామాయణం ఆగుతుందని! కానీ, మన రామూర్తి దానికి జవాబివ్వటమే గాకుండా, రూపాయలు గూడా పంపించాడు. . ...ఇహ అక్కడినుంచి సాగాయి.. ఉత్తరంమీద ఉత్తరం, దానిమీద ఇంకో ఉత్తరం దానిపైన ఇంకోటి—మంహాటి!......అదొక పెద్ద ఉత్తరా(మా)యణం ..... అయి ఈ ప్రేమాయణాన్ని ఎట్లా ముగించాల్నో బోధపడక, ఇంకొన్ని రోజులు గడుస్తే, ఈ సంగతి అసలు నీలవేణికి తెల్సి, రసాభాసాయణం అవుతుందేమోననే భయంతో, చివరి రంగానికి నాందీ పల్కటానికి, నీలవేణి అన్నయ్యను హనుమాన్ వ్యాయామ కళాశాలలో రోజుకు అయిదు రూపాయల చొప్పున బేరమాడి రంగంలోకి వదిలిపెట్టాం. మన అమాయిక చక్రవర్తి వాడి కండలనుచూసి ఆవలించి 'ఆ! నాకెందుకులే ఈ ప్రేమ!' అని రెండు వందలు సమర్పించి ముక్కు నేలకేసి రాసి నిష్క్రమించాడు, ప్రేమాయణంనుంచి"

# కల్యాణ కింకిణి

37— పేజీ తరువాయి

నా ప్రాణాలన్నీ అక్కడే ఉంటాయి. వాడు నాకు శిష్యుడు. నాకు పెళ్ళై పదిహేనేళ్ళు కావస్తున్నాయి. అప్పటికి నాగరాజు పన్నెండేళ్ళయినా నిండని కుర్ర కుంక. సెకండ్ ఫారం కాబోలు చదువుకుంటున్నాడు. పెళ్ళి పందిరిలో తారాడుతుంటే వినోదం చూచిపోవడానికి వచ్చాడేమో ననుకున్నాను దివి దేవావసు—వివాహ ముహూర్త కాలమందు పెళ్ళి కుమారుడికి నాగరాజు చదివించింది నీలి రంగు ఓ ఫౌంటెన్ పేనా అన్నాడు పురోహితుడు ఇదిగో అదే ఈ కలం! నాటికీ నేటికీ అలాగేవుంది దీనితో ఎన్ని పుస్తకాలు వ్రాశాను. ఎన్నిసార్లు జీతం తీసుకుంటూ, రివిన్యూ స్టాంపులమీద సంతకాలు చేశాను... .."

ఈసారి సచ్చిదానందంగారి కళ్ళల్లో ఆనంద బాష్పాలను చూచాను.

*   *   *

జరుగుతున్నది పెళ్ళిళ్ళ సీజను. రోడ్డులో బస్సులు దొరుకుతాయన్న పూచీ చాలా తక్కువ. సాయంత్రం వరకూ బడిగాపులు పడిన తర్వాత అదృష్టంకొద్దీ ఓ బస్సులో సీటు దొరికింది.

పరుగెడుతున్న బస్సు ఆలోచనా ప్రపంచంలో విహరించడానికి అనువైన చోటు. నా ఆలోచనలన్నీ నాగరాజు జీవితాకాశంలో పతంగాల్లా విహరిస్తున్నాయి.

నాగరాజు సంపన్న కుటుంబంలో పుట్టాడు. కానీ, కేవలం సంపదనే తులామానంగా తీసుకుని తోడి వారితో సంబంధాలు నెలకొల్పుకునే మానవతా దారిద్ర్యానికి అతడు దూరంగా పెరిగాడు. వెయ్యి గ్రంథాలు సమకూర్చి వాటిని, చదువుకుంటూ ఎడారిలో కూర్చోమంటే కూర్చోడం తన చేత గాదనీ, మూర్ఖులైనా, క్రూరులైనా, మరెలాంటి వారైనా మానవులతో సాహచర్యమే తనకు కావలిసిందనీ ఓ కవి వ్రాకుచ్చాడు. కవులు సృష్టించే కథల్లో కావ్యాల్లో మాత్రమేగాదు—భగవంతుని సృష్టికే మకుటాయమానమైనవాడు మానవుడు ఈ విలువను పుట్టుగుబాలతోనే ఒంట బట్టించుకున్న వాడిలా కనిపిస్తాడు నాగరాజు.

మార్గమధ్యంలో ఎక్కడైనా నాగరాజు తారసిల్లితే—ఇక ముందుకు సాగడం రెండు మూడు గంటలపాటు వాయిదా పడినట్టే! "ఏమండీ! రాజశేఖరంగారూ! ఎప్పుడొచ్చారు వూరినుంచి! వదినగారు బాగున్నారా! పాపాయికి మాటలొచ్చాయా! రండి రండి అలా హోటల్లోకి వెళ్ళి కూర్చుందాం" అంటాడు నాగరాజు.

హోటలు వైపు వెళ్తుండగా మళ్ళీ కబుర్ల పరంపర ప్రారంభం.

"మన కృష్ణమూర్తికి ప్రమోషన్ వొచ్చింది తెలుసా మీకు! గొప్పగా పార్టీ ఇచ్చాడు. చీటీ వ్రాసి మీకు బస్సులో పంపుదామనుకున్నాం. బస్‌స్టాండులోకి వచ్చేసరికి బస్సు వెళ్ళిపోయింది .."

ఓహో అలాగా — అనడానికైనా తెరపినివ్వడు నాగరాజు.

"అన్నట్టు ఈ రోజు గోపాలం రేడియోలో పాడుతున్నాడండీ రాజశేఖరంగారూ! ఇవాళ ఇక్కడే వుంటారుగదూ! తప్పకుండా వినాలి మనం! ...."

రేడియో గాయకుణ్ణి గురించి ప్రస్తావించాడా



# కల్యాణ కింకిణి

అంతలో హోటలు సర్వరు ఆవైపోస్తే అతడి నైనా పలకరించకుండా వదిలి పెట్టడు నాగరాజు—"ఏమిటోయ్ అరుణాచలం! రాత్రి సెకండ్ షో మత్తు ఇంకా వదల్లేదేమిటి? పగటివేళ హోటల్లో ఇలా కనిపిస్తాడు గదండీ రాజశేఖరంగారూ! రాత్రి తొమ్మిది గంటలకు శుభ్రంగా స్నానం చేసి, తెల్లగా డ్రెస్ చేసుకుని వీధంట వెళ్తుంటే పిల్ల జమీందారులా ఉంటాడు. చూడ్డాని కింకా పాతికేళ్ళయినా వచ్చినట్టు లేదు గానీండీ, అరుణాచలాని కప్పుడే నాలుగో తరగతి చదువుకుంటున్న కూతురుంది. స్కూలునుంచి ప్రతిరోజూ మా ఇంటి ముందరగానే వెళ్తుంది — ఏమమ్మా దేవకీ! మసాలాదోసె చేస్తావా, లేడీ డాక్టరు వౌతావా అంటే తుర్రున కందిరీగలా పారిపోవడమే!"

ప్రవహించినంతవరకూ భూమిని సస్య శ్యామలం చేసుకుంటూ వెళ్ళే నదీమతల్లిలా మానవుడు నడిచినంత మేరకూ ఆనంద కాంతుల్ని వెదజల్లగలిగితే ఎంత బాగుండును! అది నూటికి కోటికి ఒక్కరి పట్ల మాత్రమే సార్థకమయ్యే మధురమైన వూహ!

నాగరాజును గురించి మిత్ర మండలిలో ఓ ఛలోక్తి వుంది. నాగరాజు ఎక్కడున్నాడని వితర్కించవలసిన అవసరమే లేదట! ఎక్కడైతే సన్నాయి మేళం వినిపిస్తుందో అక్కడ నాగరాజు తప్పకుండా ప్రత్యక్షవౌతాడుట! ఆ మాట నిజమే! పప్పు లేకపోయినా మానె—నాగరాజులాంటి వాళ్ళు ఒక రిద్దరు లేకపోతే వివాహ మహోత్సవాలవల్ల లభించ వలసినంత ఆనందం లభించదేమోనని పిస్తుంది. పెళ్ళిలో నాగరాజు కీపని చేత కాను ఇది చేతగాదు— అని చెప్పడానికి వీలుండదు. పెట్రమాక్సు లైట్లు ముట్టించడమా! వగ్గాలతో అండాలు దించి గంతల్లోకి గంజిని వార్చడమా! అన్నాలను చాపలమీద ఆరబోయడమా! బంతికి వడ్డించడమా! చేసిన భోజనాలైపోతే—'ఉండండుండండి బాబూ! ఎసురు సలసల కాగిపోతోంది. బియ్యంవేస్తే అయిదు నిముషాల్లో అన్నమైపోయినట్టే! కొంచెం తాళుకోవాలి' అంటూ ఇంకా భోజనం చేయని వాళ్ళని సముదాయించడమా! అన్ని పనులూ అయిన తర్వాత పెళ్ళి మంటపం ఎదుట మొదటివరుసలో కూర్చుని "ఆడవాళ్ళు అంతరిక్షంలో విమానాలు నడుపుతున్న కాలం! పెళ్ళి కూతుర్లు యిలా సిగ్గు పడగూడదు......" అంటూ సరసోక్తులు విసరడమా!......'ఎవరీ అబ్బాయి మగ పెళ్ళివారి మనిషా? ఆడ పెళ్ళివారి చుట్టమా!' అన్నది తరచుగా పెళ్ళి పందిరి క్రింద ఉద్భవించే సందేహం! నాగరాజును ఒక పక్షానికి చెందిన వాడి క్రింద లెక్కించడం అన్యాయం! అతడు మానవుల కందరికీ సంబంధించినవాడు. వసుధైక కుటుంబంలో ఉండదగినవాడు.

నాగరాజుకు సంబంధించి లోకంలో ఒక ప్రశ్న కూడా కద్దు! అతడు గుణవంతుడు. విద్యావంతుడు. స్ఫురద్రూపి. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. కానీ, అతడి కింకా పెళ్ళి కాలేదు. ఎందుకు కాలేదు?

"నాగరాజుకేమండీ! అమ్మాయి పుట్టి పెరుగుతోంది. ఎవరో కాదు. స్వయానా మేనమామ కూతురు. తలచుకుంటే పెళ్ళి. ఎందుకో తలచుకోడంలేదు, అతను......" అంటూ నాగరాజు

పెళ్ళిని గురించి నలుగురూ అనుకోడం గూడా ఈనాటి మాటగాదు.

నిజమే! నాగరాజు కెప్పుడో పెళ్ళి కావలిసింది. అతడి వివాహానికి ఒక్క విధి విధానం మాత్రమే ప్రతిబంధకమై నిలిచింది.

నాగరాజు తండ్రి పుట్టడమే రైతు కుటుంబం లోనే పుట్టాడు. కానీ, ఆయన తన అదృష్టాన్ని వ్యవసాయంలోగాక, వ్యాపారంలో పరీక్షించుకో దలచుకున్నాడు. ఆ వ్యాపారం గూడా లారీల పైన భారీ వ్యాపారమే ప్రారంభించాడు. వచ్చే లారీలు వస్తుండగా, వెళ్ళేవి వెళ్తుండగా అప్పటి కప్పుడు లాభ నష్టాలు అంతుదేలని ఆ వ్యాపార వృత్తిలో ఆయన పదేళ్ళపాటు ఇంటిని నిత్య కల్యాణం, పచ్చ తోరణం చేశాడు. ఆ పదేళ్ళ చివర ఇంటర్మీడి యట్ పరీక్షలు వ్రాసి, ఇంటికి వచ్చిన నాగరాజుకు పట్టెమంచంపైన పడుకుని గాఢాలోచనా నిమగ్ను డైన తండ్రి కనిపించాడు వ్యాపారం మునుపటిలా లా ముమ్మరంగా జరగడం లేదేమని నాగరాజు తల్లిని ప్రశ్నించాడు. వాకబు చేయగా తెలిసిన వివరాలవల్ల కుటుంబానికి తగిలిన దెబ్బ సామాన్య మైనది గాదనీ, ఆ దెబ్బనుంచి ఇక కోలుకోడం దుస్తరమనీ గ్రహించ గలిగాడు నాగరాజు.

వ్యాపారంలో పదేళ్ళుగా వచ్చిన లాభం కుటుంబ ఖర్చులకే దఖలు పడగా, వచ్చిన నష్టం మాత్రం నాలుగంకెల పెద్ద సంఖ్యలో భీకరంగా కనిపిస్తోంది. ఉన్న భూస్థితిలో సగం ముప్పాతిక వంతయినా తెగ నమ్మితేగానీ, అప్పులు తీరవు. అందుకు నాగ రాజు పెద్దగా దిగులు పడిపోలేదు. కానీ, కష్టాలు ఒంటరిగా వచ్చాయిగావు. చేజేతులా తాను కుటుం బానికి తెచ్చుకున్న దుష్పరిణామాన్ని గురించి చింతించి, చింతించి నాగరాజు తండ్రి తీరని మనో వ్యాధికి లోనయ్యాడు. ఆ మనోవ్యాధి శారీరక మైన జబ్బులు పెక్కింటికి దారి తీసింది. తండ్రిని అందుబాటులోవున్న వైద్యశాల లన్నింటికీ త్రిప్పిం చాడు నాగరాజు. పేరెన్నికగన్న డాక్టర్ల కందరికీ చూపించాడు. తండ్రి జబ్బుతో తీసుకున్న ఆ రెండేళ్ళలో నాగరాజు చిక్కి సగమై పోయాడు. కానీ, అతడి శ్రమకు ఫలితం దక్కిందిగాదు. తండ్రి శాశ్వతంగా కళ్ళు మూశాడు.

నాగరాజు కుటుంబం చితికిపోయిందన్న వృత్తాం తం తేట తెల్లంగా లోకులకు తెలిసిపోయింది. మేనమామ తన కూతురును నాగరాజు కివ్వడం లేదు పొమ్మన్నాడు.

గోరుచుట్టుపై ఈ రోకలి పోటువల్ల నాగరాజు హృదయం ఎంతగా గాయపడిందో ఎవ్వరికి తెలుసు? అతడు కష్టాల గరళాన్ని దిగ్రమింగాడు. కానున్నది కాక మానదన్న కృత నిశ్చయంతో సంసార నౌక నౌక సురక్షిత మార్గానికి పట్టించే ప్రయత్నంలో లీనమయ్యాడు.

నాగరాజుకు చేతి కెదిగి వచ్చిన తమ్ముళ్ళిద్ద రున్నారు. ఋణపు తిండి తినకుండా వాళ్ళూ ప్రయోజకులై ఉద్యోగాల్లోచేరి ఎంతో కొంత సంపాదిస్తున్నారు. నెలసరి ఆదాయంలో ఎంత వరకూ మిగిలించవచ్చునో అంతా మిగిలించి అప్పుల పరిమాణాన్ని అంత కంతకూ తగ్గించుకున్నాడు నాగరాజు.

ఎప్పుడైనా పెళ్ళిని గురించి ప్రస్తావిస్తే, "నా కింకా ఏం పెళ్ళండీ రాజశేఖరంగారూ! పెళ్ళి వయసు మీరిపోతుంది నాకు. తమ్ముళ్ళు ఒక ఇంటి వాళ్ళయితే నా కంతే చాలు! ప్రపంచంలో పుట్టిన వాళ్ళందరూ పెళ్ళి చేసుకుని తీరాలన్న నిర్బంధ మేముంది? మానేస్తేనే మంచిదేమో! సంతాన నియంత్రణకు దోహదం చేసినట్టయినా అవు తుంది........" అనేవాడు నాగరాజు.

కానీ నిజాని కది నాగరాజు అంతరంగంలోని ఆంతర్యంకాదు. అతడాదినుంచీ మేనమామ కూతు రినే అర్ధాంగిగా భావించాడు. ఆ భావనను త్రోసి రాజని ఇప్పుడా స్థానంలో మరొకరిని నిలుపుకో లేడు. బ్రతక నేర్చివాళ్ళు కొత్త కొత్త మార్పులతో, చేర్పులతో తమ ఆదర్శాలను సవరించుకుంటారు. మరికొందరు బ్రతుకేమైనా ఆదర్శాలకే అంటి పెట్టుకుంటారు. రెండో తరహా మనిషి నాగరాజు.

నాగరాజు కిక పెళ్ళవుతుందా కాదా అన్న సందిగ్ధ పరిస్థితి అలాగే కొనసాగుతుండగా నాలుగైదేళ్ళు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

ఈ చివరినుంచి నాగరాజు ఏ సమస్యకైతే పరి ష్కారం సాధించలేకపోయాడో, ఆ సమస్యా పరి ష్కారం ఆ చివరనుంచి సాధించబడింది. మేన మామ కూతురు వూరుకున్నంత కాలం వూరుకొని, తండ్రి తీరా ఒక సంబంధాన్ని నిశ్చయించబోతున్నా డనగా 'నేను బావనైతే చేసుకుంటాను. లేదా బావో సయ్యో చూసుకుంటాను' అని నిషధేశుణ్ణి వలచిన వైదర్భిలా తన నిర్ణయాన్ని తేల్చి చెప్పింది.

మేనమామ రాజీకి దిగిరాక తప్పిందిగాదు.

యుక్త వయస్కుడైన ప్రతి యువకుణ్ణీ "ఇంకా వూరుకున్నా వెందుకు బాబూ! నాలుగు నూకలు తలపైన వేసుకోగూడదూ" అంటూ పలకరిస్తుంది లోకం. మాటకేం భాగ్యం! చిటి కెలో చెప్పి ముగించవచ్చు. కానీ, కాలం కలిసి రావద్దూ!

* * *

వీధుల్లో విద్యుద్దీపాలు వెలిగేసరికి బస్సు గమ్యస్థానం చేరుకుంది. బస్సుదిగి పట్టణంలో అడుగు పెట్టాను. పట్టణం పట్టణంలా లేదు. సింహగర్జన విన్న తర్వాత కలగుండుపడి సాధు జంతువులు చెల్లాచెదరై పోతున్న అరణ్యంలా, తీరస్థ పర్వతంనుంచి ఓ రాతిగుండు జారిలో దొర్లి అలలతో దబకలెత్తి పోతున్న సరోవరంలా ఎక్స్‌ప్రెస్ రైలు బండి స్టేషనులో ఆగగానే సందడితో నిండిపోయిన ప్లాట్‌ఫారంలా అన్ని గందరగోళాలకు ఆటపట్టుగావుంది పట్టణం.

అప్పుడా నగరంలో ఉప ఎన్నికలు జరుగు తున్నాయి.

ఎన్నికలు కరువులాంటివైతే ఆ కరువుకు సంభ వించిన అధిక మాసంలాంటివి ఉపఎన్నికలు. కరువు తాలూకు అరిష్టాలు అధిక మాసంలో ఎలాగైతే మరింత బాహాటంగా కనిపిస్తాయో, అలాగే ఎన్నికల బీభత్సం ఉపఎన్నికల్లో తారస్థాయిని అందు కుంటుంది. రంగు రంగుల అక్షరాలతో, రకరకాల వాల్ పోస్టర్లతో దిష్టి బొమ్మలకన్నా వికృతంగా కనిపించే గోడలు, మునిగిపోబోతున్నది అచ్చంగా తమ పుట్టే అయినట్టు ఏ రోడ్ల కూడలిలో చూచినా గుంపులు గుంపులుగా చేరి మాట్లాడు కునే మనుషులు. ఉపన్యాసాలకు వచ్చి పుణ్యం గట్టుకోమని గొంతు చించుకునే లౌడ్‌స్పీకర్లు వూరిలో మనుషులకు, వూరిలో పలు గోడలకు చివరకు ఇళ్ళలోదూరి గడియ వేసుకున్న ఆడ వాళ్ళకు రక్షణలేని దినాలు. ఆ నియోజకవర్గంలో ఓటు లేకపోతే మాత్రమే నువ్వు బ్రతికి బయట పడగలవు. ఓటు వుంటే. నీ పాట్లు భగవంతుడే విచారిస్తాడు!

దీపావళి పండుగలప్పుడు రేయింబవళ్ళు నిద్రా హారాలు లేకుండా పని చేసేవి టపాకాయల దుకా ణాలు. ఎన్నికల్లో అలాంటివి ముద్రణాలయాలు. తెలిసిన ముద్రణాలయాల కన్నింటికి తిరిగి చూచాను. తెలియడమనగా నగరంలో వాటి ఉనికి గుర్తించి తెలియడ మన్నమాట! దురదృష్టవశాత్తు ప్రెస్ మేనేజర్లతో నాకు పరిచయాలులేవు. వరుసగా నాలుగైదు ప్రెస్సులకు వెళ్ళాను. వెళ్ళినవాణ్ణి వెళ్ళినట్టే తిరిగిరాక తప్పిందిగాదు. పాపం, వాళ్ళుమాత్రం ఏం చేస్తారు! ఆ సందర్భం అలాం టిది. పనిచేసి పెట్టకపోతే మానె, మనసుమ స్థిమి



తంగా ఉంచుకుని నాలుగు మంచి మాటలు చెప్పి వంపేగల స్థితిలో వాళ్ళు లేరు.

తెలిసిన ప్రెస్సుల్లో ఇంకా మిగిలి ఉన్నది ఒక్కటి మాత్రమే! ఎట్టి పరిస్థితిలోనైనా శారదా ముద్రణాలయం కష్టమర్లను తోలగ దోసుకోదని ప్రతీతి. ఎనిమిది గంటల సైరను మ్రోగుతుండగా ఆ ప్రెస్సులో ప్రవేశించాను. సింహద్వారం దాటుకోగానే ఆఫీసు రూము. కుర్చీలో వున్న మనిషిని సైతం పైకి కనిపించ నివ్వకుండా ఆ గదిలోని టేబిలుపైన దొంతర్లు దొంతర్లుగా పేరుకున్న కాగితాల కట్టలు.

ద్వారం దగ్గర నా నీడ కనిపించిందేమో, కుర్చీలో వున్న మనిషి ఉలికి పడ్డాడు. అంతలో తెప్పరిల్లుకుని "సైకిలు పార్టీ వాళ్ళటండీ?" అన్నాడు.

"అబ్బే, పార్టీల మనిషిని కానండీ! వేరే పనుండి వచ్చాను" అంటూ కుర్చీలో కూర్చున్నాను.

"వెయ్యి నమస్కారాలు బాబూ! ఉన్న పని పూర్తి చేయడానికే వూపిరి పోతుంది మాకు! రేపు సాయంకాలం నాలుగ్గు గంటలకు మూడువేలు కరపత్రాలకు పూచీ పడి ఉన్నాను. కంపోజిటర్లు ఇప్పుడే భోజనాలకు వెళ్ళారు. తిరిగి వస్తే వాళ్ళకు పని అప్పగించి నేను భోజనానికి వెళ్దామనుకుంటున్నాను. ఎంత అర్జంటు పని ఉన్నా పది హేను రోజులు ఓపిక పట్టాలి మీరు......"

"మీరు పదిహేను రోజులంటున్నారు. పదిహేను గంటల తర్వాత నేనీ పనికి పూసుకోవలసిన అవసరమే ఉండదు......"

"బాబ్బాబూ! మీ కింతకంటే చెప్పలేను. ప్రూఫు చేతికొచ్చి అరగంటయింది. కరెక్టు చేస్తున్నాను చూచారూ, ఇంకా చేట భారతమంత మిగిలి వుంది......"

"ఆ పనితో పోల్చి చూస్తే నాది చాలా చిన్న పని. మీరు తలచుకుంటే అరగంటలో ముగించవచ్చు ..."

"హరేరాం! ఎలా నచ్చచెబుతానండీ మీకు! ఏ ఒట్టు పడితే ఆ ఒట్టు. మీతో మాట్లాడ డానికైనా ఓపికలేదు. నాకు.. ..." మూఢ మానవుల ఎదుట మౌనమే శరణ్య మనుకున్నాడేమో, ఆయన తలవంచుకుని తన పని తాను చేసుక పోసాగాడు.

పది నిమిషాలు అక్కడే కూర్చున్నాను. అలా ఎంతసేపు కూర్చున్నా లాభం లేదనిపించింది. లేచి మెల్లగా బయటికి వచ్చేశాను.

గంట తొమ్మిది కావస్తోంది.

రుసుము చెల్లించుకుంటే హోటళ్ళలో అన్నదానాలు అవ్వారిగా జరిగే వేళ. హోటల్లోకి వెళ్ళి తిన్న శాస్త్రం ముగించాను చెడిన వ్రతం ఎలాగూ చెడింది. మరేదైనా కానుక కొనుక్కోవాలన్నా ఈ పాటికి బజార్లలో అంగళ్ళు కట్టేసి ఉంటారు. హోటలుకు లసతి దూరంలోనే సినిమా థియేటరు. వెళ్ళి కూర్చుంటే కాలమైనా గడుస్తుంది.

థియేటర్లో చిన్ననాడు హైస్కూల్లో కలిసి చదువుకున్న మిత్రు డొకడు కనిపించాడు. అల నాటి బాల్య స్మృతుల్ని, ఇటీవలి జీవితానుభవాల్ని ఏకరువు పెడుతూ, అతడు సినిమా వదిలి పెట్టిన తర్వాత నన్ను తన ఇంటికే తీసుకెళ్ళాడు. అప్పుడిక నిద్రపోవడానికి ప్రయత్నిస్తే ఉదయం ఎనిమిది గంటలకుగానీ నాకు మెలకువ రాకపోవచ్చు. అందు

# కల్యాణానికి కిటుకు

కని ఏదో పుస్తకం చదువుకుంటూ వాలుకుర్చీలో కూర్చున్నాను. ఎంతగా ప్రతిఘటించాలన్నా తెల్లవారుజామున నిద్రా దేవత బారినుంచి తప్పించు కోడం కష్టం. ఎప్పుడు కునుకు పట్టిందో తెలియదు. నిద్ర లేచేసరికి భళ్ళున తెల్లవారిపోయింది.

ఆరున్నర గంటలకే శుభ ముహూర్తం!

ఆదరా బాదరాగా ముఖం కడుక్కొని వీధిలోకి వచ్చాను. పెళ్ళి జరుగుతున్న సత్రం అక్కడికి అరమైలు దూరంలోవుంది. అల్లంత దూరంలో ఉండగానే నాదస్వరం వినిపించింది. సత్రం ముంగిటకు వెళ్ళి, పచ్చని కొబ్బరి మట్టల పచ్చి తాటాకులు సుస్వాగత మిస్తున్న పందిరి క్రింద నిల్చున్నాను. ద్వారం దాకా కిటకిట లాడిపోతున్న జన సమూహం పైనుంచి లోపలికి చూడ్డానికి ప్రయత్నిస్తున్నాను. అంతలో నాదస్వరం ఆగిపోయింది. మైక్ ముందు ఎవరో గొంతు సవరించుకుంటున్నారు.

ఎదురు చూడని విచిత్ర సంఘటన ఏదైతే వుందో, దాన్ని అద్భుతంగా పేర్కొనవచ్చు. ఆ

"మీతో చక్కని కానుక" అంది భార్య రామారావు గారితో.

"ఏమిటది?" అని అడిగాడు రా. రా. గారు.

"ఒక్క నిముషంలో కట్టుకొచ్చేస్తాను!" అన్నది ఆయన భార్య.

ఎ. వి. (మద్రాసు)

నిర్వచనాన్నిబట్టి చూస్తే, ఆ క్షణాన నా కెదురైంది అక్షరాలా అద్భుతమే! మైకులో పద్య పఠనం ప్రారంభమైంది—

"రాగ భరిత మనస్కుడు నాగరాజు
ప్రథిత గుణ గణ విభవాళి రామ—రాధ
పూను తావియు కలిసి పెంపొందినట్లు...."

కళ్ళకు గంతలు గట్టుకున్న గారడీవాడు—వ్రేలితో నిర్దేశించి చూపిన వస్తువుల పేర్లు చెప్పడం అందరికీ తెలిసిన విషయమే! కానీ ఎంతటి గారడీ వాడైనా నా జేబులోని కాగితంలోవున్న పద్యాలను ఎలా చదువ గలుగుతున్నాడు?—జేబులో ఆ కాగితం కోసం వెదికి చూచాను. నా ఆశ్చర్యం ద్విగుణీకృతమైంది. జేబులో ఆ కాగితం ఒక్కటి మాత్రం కనిపించడంలేదు!

జనంలోనుంచి దారి చేసుకుని హాల్లో నాలుగైదు బారల దూరం చొచ్చుకుని వెళ్ళాను.

ఎవరో నా భుజంపైన చేయి వేశారు.

"రాత్రి మా ప్రెస్సు కొచ్చింది మీరే గదండీ! ఏదో పరాకున జేబులోనుంచి కాగితంతీసి టేబిలు పైన ఉంచి, అలాగే మరచిపోయి వెళ్ళిపోయారు. తీరా మీరు వెళ్ళాక ఆ కాగితం తీసి చూద్దును గదా, అది నాగరాజు పెళ్ళికోసం వ్రాయించు

కొచ్చిన పద్య రత్నాలు! నాగరాజు కేదైనా పెళ్ళి కానుక ఇద్దామనుకుంటూ, ఈమధ్య వచ్చిపడిన గొడవల్లో ఆ సంగతే మరచిపోయాను. మీ కోరికా, నా ఆశయం ఒక దెబ్బతో నెరవేరే అవకాశం లభించింది. అన్ని పనులూ కొంత సేపలా అట్టే పెట్టమని, ఆ కాగితాన్ని ప్రెస్సు కిచ్చేశాను. అన్యథా భావించరుగదూ!"

"కావలసిన కార్యాన్ని గంధర్వులే తీరిస్తే ఇక అన్యథా భావించడ మెందుకు?" అన్నాను నవ్వుతూ.

లోపలి కొస్తున్న వాళ్ళ కందరికీ చోటిస్తూ నాగరాజు పెళ్ళికోసం పుష్పక విమానంలా తయారైన ఆ హాల్లో ఒకటి రెండు నిమిషాలు నిశ్చలంగా నిల్చున్నాను. రామాయణం కాలంనాటి పుష్పక విమానం చెరనుంచి విముక్తి పొందిన సీతాదేవిని అయోధ్యా నగరానికి తీసుకపోవడానికి ఉపకరించింది. హృదయంలో బంగారు పీట వేసుకుని తన కోసం ఎదురు తెన్నులుచూస్తూ, కాచుకుని కూర్చున్న అమ్మాయిని ఇన్నాళ్ళ కిన్నాళ్ళకు చేబట్ట గలుగుతున్నాడు నాగరాజు. పీటలపైన కూర్చున్న వధూవరులకేసి చూస్తున్న విస్ఫారిత నయనా లన్నింటిలోనూ ఆనందాశ్రువుల చెమ్మదనమే కనిపిస్తోంది.

ఓమూలనుంచి ఎవరో పిలిచారు.

"నిన్నేనయ్యా రాజశేఖరం! ఇదిగో—ఇక్కడున్నాను .. .."

ఆయన సచ్చిదానందంగారు!

"ఏమండీ మేష్టారుగారూ! రానన్నారే! ఎలా వచ్చేశారు?" అంటూ, ఆయనకు దగ్గరగా వెళ్ళాను

"నిన్న సాయంకాలం ఏడు ఏడున్న కల్లా అమ్మాయికి చెమటబట్టి జ్వరం వదిలింది డాక్టరు ఇక పరవాలే దన్నాడు. వెంటనే రోడ్డుపైకి వచ్చేశాను. అప్పటికి బస్సులన్నీ వచ్చేశాయి. ఓ లారీ శర వేగంతో దూసుకోస్తోంది. నిలిపాను. 'ఎక్కించుకోవయ్యా బాబూ! నువ్వెంత కావాలన్నా ముట్టచెబుతాను' అంటే డ్రయివరుససేమిరా వీల్లే దన్నాడు. 'వీలున్నా, లేకపోయినా నేను లారీలో ఎక్కక తప్పదు. నువ్వు నన్ను తీసుకెళ్ళి పట్టణంలో దిగవిడవక తప్పదు' అంటూ లారీలో కెక్కి కూర్చున్నాను. డ్రయివరు విస్మయపోయి ఇంతకూ అంత అర్జంటు పని ఏమిటి మహాప్రభో అని ప్రశ్నించాడు. వివరాలు చెప్పాను. చెప్పగా తెలిసిందిగదా రా జ శే ఖ రం! ఆ డ్రైవరు గూడా నాగరాజుకు పరిచితుడేనట! ఈ పెళ్ళికి హాజరు కావాలని ఏంథాటిగా విజయవాడనుంచి లారీని కొట్టుకొస్తున్నాడట! అదిగో, ఆ చివర నీలిరంగు చొక్కా తొడుక్కొని కూర్చున్నాడే అతడే లారీ డ్రయివరు అన్వరుస్సేన్........"

ఈసారి పెళ్ళి పీటలపైనుంచి నాగరాజే పలకరించాడు.

"రండి రండి రాజశేఖరంగారూ! ఎప్పుడొచ్చారు? నే నిక్కడ బంధితుడిలా కూర్చున్నా ననుకోండి—అయినా ఎవరెవరు ఎప్పుడొచ్చిందీ గమనిస్తూనే ఉన్నాను. మీరు 'బెటర్ లేట్ దేన్ నెవర్' అన్న సామెతను సార్థకం చేశారు....."

హోమ ధూమాని కావలి వైపున నాగరాజు పెదవులపైన విరిసిన చిరునవ్వు — సన్నగా జారుతున్న వాన తుంపరలోనుంచి ద్యోతకమయ్యే ఇంద్ర ధనుస్సులా భాసించింది!

"ఇది ఒక కథే," "కథకాని కథ" "జరగని కథ" చూసాక నా కథకు "నా కథ" అని పేరు పెట్టాను. నా కథ అంటే నా— కథ కాదు. నా కథ తాలూకు కథ.



# నా కథ

*ఎ.వి.కె

సరే, కథ రాద్దాం అనుకొన్నాను. వెనకటి కెవరో, ఒకాయన ఏ పనిచేసినా లాజిక్ ఉండాలని అన్నాడట. కథ రాయడానికి ఏం కావాలి? అనుకొన్నాను. ఆదిలోనే హంసపాదు అన్నట్టు, వెంటనే బుర్ర పనిచెయ్యనని సమ్మె కట్టింది. అదరా, బాదరాగా కథలు రాసి (ప్రచురించని (ప్రచురించనిది అతను కాదు— సంపాదకుడు) ఓ మిత్రుడి దగ్గరకు వెళ్ళాను వినయంగా నిల్చొని, వచ్చిన పని చెప్పాను.

నాతల నించి కాలిగోరుదాకా ఎగా దిగా చూశాడు. అతనితో పాటే నేను కూడా తల ఎత్తి, దించాను.

"కదలకుండా, నిల్చో! నేను అడిగిన ప్రశ్నలకి జవాబియ్యి" అన్నాడు.

"అలాగే" అన్నాను.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా నిల్చున్నాడు. ఉన్నట్టుండి పెర్రీమేసన్ లాగ కుడిచెయ్యి చూపుడు వేలు నావేపు చాచి గర్జించాడు.

"సిగరెట్ కాలుస్తావా?" అని.

లేదన్నాను.

"వక్కపొడి అలవాటుందా?"

"ఊహూ!"

"నాలుగు కప్పుల కాఫీ ఒక్కసారి తాగ గలవా?"

"అబ్బే!"

"అయితే పో, పారిపో, సిగరెట్లు కాల్చలేని వాడు వక్కపొడి నమలలేనివాడు, కాఫీ తాగలేని వాడు, రచయిత అవడు. నేను నిన్ను రచయితగా తయారు చేసినా, భగవంతుడు వూరుకోడు. వూరుకోడు" అన్నాడు సినిమా డైలాగులు వేస్తూ.

విచారంగా ఇంటి కొచ్చాను. నాకు కథలు రాసే యోగ్యత లేదన్నమాట. ఎలాగ అని ఆలోచించాను. మెరుపులాటి ఆలోచన తట్టింది. ఆఘాఘనే బజారుకు పరిగెత్తి దస్తా కాగితాలు, సెకండ్‌హేండ్ బుక్‌షాపులో ప్రఖ్యాత రచయితల పాత రచనలు పట్టుకొని వచ్చాను. ఆ పుస్తకాలు అన్నీ చదివాను. అన్నీ రకరకాలుగా ఉన్నాయి. పోనీ, ఒకే లాగ ఉంటే ఆ కిటుకు లేదిటో తెలుసుకో వచ్చనుకున్న నా ఆశ నిరాశ అయింది. మరో ఆలోచన తట్టింది. అదే "కథ చౌర్యం". అప్పట్లో ఆమాట నాకు అర్థం లేనిదిగా కన్పించింది. ఎందుకంటే నేను చదివే ప్రతీ పుస్తకం లోనూ "ఫలానా వారు మార్గదర్శకులు. వారికి కృతజ్ఞత" అని ఉండేది. నా కథకి కూడా అలాటిది రాద్దామనుకున్నాను.

వెంటనే నాకు వచ్చిన భాగాలు ప్రతీ పుస్తకం లోంచి, తీసి రాశాను. (అయితే పాత్రల పేర్లు మార్చాను). ఆ కొన్ని దస్తా కాగితాలు పూర్తయ్యాయి. కథ పూర్తయింది. దాన్ని "పెద్ద కథ" అనాలా, 'నవల' అనాలా అన్న సమస్య పట్టుకుంది. చివరికి ఆ బాధ్యత సంపాదకుడిదే అని వదిలేశాను.

మిత్రు లందరికీ చదివి వినిపించాను.

"బ్రహ్మాండంగా ఉందోయ్."

"జీనియస్. నువ్వు మాలో ఉండవలసిన వాడివి కాదురా (?)"

"నువ్వు బెంగాల్ దేశం వెళ్లిపోరా?"

"శరత్ మీకు దూరపు బంధువా?"

అని మనిషో రకంగా అన్నారు.

ప్రారంభంలోనే ఇంత గొప్ప కథ (నవల) రాసినందుకు టీపార్టీ ఇవ్వాలన్నారు.

సరే, కథ ఫెయిర్ చేశాను. పంపాను. అక్కడ్నించి ఒకటే నిరీక్షణ. రోజూ పోస్టుమేన్ కోసం ఎదురుచూసేవాడిని. తీరా నా కథ అచ్చవుతే నా కివ్వడేమో, అని ముందస్తుగానే వాడిని కాస్త తడిపాను. ఎవరో చెప్పారు. ప్రచురణ విషయం తెలియడానికి రెండు నెలలు పడుతుందని.

కాని, నెలరోజులు అవగానే, ఓ మంచిరోజున పోస్ట్‌మేన్ మందంగా హసిస్తూ వచ్చి, చేతిలో ఓ కవర్ పెట్టాడు. అది నేను పంపిన పత్రిక నించి వచ్చిందని కవర్‌మీద వారి స్టాంప్‌ను బట్టి తెలిసింది. పోస్ట్‌మేన్‌కి మామూలు (?) ఇచ్చేసి పంపేశాను. ఇక కవర్ విప్పకుండా ఆలోచించ సాగాను. లోపల విషయ మేమిటా అని. తట్టలేదు. ఇక సస్పెన్స్ భరించలేక కవర్ చింపి, లోపలి కాగితం విప్పాను.

"ఆర్యా!

మీరు పంపిన కథ అందింది. మీరు పత్రికలకి కథలు రాయడం మానేసి, సినిమాలకి కథలు రాయడం మంచిది. త్వరలోనే కీర్తీ, ధనమూ రెండూ వస్తాయి. మీ కథ సాధ్యమైనంత త్వరలో త్రిప్పి పంపగలము."

"సంపాదకుడు"

ఫలానాగారి వ్రాలు.

వెంటనే మూర్ఛపోయాను. తర్వాత మెల్లిగా లేచి, గ్లాసెడు మంచినీళ్లు తాగి తేరుకున్నాను. కొన్నాళ్లదాకా కథ రాద్దామన్న ఆలోచన అవతలకి నెట్టేశాను.

పత్రికలో వెలువడ్డ ప్రకటన చూచి, "కాబోయే కథకులకు పనికొచ్చే చిట్కాలు" తెప్పించాను. ఆరుద్రగారి కావ్యాలన్నిటినీ కంఠతా పెట్టేసాను. చిట్కాలన్నీ పట్టుపడ్డా యనిపించేకా, కథ రాయడానికి కూర్చున్నాను. కాగితాలు, కలం, వక్కపొడి దగ్గర పెట్టుకున్నాను. కథ రాద్దామంటే కథావస్తువు దొరకలేదు.

"కుక్కపిల్లా
అగ్గిపుల్లా
సబ్బుబిళ్లా
కాదేదీ కవిత కనర్హం."

అన్న శ్రీ శ్రీ వాక్యాలు గుర్తు కొచ్చాయి. కవిత కనర్హం ఏదీ కాదుకదా అని అగ్గిపుల్లమీద కథ రాద్దామనుకున్నాను. రెండు పేజీలు రాసేసాను. అంతా చదివితే కాంపోజిషన్‌లాగ అన్పించింది. వెంటనే చింపేసాను.

నా బాధ అంతా వెళ్లబోస్తూ, ఓ ప్రఖ్యాత రచయిత (పేరు అనవసరం) కి లేఖ రాసాను. ఆయన ఒప్పిగ్గా 'నా కథ' 'కథ' అంతా చదివి ఇలా సలహా యిచ్చాడు. "మీకు మీ కథే కథావస్తువు. అదే కథగా, కథే కథగా రాయండి." వెంటనే నా కథని "నా కథ" గా రాసాను. అదే యీ కథ.

("జరగని కథ" ద్వారా "నా కథ" కు మార్గం చూపిన మిత్రులు శ్రీ "లతిక" గారికి ఈ రచన అంకితం.) ★

# మీ పిల్లలకు దగ్గుగాని రొంపగాని వచ్చినప్పుడు

## నిజమైన స్వస్థత చేకూర్చుటకు



# సిరోలిన్ 'రోష్' ఇవ్వండి

మీ పిల్లలయొక్క దగ్గును రొంపను ఉపేక్షించకండి. శీఘ్రముగా నిరపాయముగా నిజమైన స్వస్థత చేకూర్చే సిరోలిన్ ఇవ్వండి. అది చాలా సౌమ్యముగా పనిచేయును. మీ బిడ్డలు దాని రుచికి యిష్టపడుదురు. సిరోలిన్ మీకు కూడ ఎంతో మంచిది. అది దగ్గును ఆపడమే కాకుండా దగ్గుకు మూలకారణమగు హానికరమైన సూక్ష్మ క్రిములను నశింపచేయును. సిరోలిన్ గొంతు నొప్పిని ఉపశమింపచేయును. కఫమును సులను పోగొట్టును, ఎంత బాధాకరమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత కలుగజేయును.

దగ్గు మరియు రొంపకు భారత దేశపు కుటుంబ ఔషధము




## మీ గృహమందు సిరోలిన్ తప్పక ఉంచుకొనండి

'రోష్' తయారు (సోల్ డిస్ట్రిబ్యూటర్సు: వాల్టాస్ లిమిటెడ్

వదభి(పాయం కలగవచ్చును. ఇటువంటి అమ్మాయి తనకు కోడలైతే బాగుండును అనే తలంపు ఆయనకు కలగాలి. కలుగుతుందనే నా నమ్మకం. ఆయన తలకాయలో ఆవిధంగా ఒకసారి తోచిందా, ఇక నువ్వు వద్దన్నప్పటికి సుగుణనే నీకు బలవంతంగా పెళ్ళి చేస్తారు" అన్నది శేఖరం తల్లి.

తల్లి చెప్పిన ఉపాయం శేఖరానికి బాగా నచ్చింది ఎగిరి ఒక్క గంతు వేశాడు. సుగుణతో పదిహేను రోజులు గడపవచ్చుననుకొన్నాడు. కాని, వెంటనే అతడికి ఒక సందేహం వచ్చింది.

"ఈ అమ్మాయి ఎవరు? మన ఇంటికి ఎందుకు వచ్చింది?" అని నాన్నగారు అడిగితే ఏమిటి చెప్తావ్" అని అడిగాడు.

"నా చిన్ననాటి స్నేహితురాలి కూతురని, పదిహేను రోజులు నా వద్ద వెళ్ళబుచ్చడానికి పంపమని వ్రాశానని చెప్తాను. కాని, సుగుణ వస్తుందా? తన తల్లి తండ్రులకు ఏమని చెప్తుంది? ఆ విషయం గురించి ఆలోచించు" అన్నది శేఖరం తల్లి.

"తప్పకుండా వస్తుంది. ఒక స్నేహితురాలు శలవుల్లో పదిహేను రోజులు సరదాగా కలిసి ఉండవచ్చునని, రమ్మని ఉత్తరం వ్రాసిందని సుగుణను చెప్పమని వ్రాస్తాను. ఆమె తల్లి తండ్రులు అభ్యంతరం చెప్పరు" అన్నాడు శేఖరం.

"ఇంతవరకు బాగానే ఉన్నది. కాని, ఇంకొక్క షరతు ఉన్నది. ఆ పదిహేను రోజులు నువ్వు మాత్రం ఇక్కడ ఉండడానికి వీల్లేదు. ఏ వూరైనా పోవాలి" అన్నది తల్లి.

"మళ్ళీ ఇదేమిటే అమ్మా" అన్నాడు శేఖరం వేల కూలిపోతూ.

"ఇదివరకు సుగుణని నువ్వు ఎరిగినట్టు మీ తండ్రికి ఎంతమాత్రం తెలియకూడదు. నువ్వు ఇక్కడ ఉన్నట్టైతే నీ ప్రవర్తనలో ఆయనకు ఈ విషయం తెలియక తప్పదు. అనుమానం కలిగిందా ఆయన వెంటనే వ్యతిరేకం అయిపోతారు. వ్యవహారం అంతా పాడయిపోతుంది. ఇంకొక ముఖ్యమైన కారణం. సుగుణ పెళ్ళికాని అమ్మాయి. అందులోనూ ఆమె తన తల్లి తండ్రులను మభ్య పరిచి, ఇక్కడకు రాబోతున్నది. ఆమె గురించి లోకం పల్లెత్తు మాట అనడానికి అవకాశం కల్పించకూడదు. ఆమె ఏ రోజు వస్తుందో ఆ రోజే నువ్వు వెళ్ళిపోవాలి" అన్నది ఆమె.

ఎంత అయిష్టంగా ఉన్నప్పటికీ, ఆమె చెప్పిన దాంట్లో గల యదార్థం గుర్తించాడు శేఖరం. ఎంత కష్టంగా ఉన్నప్పటికి, ఆ పదిహేను రోజులు తను ఇల్లువిడిచి వెళ్ళడానికే నిశ్చయించాడు. ప్రేమకోసం ఎన్ని త్యాగాలయినా చెయ్యాలి మరి!

జరిగినదంతా సుగుణకి ఉత్తరం వ్రాశాడు. ఆమె ఎప్పుడు వచ్చేది వెంటనే జవాబు వ్రాయమన్నాడు.

## 2

శేఖరం వ్రాసిన ఉత్తరం సుగుణ చదువుకొంది. అతడి తల్లి వేసిన ప్లాను ఆమెకు నచ్చింది. వెంటనే వెళ్ళడానికి నిశ్చయించింది. తన స్నేహితురాలు ఒకామె పదిహేను రోజులు కలిసి గడపడానికి రమ్మని, ఇదివరకు చెప్పిందని, ఇప్పుడు ఉత్తరం కూడా వ్రాసిందని, తనకు వెళ్ళాలని ఉన్నదని తల్లి తండ్రులతో చెప్పింది వారు ఆమె ప్రయాణానికి సమ్మతించారు. తను ఫలానా రోజున ఫలానా

# వధూటి

17 వ పేజీ తరువాయి

రైలులో వస్తున్నట్టు శేఖరానికి ఉత్తరం వ్రాసింది.

సుగుణ వస్తున్నట్టు జాబు వచ్చిందని శేఖరం తల్లితో చెప్పాడు. తన చిన్ననాటి ఒక స్నేహితురాలి కూతురు వస్తుందని, పదిహేను రోజులు తమ వద్ద ఉంటుందని శేఖరంతల్లి రామారావుగారితో చెప్పింది. ఇంట్లో ఆడపిల్లను నోచుకోని రామారావుగారు సంతోషించారు.

పరీక్షలు అయిపోగానే తిరుపతి వస్తానని, తను మొక్కుకొన్నాడని, అందుచేత ఒకసారి వెళ్ళివస్తానని శేఖరం తండ్రిని ఆనాడే అడిగాడు.

"అలాగే వెళ్ళు. తిరిగి ఎప్పుడు వచ్చేస్తావ్?" అని అడిగాడు రామారావుగారు.

"పదిహేను రోజులవుతుంది" అన్నాడు శేఖరం.

"తిరుపతిలో పదిహేను రోజులు ఏమిటి చేస్తావ్?" అన్నారు రామారావుగారు.

"తిరుపతిలో మూడు రోజులే ఉంటాను. తర్వాత మద్రాసు చూస్తాను. అక్కడనుండి ఒక స్నేహితుని ఇంటికి నెల్లూరు వెళ్తాను. ఇదే అవకాశం ఇకమీదట ఈమాత్రం స్వేచ్ఛ నాకు ఉండదు" అన్నాడు శేఖరం.

రామారావుగారు సమ్మతించారు. ఖర్చుల నిమిత్తం శేఖరానికి రెండు వందల రూపాయలు ఇచ్చారు సుగుణ వస్తానన్న రోజే శేఖరం తన ప్రయాణం స్థిరపరిచాడు. అయితే సుగుణ ఉదయం రైలులో వస్తానని వ్రాసింది. తను సాయంత్రం రైలుకి ప్రయాణం. ఒక పూటైనా ఆమెతో కలిసి ఉండవచ్చునని అతడు ఆశించాడు. కాని, అనుకొన్నప్రకారం సుగుణ ఉదయం రైలులో రాలేదు. సాయంత్రం రైలులో దిగింది. అందులోనే శేఖరం ఎక్కి వెళ్ళాడు. కనీసం సుగుణ వచ్చినట్టు తనకు తెలిసినందుకు అతడికి కొంత సంతృప్తి కలిగింది.

సుగుణ రామారావుగారి హృదయంలోను, ఆయనభార్య హృదయంలోను వెంటనే స్థానం కల్పించుకొన్నది. చదువుకొన్న అమ్మాయిలంటే శేఖరం తల్లికి కొన్ని అపోహ లుండేవి. కాని, సుగుణ ప్రవర్తన చూచాక, ఆమె తన అభిప్రాయాలు మార్చుకొన్నది. సుగుణ సార్థక నామధేయురాలు. అందులో ఆమె వచ్చిన పని చాలా సున్నితమైనది. తను రామారావుగారిని పూర్తిగా మెప్పించి సెభాష్ అనిపించుకోవాలనే పట్టుదలతో ఆమె ప్రవర్తించింది. బంగారానికి మెరుగు పెట్టినట్లున్నది ఆమె నడవడి. రామారావుగారికి కావలసిన సౌకర్యాలన్నీ ప్రతిరోజూ తనే ఏర్పాటుచేసేది. ఉదయాన్నే కాఫీ కాచేది. ఆమె చేసిన కాఫీకి అంత సువాసన, అంత "కిక్" ఎలాగ వస్తాయా అని రామారావుగారు ఆశ్చర్యపడేవారు. ఆ తర్వాత వంటింట్లో శేఖరం తల్లికి సహాయం చేస్తూ, కొత్త వంటలుచేసి చూపించేది. మధ్యాహ్నం రామారావుగారు వ్రాయవలసిన ఉత్తరాలు ఆయన చెప్తుంటే తనే వ్రాసేది. రాత్రి భోజనా లయ్యాక వార పత్రికలు చదివి వా రిద్దరికీ వినిపించేది. తన ఈడుగల ఇరుగు పొరుగు అమ్మాయిలతో అనతి కాలంలోనే సుగుణ స్నేహం కలిపింది. వాళ్ల కిలకిల నవ్వులతో గాజుల గలగలతో మధురమైన మాటలతో ఆ ఇంటికి ఎన్నడూలేని కొత్త శోభ వచ్చింది.

సుగుణని చూచి రామారావుగారు మురిసిపోయేవారు. తన కొక కుమార్తె లేకపోవడం ఎంత దురదృష్టమో అనుకొనేవారు. సుగుణవంటి కోడలు దొరికితే బాగుండుననుకొన్నారు. కాని, తను ఇదివరకే ఇంకొకరికి మాట ఇచ్చారు. ఆ అమ్మాయి ఎటువంటిది కాబోతుందో? ఏదైనా కావలసినంత కట్నం, కావలసినంత ఆస్తితో వస్తుంది. ఎటువంటిదైనా భరించాలి. సుగుణ అంత ధనవంతుల బిడ్డ అయితే, ఇంక కావలసిన దేమిటి? కాని, ఆమె తండ్రి పోలీసు డిపార్టుమెంటులో ఒక ఇనస్పెక్టరని, తాము సామాన్య సంసారులం అని సుగుణ చెప్పింది. సుగుణ సుగుణాలు ఒకవైపు, ఆ రెండవ అమ్మాయి ధనం ఒక వైపు మనస్సులో త్రాసులో వేసి, పదేపదే తూచి చూచారు



రామారావుగారు. పటున్నైపు పెళ్ళిన యాగింది ఆయన నిర్ధారణ చెయ్యలేక పోతున్నారు.

## 3

శేఖరం తిరుపతి వెళ్ళాడు. అది శేషువా అన్నట్టు మెలికలు తిరిగిన తిరుమలపోయే రోడ్డును అతడు బస్సులోంచి వంగి వంగి చూచాడు. తిరుమలలో ప్రకృతి సౌందర్యాలు అతణ్ణి ముగ్ధుణ్ణి చేశాయి. అచ్చటి శీతల వాతావరణం అతడికి ఎంతో హాయి అనిపించింది. వేంకటేశ్వరుని ఆలయంలో అడుగు పెట్టగానే ఒక మహా మహాత్తుగల దైవాన్ని దమీపించబోతున్నట్లు అతడికి తోచింది. క్యూ కాస్త ముందుకు నడిచేసరికి అతడికి దూరంనుండి వేంకటేశ్వరుని దర్శనం కలిగింది. తన కళ్ళు ఇంకొక వైపు మళ్ళించలేకపోయాడు. క్యూతోబాటు అతడు అప్రయత్నంగా నడుస్తూ, చివరికి గర్భ గుడివద్దకు చేరాడు. ఉత్తర క్షణంలో ,ఇద్దరు స్వాములు అతడి తలపైన శఠగోపం, చేతిలో తీర్థం ఉంచి, "నడు నడు" అన్నారు. ఏదో స్వప్నం లో ఉన్న వాడిలాగ తిరుగు మొహం పట్టాడు. అక్కడినుండి కల్యాణ కట్టకు వెళ్ళి తల మొక్కుబడి తీర్చుకొని, పుష్కరిణిలో స్నానం చేసి, తిరిగి దైవ దర్శనానికి వెళ్ళాడు. సుగుణ తనకు భార్య కావా లని, ఇద్దరు బి. ఎల్. పరీక్షలో ఉత్తీర్ణులు కావాలని ప్రార్థించాడు. ఆ మర్నాడు కూడా తిరుమల లోనే ఉండి, ఆకాశగంగ, పాపనాశనం, గోగర్భం, స్వామివారితోట వేద పాఠశాల చూశాడు. తలకి ఒక టోపీ కొనుక్కొని సాయంత్రానికి దిగువ తిరుపతి చేరాడు. అక్కడ ఆరోజు గడిపి మెద్రాసు వెళ్ళాడు.

మద్రాసులో విశేషాలన్నీ చూస్తూ శేఖరం మూడు రోజులు గడిపాడు. నాల్గవరోజు సాయంత్రం త్రం బీచి చూడడానికి బయల్దేరాడు. ట్రిప్లికేన్ బజారులోనుండి వెళ్తూంటే అతడి దృష్టిని ఒక విగ్గులషాపు ఆకర్షించింది. రక రకాల విగ్గులు, అద్దాల బీరువాలలోనుంచి కన్పించినై. శేఖరానికి తన కాలేజీ నాటకాలు జ్ఞప్తికి వచ్చినై. వాటిలో శేఖరం రెండు మూడు సార్లు ఆడవేషాలు వేశాడు. అతడు స్త్రీ పాత్రలు చాలా సహజంగా నటించా డని అందరూ శ్లాఘించారు. సుగుణ కూడా మొదటిసారిగా అతడి స్త్రీ పాత్రను చూచి నప్పుడు తను నిజంగా నమ్మలేకపోయానని చెప్పింది. ఒకసారి శేఖరాన్ని ప్రిన్సిపాల్ వారే అభినందించారు. ఇక ఆ రోజులురావు అని గతాన్ని స్మరిస్తూ శేఖరం బీచి చేరాడు.

ఇప్పటికి తను ఇల్లు వదిలి సరిగ్గా వారం రోజులయింది. అనుకొన్నాడు శేఖరం ఇసకలో కూర్చుంటూ. సుగుణ ఎలాగ ప్రవర్తిస్తున్నదో? ఆమె అంటే తన తల్లి తండ్రులకి, ముఖ్యంగా తండ్రికి ఎటువంటి అభిప్రాయం కలిగిందో? సుగుణకి ఏ గది ఇచ్చారు? తన గదే ఇచ్చిఉంటారు తన కుర్చీలోనే కూర్చుని తన మంచంపైనే పడు కొంటున్నదా? అన్ని విషయాలు తెలుసుకోవా లని శేఖరానికి చాలా కుతూహలం,—ఆతృత కలి గాయి. కాని, ఇంకొక వారం రోజుల వరకు తను ఇంటికి వెళ్ళకూడదు. అనుకున్న ప్రకారం రేపు నెల్లూరువెళ్ళి ఈ వారం రోజులు తన మిత్రుడు రామిరెడ్డితో గడపాలి. శేఖరానికి ఇప్పుడు నెల్లూరు పోవాలని లేనేలేదు. ఎలాగైనా ఒకసారి సుగుణను చూడాలని అతడికి బుద్ధి పుట్టింది. పాపం తనని వివాహం చేసుకోవడానికి ఈ నాటకంలో ఆమె కూడా ఒక పాత్ర అభినయించడానికి సిద్ధపడింది. సుగుణకి తనంటే ఎంత ప్రేమ! నిజంగా తనంతటి అదృష్ట వంతుడు లేడు. తనంత దురదృష్టవంతుడు కూడా లేడని శేఖరం వెంటనే అనుకొన్నాడు. తను ప్రేమిం చిన స్త్రీ, ఏ పరిస్థితినైనా ఎదుర్కొని తను వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకొన్న సుగుణ, తన ఇంటివద్దనే ఉన్నప్పటికి తను ఇంట్లో కాలు పెట్టడానికి వీలులేకపోయింది.

ఏమైనాసరే. ఈ రాత్రే తను ఇంటికి పోవా లని, సుగుణని చూడాలని, ఏమిటి జరుగుతున్నది తెలుసుకోవాలని శేఖరం మనస్సు భీష్మించుకొని కూర్చుంది. ఏమిటి చెయ్యడమో తెలియక శూన్యం లోకి చూస్తూ వెనక్కి చేరబడ్డాడు. వర్షఋతువులో మేఘాలవలె అతడి తలలో అనేకమైన ఆలోచ నలు పరిగెత్తాయి. కొన్ని మేఘాలు కలుస్తున్నై. కొన్ని విడిపోతున్నై. అకస్మాత్తుగా ఆ మేఘాలలో నుంచి ఒక పెద్ద మెరుపు మెరిసింది. "ఏమిటీ" అనుకుంటూ శేఖరం లేచి కూర్చున్నాడు. తనకు కలిగిన ఆలోచనకు అతడికే ఆశ్చర్యం కలిగింది. కాస్త భయం కూడా వేసింది.

---

పాపాయి గుంజిళ్లు ప్రాక్టీసు చేస్తోంది. ఎందుకులంటే వినా యక చవితినాడు విఘ్నేశ్వరుని ముందు తియ్యాలిగా అందుకనీ అన్నది.

రామం (విశాఖ)

---

స్త్రీ వేషం వేసుకుని ఇంటికి వెళ్తే? తన సుగుణ తల్లిని అని చెప్తాడు. సుగుణ తల్లినీ తన తండ్రులు ఇదివరకు చూడలేదు కాబట్టి వా రిద్దరికీ ఏ అనుమానం కలుగదు. ఎటొచ్చీ సుగుణ యదార్థం తెలియక ఏదైనా గొడవ చెయ్యకుండా జాగ్రత్త పడితే చాలు. ఒక రోజో, రెండు రోజులో ఇంటివద్ద ఉండవచ్చును. అన్నీ తెలుసుకోవచ్చును.

ఆలోచిస్తున్నకొద్దీ శేఖరానికి మార్గం స్పష్టపడ సాగింది. తను ఉదయం సరిగ్గా ఎనిమిది ఘంట లకి ఇల్లు చేరాలి. ఆ సమయానికి తండ్రి చావిట్లో కూర్చొని పేపరు చదువు తూంటాడు. తల్లి పూజ చేసుకొంటూ ఉంటుంది. సుగుణ బహుశ తన గదిలో ఉంటుంది. ముందు తండ్రినిదాటి వెళ్ళాలి. తర్వాత సుగుణను హెచ్చరించాలి. అక్కడ నుండి తల్లివద్దకు వెళ్ళాలి అని కార్యక్రమం నిర్ణ యించుకొన్నాడు. తను ఎక్కడ ఎప్పుడు స్త్రీ వేషంలోకి మారాలో నిర్ధారణ చేసుకొన్నాడు. తన సామాన్లు పూటుకేసు ఎక్కడ భద్రపరచాలో కూడా ఏర్పాటు చేసుకొన్నాడు.

జరగబోయేదంతా ఇంకొకసారి సింహావలోకనం చేస్తూ లేచాడు శేఖరం. ఎక్కడా లోపాలు కన బడలేదు. తిన్నగా విగ్గుల షాపునైపు నడిచాడు. వడి వయస్సు స్త్రీ విగ్గు ఒకటి కొన్నాడు. తనకు స్త్రీ పాత్ర బాగా అనుభవమే కాబట్టి కావలసిన బట్టలు అలంకారాలు వగైరా అన్నీ కొన్నాడు.

## 4

రామారావుగారు చావిట్లో పేపరు చదువు కొంటున్నారు. "రామారావుగారి ఇల్లు ఇదేనా?" అంటూ ప్రవేశించాడు శేఖరం, స్త్రీ రూపం, స్త్రీ కంఠంతో.

"అవునమ్మా" అన్నారు రామారావుగారు పేపరులోనుంచి తొంగి చూస్తూ.

వచ్చిన దెవరో రామారావుగారికి బోధ పడ లేదు. "మీ రెవరూ? మొహం కాస్త పరిచయం గానే కనిపిస్తున్నది" అన్నారు.

"సుగుణ మా అమ్మాయేనండి" అన్నాడు శేఖరం.

"అలాగ చెప్పండి. మీరు సుగుణ తల్లిగారా? చాలా సంతోషం. లోనికి వెళ్లండమ్మా" అంటూ, మబ్బుల వెనక చంద్రుడిలాగ మళ్ళా పేపరు వెనక అంతర్థానం అయ్యారు.

మొదటి పరీక్షలో విజయం కలగడంతో శేఖ రానికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. లోనికి వెళ్ళాడు. తను వూహించినట్లు మాత్రం సుగుణ తన గదిలో లేదు. తల్లి పూజ చేసుకొంటున్నది. శేఖరం వెళ్ళి పూజా మందిరం ద్వారంవద్ద నిల్చున్నాడు. ఆమె తల ఎత్తి చూచింది.

"ఎవరమ్మా మీరు?" అని అడిగింది శేఖరం తల్లి.

"నేను సుగుణ తల్లిని" అన్నాడు శేఖరం.

"వస్తున్నానమ్మా. సగం పూజలో ఉన్నాను. త్వరగా ముగించి వస్తాను. ఆ పక్కనే ఉన్న గదిలో కూర్చోండి. సుగుణ స్నానం చేస్తున్నట్లుంది" అన్నది శేఖరం తల్లి

శేఖరం తన గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. అయిదు నిముషాలు గడిచాయి. ఇంతలో తూర్పు కొండలపై చంద్రబింబం ఉదయించినట్లు సుగుణ ముఖం గది ద్వారంవద్ద ఉదయించింది. శేఖరం మనస్సు సముద్రంలాగ సంతోషంతో ఉప్పొంగి పోయింది.

తన గదిలో ఉన్నది ఎవరా అని చూస్తూ సుగుణ నిలబడి పోయింది.

"ఏమే సుగుణా! క్షేమమా" అని శేఖరం పలక రించాడు.

సుగుణ తెల్లమొహం వేసింది. "మీ రెవరు?" అన్నది.

"నేనే—మీ అమ్మని" అన్నాడు శేఖరం.

సుగుణ ముఖంలో ఆశ్చర్యం, అనుమానం కని పించాయి. "మీరు మా అమ్మకాదు. మీ రెవ్వరో ముందు నిజం చెప్పండి" అన్నది.

"బాగుంది వరస. నిన్ను నవ మాసాలుమోసి కని, పెంచి ఇంతదాన్నిగా చేస్తే ఇప్పుడు నేను మీ అమ్మని కాదంటావా? నయం" అన్నాడు శేఖరం.

సుగుణకి అనుమానం ఎక్కువ అయింది. "మీ రెవరో పిచ్చి ఆస్పత్రినుంచి తప్పించుకొని వచ్చినట్లుంది. నాకు భయం వేస్తున్నది. రామా రావుగార్ని పిలుచుకు వస్తాను" అంటూ సుగుణ గిరుక తిరిగింది.

సుగుణ వాయిస అడుగులు వేసేసరికి "సుగుణా"

అని శేఖరం తన సహజ కంఠంతో ఆమెను పిల్చాడు.

సుగుణ అతి ఆశ్చర్యంగా వెనక్కి తిరిగి చూచింది. అది శేఖరం కంఠస్వరం. అనుమానంలేదు. మరి ఈ ఆడ రూపేమిటి? సందిగ్ధంలో పడి అలాగే నిల్చుంది.

"నేను శేఖరాన్ని. గొడవ చెయ్యకుండా ఇలాగ రా" అన్నాడు శేఖరం మెల్లిగా.

సుగుణ వచ్చింది. "ఈ వేషం ఏమిటి? ఎక్కడైనా నాటకం ఆడివచ్చారా?" అన్నది.

ఎలాగైనా ఒకసారివచ్చి సుగుణని చూడాలని, ఏమిటి జరుగుతున్నదీ తెలుసుకోవాలని బుద్ధి పుట్టిందని, అయితే సుగుణ ఉండే పదిహేను రోజుల లోగా ఇంటికి తను వస్తే వ్యవహారం పాడైపోతుందనే భయంనుంచి ఈ వేషంలో వచ్చి సుగుణ తల్లిని అంటూ ఇంట్లో ప్రవేశించానని శేఖరం టూకీగా ఆమెకు చెప్పాడు.

"చాలా ప్రమాదం అయిన పని చేశారు. ఇక్కడ నేనంటే వీ రిద్దరికి కావలసినంత అభిమానం కల్గుతున్నది. అందులో మీ తండ్రిగారికి మరీని. ఇప్పుడు ఏమాట వల్లనో, చేష్టవల్లనో మా సంగతి బయట పడిందంటే ఇంత ప్రయత్నం వ్యర్థం అయిపోతుంది. మీరు వెంటనే వెళ్ళండి. ఒక వారం రోజులు ఓపిక పట్టండి" అన్నది సుగుణ భయంతో.

"ఈ ఒక్కరోజే ఉంటాను. రేపు వెళ్ళిపోతాను. జాగ్రత్తగానే ఉంటాను" అన్నాడు శేఖరం.

అతడి పరిస్థితి చూస్తే సుగుణకి కళ్ళు చెమ్మగిల్లాయి. "కాఫీతెస్తాను" అంటూ లోనికి వెళ్ళింది.

హమ్మయ్య అనుకున్నాడు శేఖరం. ఇంతవరకు అంతా సవ్యంగానే గడిచింది. సుగుణ మనలాయన్ని టోపీ వేసిందన్నమాటకూడా తెలిసింది. శేఖరం ఒక పెద్ద నూపిరి వదిలాడు.

ఆడవేషం ధరించినప్పటినుండి శేఖరానికి సిగరెట్టు కాల్చడానికి వీలులేక పోయింది. వానిటీ బ్యాగులోంచి ఒక సిగరెట్టు తీసి వెలిగించాడు. ప్రాణం లేచివచ్చినట్టయింది.

సుగుణ కాఫీ తీసుకు వచ్చింది. కుర్చీలో వెనక్కి చేరబడి, టేబిలు పైన కాళ్ళుజాచి సిగరెట్టు కాలుస్తున్న శేఖరాన్ని చూచి నిర్ఘాంతపోయింది

"ఆ సిగరెట్టు వెంటనే పారెయ్యండి. సరిగ్గా కూర్చోండి. మీ అమ్మగారు వస్తున్నారు" అని సన్నని గొంతుకతో అతడిని హెచ్చరించి, "ఈ కాఫీ తీసుకోవే అమ్మా" అన్నది బిగ్గరగా.

శేఖరం తల్లి వచ్చి పది నిముషాలు మాట్లాడింది. ఆమెతో మాట్లాడుతూ శేఖరం "రేపు సుగుణని తీసుకు పోవడానికి వచ్చాను" అని చెప్పాడు.

"అయ్యో నాలుగు రోజులు పోనివ్వండి. ఇప్పుడేం తొందర? మా ఇల్లు ఎంతో సందడిగా ఉన్నది" అన్నది శేఖరం తల్లి. సుగుణ ఇక్కడ ఉన్నట్టు ఈమెకు ఎలాగ తెలిసిందా అనుకొన్నది. ఇక్కడికి వస్తున్నట్లు సుగుణ తన తల్లి తండ్రులతో చెప్పదని శేఖరం చెప్పాడే! అంటే సుగుణ తన తల్లివద్ద ఏదీ దాచకుండా యదార్థమే చెప్పి వచ్చిందన్న మాట. అనుకొన్నది శేఖరం తల్లి. ఆమెకు సుగుణపై మరికాస్త గౌరవం ఎక్కువ అయింది.

భోజనాలు చేస్తున్నప్పుడు "రేపు సుగుణని వాళ్ళ ఇంటికి తీసుకుపోతానంటున్నారు. నేను ఇంకొక వారం రోజులు పోయాక పంపిస్తానన్నాను" అని శేఖరం తల్లి భర్తతో చెప్పింది.

"సుగుణ వచ్చి వారం రోజులయింది. అప్పుడే తీసుకుపోవడం ఏమిటి? ఇంకొక వారం రోజులైనా ఉండ నివ్వండి. అదిగాక సుగుణ మా కుటుంబంలో ఒక మనిషి అయిపోయింది. ఇల్లు ఎంతో నిండుగా ఉన్నది. నా సౌఖ్యం, నా పదుపాయాలు అన్నీ సుగుణే ఎంతో చక్కగా చూస్తున్నది" అన్నారు రామారావుగారు.

"మీకు సుగుణ అంటే అంత ఇష్టంగా ఉంటే దానినే మీ కోడలుగా చేసుకోండి" అన్నాడు శేఖరం నవ్వుతూ.

శేఖరం వైపు కోపంగా చూచింది సుగుణ.

రామారావుగారు ఒక నిముషం మౌనం వహించారు. చివరికి "మేమంత అదృష్టానికి నోచుకోలేదు. మా అబ్బాయికి ఇదివరకే ఒక సంబంధం నిశ్చయించాము. రెండు మూడు సంవత్సరాలనుండి వాళ్ళు ఇంకొక సంబంధం చూచుకోకుండా మా కోసమే నిరీక్షిస్తున్నారు" అన్నారు.

రాత్రంతా మెయిలులో నిద్రలేక పోవడం నుంచి శేఖరానికి భోజనం పూర్తిచేసేసరికి కళ్ళు మూతలు పడడం మొదలు పెట్టాయి. ఎలాగో గదిలోకి వచ్చాడు. తలుపులు గడియ వేశాడు. ఆడవేషం అంతా తీసి పారేశాడు. హాయిగా పైజమా, బనియను పెద్ద పెట్టెలోంచి తీసి ధరించాడు. మంచంమీద వాలాడో లేదో అతడిని నిద్ర ఆవరించింది.

స్త్రీ వేషం తీసి వేస్తున్నప్పుడు విగ్గుతీసి వేయడం మాత్రం మరచిపోయాడు.

మూడు ఘంటలకి సుగుణ కాఫీ తీసుకువచ్చి తలుపు కొట్టింది. గాఢ నిద్రలోనున్న శేఖరానికి ఒకంతటా తెలివి రాలేదు. కొంతసేపటికి కాస్త మెలుకువ వచ్చింది. బయటనుండి "అమ్మా అమ్మా" అని ఎవరో పిలుస్తున్నట్లైంది. తననికాదు కదా అని తిరిగి నిద్ర పోవడానికి ప్రయత్నించాడు. కాని బయటనుండి తలుపు తట్టుతున్న శబ్దం ఏమాత్రం తగ్గలేదు. కోపంతో వెళ్ళి తలుపులు రెండు బార్లా తీసేశాడు.

శేఖరాన్ని చూడగానే సుగుణ కళ్ళు ఆశ్చర్యంతో చేరడేసి అయ్యాయి తలుపులు రెండూ వెంటనే తనే తిరిగి మూసింది. పైట కొంగు నోటికి అడ్డం పెట్టుకొని విరగబడి నవ్వడం మొదలెట్టింది.

"తలుపులు మూశావేం?" అన్నాడు శేఖరం లోపలనుండి.

"మీ స్వరూపం ఒకసారి అద్దంలో చూచుకోండి" అన్నది సుగుణ నవ్వు ఆపుకొంటూ.

అర్థంకాక అద్దంలోకి చూచాడు శేఖరం. పైజమా, బనియను, తలకి బర్మా ముడితో అతడి రూపం సాక్షాత్కరించింది. అతడికే నవ్వు వచ్చింది

"మరచిపోయాను సుగుణా. తలుపు కొద్దిగా తీసి, ఆ కాఫీ కప్పులోన పెట్టు— ఒక్క పది నిముషాలు టయిము ఇచ్చారంటే మళ్ళా మీ అమ్మ నీకు కనిపిస్తుంది" అన్నాడు శేఖరం.

పది నిముషాలు పోయాక సుగుణ తిరిగి వచ్చింది. శేఖరం ఆడవేషంతో మంచంమీద కూర్చొని అప్పుడే తాగిన కాఫీ కప్పు టేబిలు పైన పెట్టుతున్నాడు.

సుగుణ కుర్చీలో కూర్చుంది. "మీరు ఎంత త్వరగా వెళ్ళిపోతే అంత మంచిది. మీరున్నారంటే మన రహస్యం ఇక ఆట్టేకాలం దాగదు. మన ప్రయత్నం విఫలం కాక తప్పదు" అన్నది.

"ఇప్పుడు మళ్ళా ఏ మొచ్చింది?" అన్నాడు శేఖరం.

"మీరువచ్చి ఏ డెనిమిది ఘంట లయింది అప్పుడే మూడు సార్లు ప్రమాదం తెచ్చి పెట్టారు" అన్నది సుగుణ.

"నేనేం చెయ్యలేదే" అన్నాడు శేఖరం.

"ఉదయం నేను కాఫీ తెచ్చేసరికి సిగరెట్టు కాలుస్తున్నారా? ఒక్క క్షణంలో తప్పిందికాని, మీ అమ్మగారే ముందు వచ్చి ఉంటే? రెండవది: నన్ను కోడలుగా చేసుకోమని మీ తండ్రిగారితో ఇప్పట్లో చెప్పడం తప్పు ఆయన మనస్సులో ఇంకా పూర్తిగా పరివర్తన కలగలేదు. మీరు ఆ మాట



"...అబ్బే. అవన్నీ కొన్న చెప్పులు కాదండి మావారు ప్రసంగం చేసిన చోటల్లా వచ్చిన బహుమానాలు."

అనగానే ఆయన మనస్తత్వం ప్రతికూలంగా మారిపోయింది. ఇప్పుడు నేను పిలుస్తే తలుపు తీసిన రూపం మూడవ ప్రమాదం. అప్పు డెవ రైనా మిమ్మల్ని చూచి ఉంటే? ఇకమీదనైనా జాగ్రత్తగా మసలుతూ అనవసరంగా మాట్లాడ కుండా ప్రవర్తించ గలిగితేనే ఉండండి. లేకపోతే ఇప్పుడే ప్రయాణం కట్టండి" అని చెప్పింది నిశ్చితంగా.

తను చేసిన తప్పులు తెలుసుకొన్నాడు శేఖరం. అప్పటినుండి చాలా జాగ్రత్తగా ప్రవర్తించాడు.

ఆ రాత్రి సుగుణతో, "ఇంకొక మంచం కూడా ఆ గదిలో వేయిస్తాను. నువ్వు మీ అమ్మగారు ఆ గదిలో పడుకోండి. నేను వరండాలో పడుకొంటాను" అన్నది శేఖరం తల్లి.

సుగుణ ముఖం వెల వెల బోయింది. "వద్దు బాబు. నేను వేరే పడుకొంటాను" అన్నది తడ బడుతూ.

"ఆదేమిటమ్మా. మీ తల్లీ, పిల్లా ఆ గదిలో పడుకోండి" అన్నది శేఖరం తల్లి.

"నాకు రాత్రి పది, పదకొండు ఘంటలవరకు చదవడం అలవాటు. వెల్తురు ఉంటే మా అమ్మకి నిద్ర పట్టదు. మా ఇంట్లో రోజూ ఇదే పోరు. అందుచేత మా అమ్మని ఆగదిలో పడుకో నివ్వండి. నేను ఇంకొక మంచం వేయించుకొని పుస్తకాల గదిలో పడుకుంటాను" అన్నది సుగుణ.

"నీ ఇష్టమే కానీ" అన్నది శేఖరం తల్లి.

బతుకుజీవుడా అనుకొన్నది సుగుణ.

## 5

మర్నాడు ఉదయం సుమారు పది ఘంటలు కావస్తోంది. రామారావుగారు చావిట్లో కూర్చు న్నారు. "నమస్కారమండీ" అంటూ ఒకాయన లోనికి ప్రవేశించాడు. ఆయన వెంట వచ్చిన ఇంకొక వ్యక్తి అరుగుమీద కూర్చున్నాడు.

"నమస్కారం. దయచెయ్యండి" అని రామా రావుగారు ఆహ్వానించి, ఆయన కూర్చున్నాక, "తమ రెవ్వరు?" అని ప్రశ్నించాడు.

"నేను సి. ఐ. డి. ఇనస్పెక్టరుని. ఈమధ్య మీ ఇంటికి ఎవరైన కొత్త స్త్రీలు, ఇదివరకు మీకు తెలియనివారు ఎవరైనా వచ్చారా?" అన్నారు ఇనస్పెక్టరుగారు.

"అంటే?" అన్నారు రామారావుగారు అర్థం కాక.

"ఒక బందిపోటుదొంగ మన జిల్లాలో చాలా చోట్ల దొంగతనం చేస్తున్నాడు. మా పోలీసు డిపార్టుమెంటు ఎంత ప్రయత్నించినా దొరకడం లేదు. అయితే వాడు చేసిన దొంగతనాలన్నీ ఒకే విధంగా ఉండడంనుంచి ఇవన్నీ వాడే చేస్తున్నటు నిర్ధారణ అయింది. ఆచోకీ తీస్తే వాడి పేరు రంగడని తెలిసింది. ఇంకొక చిత్రమయిన విషయం కూడా బయల్పడింది. వాడు స్త్రీ వేషంతో మొదట ఆ ఇంట్లో ప్రవేశిస్తాడట. సాధారణంగా పరిచారికగా ప్రవేశిస్తాడు. కాని, ఇంటావిడ స్నేహితు రాలి స్నేహితురాలనని కూడా ఇదివరకు ఒక ఇంట్లో ప్రవేశించాడట. వారం పది రోజులు అతి నమ్మకంగా మసలుతూ ఆ ఇంటి సంగతి వీలైనంతవరకు తెలుసు కొని ఒకరోజు అంతర్ధానం అవుతాడట. ఆ పిమ్మట

# వధూటి

రెండు మూడు రోజులలోనే ఆ ఇంట్లో దొంగ తనం జరుగుతుందట. ఇదీ జరుగుతున్న కథ రంగడు మూడు రోజులక్రితం ఈ వూళ్లో ప్రవే శించినట్లు ఒక వ్యక్తి ద్వారా మా అధికార్లకు నిన్ననే తెలిసింది. ఈ వూరు సబ్ ఇనస్పెక్టరుకి సహాయం చెయ్యమని నాకు స్పెషల్ డ్యూటీ వేశారు. ఈ ఉదయంనుండి ఆయన, నేను, చెరొకవైపు మొదలెట్టి ఇంటింటికివెళ్ళి చూడడం ప్రారం భించాం. అనుమానం ఉన్నచోట సోదా చేస్తాం మీ ఇంట్లో కొత్త పనిమనిషిగాని, ఏదో సంబంధం కల్పించుకొని వచ్చిన అపరిచితమైన స్త్రీగాని గత రెండు మూడు రోజులలో ఎవరైనా ప్రవే శించారా?" అన్నారు ఇనస్పెక్టరుగారు.

"చాలా చిత్రంగా ఉన్నదే వీ డెవడో దేవాంతకుడే. కాని, మీరు చెప్పిన విధంగా మా ఇంట్లో కొత్త పరిచారికలుకాని, అపరిత స్త్రీలుగాని ఎవరూ ప్రవేశించలేదు" అన్నారు రామారావుగారు.

"లేకపోతే గొడవలేదు. ఇకమీదట అటువంటి స్త్రీ ఎవరైనావస్తే పోలీసు స్టేషనుకు వెంటనే

---

నిర్మాత గదిలోకి ఒక కాబోయే నటుడూ, ఒక పెద్ద కోతి (కొండముచ్చు అనుకుంటాను!) కలిసి వచ్చారు.

"నీ కోతిని సినిమాల్లో చేర్పిద్దా మనుకుంటున్నారా?" అని అడిగాడు నిర్మాత.

"కాదు, ఈ కోతి నా సెక్రెటరీ" అని కా. న. సమాధానం.

కె. ఎ. యస్. (చీరాల)

---

కబురు చెయ్యండి" అంటూ ఇనస్పెక్టరుగారు లేచారు.

"తప్పకుండా చేస్తాను. అన్నట్టు మాటలలో పడి మరిచిపోయాను. ఒక్క నిముషం కూర్చోండి ఇనస్పెక్టరుగారూ, కాస్త కాఫీ తీసుకొని వెళ్ళండి" అంటూ రామారావుగారు "సుగుణా రెండు కప్పుంతో కాఫీ తీసుకు రావమ్మా" అని ఇంట్లోకి కేక వేశారు

ఈయన కుమార్తె పేరు కూడా సుగుణేనా అనుకొంటూ, తిరిగి సి. ఐ. డి. గారు కూర్చున్నారు.

ఐదు నిముషాల్లో కాఫీ తీసుకు వచ్చింది సుగుణ

"సుగుణా!" అన్నారు ఇనస్పెక్టరుగారు ఆశ్చ ర్యంతో

"ఆరే, నాన్నగారు! ఈ ఇల్లు మీకు ఎలా తెలి సిందీ?" అన్నది సుగుణ అంతకంటే ఆశ్చర్యగా.

"ఉద్యోగ రీత్యా వచ్చానమ్మా. నువ్వు ఇక్కడ ఉన్నట్టు నాకు తెలియదు" అంటూ రామారావు గారితో "మీ అమ్మాయికి మా సుగుణకి ప్రాణ స్నేహమట. మనం చూస్తే అపరిచితులం" అన్నారు ఇనస్పెక్టరుగారు.

"నా కెవరూ ఆడపిల్లలు లేరే" అన్నారు రామారావుగారు తెల్లబోతూ.

అర్థం కానట్లు ఇనస్పెక్టరుగారు సుగుణ వైపు చూచారు. "నీ స్నేహితురాలింటికి వెళ్తా నని చెప్పి వచ్చావమ్మా. ఈ ఇంట్లో నీ స్నేహితురా లెవరు?" అని ప్రశ్నించారు.

"నా స్నేహితురాలింటికి వెళ్తానని చెప్పలేదు నాన్నగారూ—అమ్మ స్నేహితురాలింటికి వెళ్తానని చెప్పాను" అన్నది సుగుణ.

"అబద్ధం ఆడుతున్నావ్ దొంగా! మీ అమ్మ తోనూ, నాతోనూ, నీ స్నేహితురాలింటికే వెళ్తున్నా నని చెప్పావు" అన్నారు ఇనస్పెక్టరుగారు.

"మీరు వినడం పొరపాటు. కావలిస్తే అమ్మని అడగండి" అన్నది సుగుణ. కాని వెంటనే నాలిక కొరుక్కొంది. ముఖం వెలవెలబోయింది. భయంతో రామారావుగారివైపు చూచింది.

సుగుణ భయపడ్డంతా జరిగింది. "సుగుణ చెప్పిందే సరియైనది. మీ ఆవిడ మా ఆవిడ స్నేహితు రాళ్లట. ఇద్దరూ లోపల కూర్చొని మాట్లాడు కొంటున్నారు" అన్నారు రామారావుగారు.

ఇనస్పెక్టరుగారు అదిరిపడ్డారు. "మా ఆవిడా? ఇక్కడికి ఎప్పుడు వచ్చిందీ?" అన్నారు ఆశ్చ ర్యంతో.

"మీకు తెలియదా? నిన్న ఉదయం వచ్చారు. అన్నారు రామారావుగారు.

ఇనస్పెక్టరుగారు ఒకసారి బల్లగుద్ది "అసం భవం. ఈ ఉదయం నాలుగు ఘంటలకు నేను ఇంటివద్ద బయల్దేరాను అప్పటికి మా ఆవిడ మా ఇంటి వద్దనే ఉన్నది" అన్నారు.

"మనిషిని ఎదట పెట్టుకొని మనకీ వాదన ఎందుకు? సుగుణా మీ అమ్మగారిని రమ్మను. మీ నాన్నగారు వచ్చారని చెప్పు" అన్నారు రామారావు గారు.

సుగుణవైపు రామారావుగారివైపు అనుమా నంగా చూచి, "సుగుణని ఇక్కడే ఉండ నివ్వండి. మీరే మా ఆవిడను పిలిపించండి" అన్నారు ఇన స్పెక్టరుగారు.

ఇదిగో—సుగుణ తల్లిగారిని ఒకసారి ఇటు పంపించు" అని రామారావుగారు ఇంట్లోకి కేక వేశారు.

సుగుణ ముఖాన్ని నెత్తురులేదు అవయవాల పైన స్వాధీనం తప్పి, అలాగే నిలబడి చూస్తు న్నది.

అయిదు నిముషాలు గడిచాయి.

చక్కగా చుట్టుకొన్న జుట్టు ముడి, దాని చుట్టూ పువ్వులు, సుగుణవద్ద పుచ్చుకొని కట్టు కొన్న జరీ అంచు గల చీర, చేతులో వాని టీ బ్యాగ్‌తో ప్రయాణానికి సిద్ధంగా శేఖరం కులు కుతూ వచ్చాడు.

ఇప్పుడేమిటి చెప్తావ్ అన్నట్టు రామారావు గారు ఇనస్పెక్టరుగారివైపు చూచారు.

ఇనస్పెక్టరుగారు శేఖరాన్ని కిందనుంచి మీద వరకు చూచారు. "నువ్వెవరు?" అని గద్దించి అడిగారు.

"నేను సుగుణ తల్లిని" అన్నాడు శేఖరం కాస్త జంకుతూ. ఇత డెవరా అనుకొన్నాడు.

"సుగుణ తల్లి ఎవరో నీకంటే నాకు బాగా

తెలుసును. నేను సుగుణ తండ్రిని. నిజం చెప్పు. మీవ్వెవరో?" అన్నారు ఇనస్పెక్టరుగారు.

శేఖరం మాట్లాడలేదు.

"అదేమిటమ్మా సుగుణా, నిన్నటినుండి అమ్మా అమ్మా అంటూ, ఆమె వెనక తిరుగుతున్నావ్. ఇప్పుడు మీ నాన్నగారు చూచి ఈమె నీ తల్లి కాదంటున్నారు. నాకేమీ అర్థం కావడంలేదు. నిజం చెప్పు, ఈమె ఎవరమ్మా" అని బుజ్జగిస్తూ రామారావుగారు అడిగారు.

సుగుణ మాట్లాడలేదు.

"ఇదిగో ఒకసారి త్వరగా రా. ఇక్కడ చాలా చిత్రం జరుగుతున్నది. నువ్వు చెప్తేకాని మా కెవ్వరికీ బోధపడదు" అని రామారావుగారు భార్యని పిల్చారు.

"ఏమిటి గొడవ" అంటూ వంటింట్లోనుండి శేఖరం తల్లి వచ్చింది. రామారావుగారు జరిగినదంతా ఆమెకు చెప్పారు. "ఇంతకీ ఈమె ఎవరైనట్టు?" అని అడిగాడు శేఖరాన్ని చూపిస్తూ.

శేఖరం తల్లి మాట్లాడలేదు.

"అసలు నువ్వు ఆడదానివేనా? లేకపోతే స్త్రీ వేషంతో ఇళ్ళల్లో ప్రవేశించే రంగడివా? నిజం చెప్పు. పారిపోవడానికి ప్రయత్నించావా ఇక నువ్వు మనిషివికావు" అన్నారు ఇనస్పెక్టరుగారు లేస్తూ.

శేఖరం ఏ సమాధానం చెప్పలేదు.

"వెంకట్రావ్" అంటూ ద్వారం వద్దకు వెళ్ళి ఇనస్పెక్టరుగారు తన ఆర్డర్లీని పిల్చారు. ఇంతసేపూ కునుకుతున్న ఆ రెండవ వ్యక్తి లేచి నిలబడి ఒక్క సెల్యూట్ కొట్టాడు.

"నువ్వు సబ్ ఇనస్పెక్టరు ఎక్కడవుంటే అక్కడికి వెళ్ళి, ఆడవాళ్ళని సోదా చేసే స్త్రీని ఒకసారి నేను పంపమన్నానని చెప్పి నీ వెంట తీసుకొనిరా. ఇక్కడే మనకు రంగడు దొరికినట్టుంది" అన్నారు ఇనస్పెక్టరుగారు.

ఇంకొక సెల్యూట్ కొట్టి వెళ్ళిపోయాడు ఆర్డర్లీ వెంకట్రావు

ఇనస్పెక్టరుగారు కూతురివైపు తిరిగారు ఆయన ముఖం గంభీరంగా మారింది.

"అమ్మా సుగుణా నువ్వు నిజం చెప్పాలి. ఈ వ్యక్తి ఎవరో నీకు తెలుసును. నేను రంగడు అనే పేరుబడ్డ దొంగని పట్టుకోవడానికి నియమింపబడ్డాను. ఆ రంగడు సాధారణంగా స్త్రీ వేషంలో ఉంటాడు. ఆ రంగడే ఈ వ్యక్తి అని నా అనుమానం. నువ్వు నిజం చెప్పకపోతే చాలా కష్టాలపాలు కావలసి వస్తుంది నువ్వు నా ఒక్కగాని ఒక్క బిడ్డవైనప్పటికీ, నా ఉద్యోగ ధర్మం నేను నిర్వర్తించక తప్పదు. నిన్నూ, ఈ వ్యక్తినీ పోలీసు స్టేషనుకి తీసుకుని వెళ్ళవలసి ఉంటుంది 'చదువుకొన్నదానివి కాస్త ఆలోచించి నిజం చెప్పు సత్యంవద' అనే ఆను శాసనాన్ని మన్నించు" అన్నారు.

ఏ పాపం ఎరుగని శేఖరాన్ని తన తండ్రి ఒక దొంగగా అనుమానిస్తున్నాడని తెలుసుకోవడంతో సుగుణ వెంటనే నిజం చెప్పడానికి నిశ్చయించింది. కాని, ఎలాగ చెప్పడమా ఆమెకు బోధ పడలేదు. మొదట శేఖరాన్ని వేలుతో చూపించింది. తర్వాత రామారావుగార్ని చూపించి "కొడుకు" అని తల దించుకొంది.

ఎవరికీ అర్థం కాలేదు. "ఏమిటి" అన్నారు. ఇనస్పెక్టరుగారు, రామారావుగారు. ఏక కంఠంతో సుగుణ తిరిగి అలాగే చెప్పింది. ఈసారి కొడుకు అన్న తర్వాత శేఖరం అన్న మాట కూడా కలిపింది.

ఈసారి అందరికీ బోధపడింది. ఎవరూ నమ్మలేకపోతున్నారు. "ఏమిటీ— ఇది నిడు—ఈ మనిషి మా శేఖరమా?" అన్నారు రామారావుగారు.

"అనుమానం ఎందుకు? చూద్దాం ఆగండి" అంటూ ఇనస్పెక్టరుగారు శేఖరంవద్దకు వెళ్ళి బర్మా ముడి పట్టుకొని పైకి లాగారు. ఆయన చేతిలోకి విగ్గు వచ్చేసింది.

బోడిగుండుతో, విగ్గుతో తల దించుకొన్నాడు

## 6

"ఏం రా అబ్బాయ్! ఈ ఆడవేషం ఏమిటి? పగటి వేషగాళ్ళ జట్టులో చేరావా?" అన్నారు రామారావుగారు కాస్త తీవ్రంగా.

"ఏమిటమ్మా ఈ నాటకం? చాల గమ్మత్తుగా ఉందే! అసలు జరిగిన కథేమిటి? తల్లి తండ్రులనే మభ్య పెట్టవలసిన అవసరం మీకు ఏ మొచ్చింది?" అన్నారు ఇనస్పెక్టరుగారు సుగుణ నుద్దేశించి.

"ఏమేవ్! ఇందులో నీకూ కొంత వాటా ఉన్నది. ఎన్నడూ నా వద్ద దాపరికం ఎరగని దానివి. ఇందులో ఇంత నిగూఢంగా ప్రవర్తించావేమిటి? నిజం చెప్పు" అన్నారు రామారావుగారు భార్యతో.

శేఖరంతల్లి తనకు తెలిసినంతవరకు జరిగినదంతా చెప్పేసింది. "అయితే ఆడవేషంలోఉన్న శేఖరం నిజంగా సుగుణ తల్లే అనుకొన్నాను ఇదివర కెన్నడూ ఆమెను చూడకపోవడంమంచి. ముఖం మాత్రం కొంత పరిచయంగా కనిపించింది. కాని, ఈ వెర్రినాగమ్మ ఆడవేషం వేశాడని కలలో కూడా అనుకోలేదు" అని ముగించింది.

తల్లి చెప్పలేకపోయిన వివరాలన్నీ శేఖరం పూర్తి చేశాడు. రెండు నిముషాలు నిశ్శబ్దం అయింది. చివరికి, "అయితే ఈ శేఖరాన్ని పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించావన్నమాట" అన్నారో ఇనస్పెక్టరుగారు.

సుగుణ జవాబు చెప్పకుండా తల దించుకొంది.

"ఈ బోడిగుండు— ఈ ఆడ స్వరూపాన్నే?" అన్నారు ఇనస్పెక్టరుగారు. సుగుణ మాట్లాడలేదు.

"బాగా ఆలోచించావా?" అన్నారు తిరిగి.

"ఆయన తిరుపతిలో మొక్కుకోవడంమంచి తల అలాగ తయారైయింది. ఇప్పుడు అవసరం కొద్దీ ఆడవేషం వేశారు. అంతేకాని, ఆయన మామూలుగా ఉన్నప్పుడు చూస్తే, మీకు ఈ అనుమానాలు రావే రావు" అన్నది సుగుణ.

"అలాగా" అన్నారు ఇనస్పెక్టరుగారు.

"సార్" అంటూ ఆర్డర్లీ వెంకటరావు వచ్చాడు.

ఇనస్పెక్టరుగారు లేచి బయటకు వెళ్ళారు. వెంకట్రావు చెప్పినదంతా విని, అతడిని పోలీసు స్టేషనుకు పంపించి, తను తిరిగి లోనికి వచ్చారు.

"అబ్బాయ్ పోలీసు స్టేషనుకి పద" అన్నారు పెద్ద గొంతుకతో—శేఖరం వైపు చూస్తూ.

"వాడెందుకూ?" అన్నారు రామారావుగారు నిర్ఘాంతపోయి.

"ఇతడు ఆడవేషంతో మీ ఇంట్లో దొరికాడు. మా ఉద్యోగ ధర్మం ప్రకారం మేము ఇతణ్ణి తక్షణం పోలీసు లాకప్‌లో పెట్టాలి. ఇతడే రంగడని మా అనుమానం. ఇతడు దొంగ కాపోతే ఆ మాట



మీదు బుజావు చేసుకొని విడుదల చేయించుకోండి" అన్నారు ఇన్స్పెక్టరుగారు.

రామారావుగారు ఆందోళనతో ఇన్స్పెక్టరు గారివద్దకు వచ్చారు. "ఇది అన్యాయం. మావాడు మా వాడేనని, తన క్లాసుమేటని, దొంగకాడని మా మగుణ సాక్షి. ఇతణ్ణి మీరు లాకప్‌లో పెడతా మనడం ధర్మంకాదు. ఏదో మర్యాదగా బ్రతుకుతున్న వాళ్లం. రేపు బోర్డుకట్టి ఎడ్వొకేటుగా మావాడు ప్రాక్టీసు ప్రారంభించబోతున్నాడు. ఇప్పుడు పోలీసు లతను అరస్టు చేశారని లోకానికి తెలిస్తే వాడి భావి జీవితం ఎంత దెబ్బ తింటుందో ఆలోచిం చండి. నా పరువూ, ప్రతిష్ఠ కూడా ఏమిటి అవుతుందో కాస్త ఆలోచించండి" అన్నారు ప్రాధేయ పడుతూ.

ఒక్క నిముషం మౌనం వహించి ఇన్స్పెక్టరు గారు అన్నారు. "మీరు చెప్పిన దాంట్లో కొంత నిజము లేకపోలేదు. మీ అబ్బాయిని పోలీసు స్టేష నుకి తీసుకొని వెళ్లను—ఏ అపకీర్తి రానివ్వను. కాని ఒక్క షరతుకు మీరు ఒప్పుకోవాలి."

"ఏమిటో చెప్పండి" అన్నారు రామారావుగారు ఆతృతతో.

"శేఖరానికి మా సుగుణని చేసుకోండి" అన్నారు ఇన్స్పెక్టరుగారు.

రామారావు తికమక పడ్డారు. "మీరు నన్ను చాలా ఇరుకులో పెట్టారు. మా వాడికి రెండు మూడు సంవత్సరాల క్రితమే సంబంధం నిశ్చయం అయిపోయింది. ఇప్పుడు వాళ్లని కాదంటే బాగుం డదు. ఈ విషయంలో మీరు నన్ను క్షమించాలి" అన్నారు.

"శేఖరం! నిన్ను రక్షించడానికి ప్రయత్నం చేశాను. కాని మీ తండ్రిగారే అభ్యంతరం పెడు తున్నారు. ఇక నేను చేసేది ఏమీ లేదు. నా ఉద్యోగ ధర్మం నేను నిర్వర్తించక తప్పదు. పోలీసు స్టేష నుకి పదు" అన్నారు ఇన్స్పెక్టరుగారు.

"మీ ఉద్యోగ ధర్మానికి మన స్వంత విషయా నికి ముడి పెడితే ఎలాగ ఇన్స్పెక్టరుగారు? వాడి పేరు శేఖరం అని తెలిసి కూడా వాడు రంగడు అంటే ఎలాగ?" అన్నారు రామారావుగారు.

"దొంగ ఆడవేషంలో ఉంటాడని మాకు అధి కార్లు ఆదేశించారు. ఆ ప్రకారమే ఇతడు మాకు దొరికాడు. ఇతడిపేరు శేఖరమో, రంగడో మాకు అనవసరం. ఇంకొక్క క్షణం నేను ఇక్కడ నిరీక్షిం చడం అనవసరం" అంటూ ఇన్స్పెక్టరుగారు వెళ్ళి, శేఖరం చెయ్యి పట్టుకొన్నారు.

"నేను జెయిలుకు వెళ్లవలసిందేనా నాన్న గారూ" అన్నాడు శేఖరం దీనంగా.

"మీకు వాడు ముఖ్యమా, డబ్బు ముఖ్యమా?

# వధూటి

వాడు మనసారా ఇష్టపడిన దానిని పెళ్ళి చేసుకో మంటున్నారుగాని, వాడికేం విషం పెట్టారా? మీ కంత పట్టుదల ఎందుకు? సుగుణవంటి కోడలు ఎలాగ దొరుకుతుంది? అదంటే ఇన్నాళ్ళ అంత అభిమానంగా ఉంటున్నారు. ఇప్పుడు మరిచి పోయారా? వెంటనే ఒప్పుకోండి" అన్నది శేఖరం తల్లి.

"మీ మాటే కానివ్వండి ఇన్స్పెక్టరుగారు. వాళ్ళకి ఇంకొక సంబంధం చూచుకోమని వ్రాసే

## కాలమహిమ

బియేలు పాసయ్యి బేరాలు ఆడేవు
స్వంతసొమ్ముకు ముందు స్వస్తిచెప్పేవు
పెండ్లియయ్యేదాక బింకంబుచూపేవు
పడతి వచ్చేదాక పడగాపు లాడేవు
ఉద్యోగమునకంచు ఊళ్ళన్ని తిరిగేవు
సాయంత్రమున కింట చల్లగా జేరేవు
పరువులేని బ్రతుకు బ్రతక లేనంటావు
పుచ్చుకున్నా సొమ్ము ఖర్చు పెట్టేవు
అందుకున్నా సొమ్ముహో త్రికర్పూరమై
హారియించిపోయెను ఆరు మాసాలకె
పెనుభూత మీవంచు పెరటిదార ట్టేవు
పోషించ లేకను పెనగులాడేవు
పట్టుకూ రమ్మంచు పుట్టింటి కంపేవు
తేలేకపోతేను తరిమిగొట్టేవు
పొట్టపగిలేటట్లు తిట్టిపోసేవు
కాలమహిమనునీవు కన లేవు తమ్ముడా
కన్నువిప్పి నీవు కాంచుమీ జగము.

యస్. యన్. బులుసు (కొవ్వూరు)

స్తాను. ఇంతకీ ఘటన ఎలా గుంటే అలాగ అవు తుంది" అన్నారు రామారావుగారు.

శేఖరం కళ్ళు సుగుణ కళ్ళూ ఆనందంతో మెరిశాయి.

"అది శభాషయిన మాట. శేఖరం, నువ్వు వెళ్ళి ఇరుగు, పొరుగు ఇద్దరు పెద్ద మనుష్యులని తీసుకొనిరా. మీ నాన్నగారు నేను ఇప్పుడే నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుంటాం" అన్నారు ఇన స్పెక్టరుగారు.

"ఓక్క నిముషం" అంటూ శేఖరం వెళ్ళ బోయాడు.

"ఆ వేషంతోటే వెళ్తున్నారేమిటి?" అన్నది సుగుణ నవ్వుతూ.

"అప్పట్టు మరిచిపోయాను" అని సిగ్గుపడి వేషం మార్చడానికి శేఖరం తన గదిలోకి వెళ్లాడు.

"బావగారు! ఆ సంబంధం వాళ్లు ఇరవై వేలు కట్నం ఇస్తారని, పిల్ల నలభై, ఏభై వేల ఆస్తితో వస్తుందని ఆశించారు. మాకు సుగుణ ఒక్కర్తే సంతానం. అంత స్థితిపరులం కాకపోయినా, మా అమ్మాయి కూడా ఓ పదివేల రూపాయల కట్నం తోనూ, పాతిక ముప్పై వేల ఆస్తితోనూ మీ ఇంటికి వస్తుంది. పైగా బి. ఎల్. చదువుకొంది. భగవంతుడు చల్లగా చూస్తే ఇద్దరూ వేలకి వేలు ఆర్జిస్తారు. ఇద్దరికీ, ఒకరిపైన ఒకరికి ఎంత గాఢమైన అనురాగం కల్గిందో మనకి ప్రత్యక్షంగా బుజావు అయింది. మా సుగుణ అంటే మీకు ఎంతో ఇష్టం కలిగినట్లు మీరు చెప్పకపోయినా తెలు స్తూనే ఉన్నది. మీ అనుమతి పొందడానికే వాళ్ళు ఇంత ప్రయత్నం చెయ్యవలసి వచ్చింది. ఇంకొక విషయం. వార్ధక్యంలో మనల్ని అభిమానించే కొడుకుకంటే అభిమానంతో చూచే కోడలే ముఖ్యావ సరం. ఆ మొదటి సంబంధం వాళ్ల గురించి కూడా మీరు విచారించ నక్కరలేదు. కావలసినంత ధన వంతులు అని చెప్తున్నారు. వాళ్ల అమ్మాయికి నిముషాలమీద ఇంకొక సంబంధం కుదుర్చుకో గలరు" అన్నారు ఇన్స్పెక్టరుగారు.

"మీరు చెప్పినదంతా నిజమే సుమండీ" అన్నారో రామారావుగారు.

ఇద్దరు పెద్ద మనుష్యులను వెంట బెట్టుకొని శేఖరం వచ్చాడు. వారి ఎదుటి లాంఛనంగా రామా రావుగారు ఇన్స్పెక్టరుగారు నిశ్చయ తాంబూలాలు పుచ్చుకొన్నారు.

"ఇప్పటివరకు చెప్పడం మానే—మరిచిపోయాను ఆ రంగడనే దొంగ దొరికాడట—ఆడవేషంలోనే. మా ఆర్డర్లీచేత సబ్ ఇన్స్పెక్టరు కబురు పంపాడు. చోరీ ఆస్తి కూడా చాలావరకు దొరికిందట. నేను పోలీసు స్టేషనుకు పోవాలి" అంటూ ఇన స్పెక్టరుగారు లేచారు.

భోజనంచేసి వెళ్లమని రామారావు దంపతులు ఆయన్ని బలవంతం చేశారు.

"ఇప్పుడు తీరిక లేదమ్మా. ఇకమీదట మీకు మాకు కావలసినన్ని భోజనాలండి బావగారూ! నేను వెళ్ళి వస్తా. నువ్వు ప్రయాణానికి సిద్ధంగా ఉండు సుగుణా! నేను సాయంత్రం వస్తాను. ఈ శుభవార్త మీ అమ్మకి నువ్వే చెప్పాలి సుమా" అని నవ్వుతూ మెట్లు దిగారు ఇన్స్పెక్టరుగారు. ★

దాన్ని ధరించవలసిందిగా కోరాడు. వరమానంద భరితురాలై ఆమె ఆ నీలి వజ్రాన్ని ధరించి రంగ స్థలం దీపాలముందు వచ్చి నిలబడింది. వజ్రపు కాంతిని మెచ్చుకుంటూ ప్రేక్షకులు ఆశ్చర్యపోయి చూస్తున్నారు. ఉన్నట్టుండి ప్రేక్షకులలోవున్న లాడ్యూ మరొక ప్రియుడులేచి, జేబులోంచి పిస్తోలుమ తీసి, రంగస్థలంమీదున్న నర్తకివి గురి పెట్టి కాల్చాడు. ఆమె గట్టిగా కేక పెడ్తూ, కిందపడి కొన్ని నిముషాలలో చనిపోయింది. రంగ స్థలం అంతా రక్తమయమయింది. ఇది జరిగిన రెండు రోజులకే రష్యన్ యువరాజు వీధిలో వెళ్తూం డగా, ఎవరో వెనుకనుండి వచ్చి అతన్ని బాకుతో పొడిచి చంపేశారు. యువరాజుకు వజ్రాన్ని అమ్మిన కోలాట్ అనే వ్యాపారికి అప్పటికి చేతికి సగం డబ్బే వచ్చింది. ఇక పూర్తి డబ్బు రాదనే నిరాశతో అతను ఆత్మహత్య చేసుకున్నాడు.

ఆ తరువాత ఒక గ్రీకు వర్తకుడు ఈ వజ్రాన్ని టర్కీ దేశపు సుల్తానుకు అమ్మాడు. ఆ రాత్రి వర్తకుడు భార్యా పిల్లలతో ఒక కొండ మార్గం

# నీలి వజ్రపు శాపం

15—వ పేజీ తరువాయి

గుండా ప్రయాణం చేస్తూండగా అతను వెళ్తూన్న బండి బోల్తా కొట్టి, కొండ శిఖరం మీదనుండి క్రింద పడింది. వరకుడు కుటుంబంతో సహా చనిపోయాడు. సుల్తాన్ ఆ స్థానంలో వజ్రాన్ని చూసుకుంటున్న ఉద్యోగి ఏదో కారణానికి శిక్ష పొంది, చెరలోపడి, పిచ్చివాడయాడు. కొన్నాళ్ళకు టర్కీయులు విప్లవం లేపి, సుల్తానునే రాజ్య భ్రష్టుని చేశారు.

తరువాత మూడు సంవత్సరాల వరకు వజ్రం జాడ ఎవ్వరికీ తెలియలేదు. 1911 వ సంవత్స రంలో అమెరికాలోని ఒక నగల దుకాణంలో ఆ నీలి వజ్రం ఉన్నట్టు తెలిసింది. దాన్ని కొనాలని మిసెస్ ఎడ్వర్డ్ మెక్లీన్ అనే ఆమె నిశ్చయిం చింది. ఆమె చాలా ఆస్తిపరురాలు. కానీ, వజ్రపు చరిత్ర ఎరిగున్నది కనుక కొనడానికి ముందు ఒక షరతు పెటింది. వజ్రాన్ని ధరించిన తర్వాత ఎవరికైనా కీడు కలిగితే, దాన్ని వెనక్కు తీసుకోడానికి దుకాణంవారు ఒప్పుకోవాలి. ఈ షరతుమీద కొంత తర్జన భర్జన జరిగింది. చివరకు దుకాణం వారు దీనికి ఒప్పుకున్నారు.

కాని, కొన్న తర్వాత వజ్రపు విలువనుగూర్చి ఒక తగాదా ఏర్పడి, ఆమెకు దుకాణం వారికి కొన్ని సంవత్సరాల వరకు కోర్టులో వ్యాజ్యం జరిగింది. ఇంతేకాదు. మిసెస్ మెక్లీన్‌కు ఒక్కగాని ఒక్క కొడుకు. పేరు విన్సన్. తన ఆస్తినంతా వారసుడైన ఆ పసిబిడ్డే ఆమెకు సర్వస్వం. 1919 మే నెలలో విన్సన్ దాది చేతుల్లోంచి క్రిందికి దిగి రోడ్లోకి పరుగెత్తగా, దురదృష్టవశాత్తు ఎదురుగా వస్తున్న కారు క్రిందపడి చనిపోయాడు.

మాక్మిలన్ వివరించిన చరిత్ర ఇంతటితో ముగిసింది. కానీ, తన భయంకర శాపానలంతో జీవితాలను భస్మం చేస్తున్న హోప్ వజ్రపు కథ ముగిసిందా? దీని శక్తికి ఆహుతి అయ్యే వారు ఇంకా ఎందరు? భవిష్యత్తే చెప్పాలి. ★

# చదువల్రావ - బి. వి. సత్యమూర్తి



మొదటి జాతివారు అర్జునుడు మత్స్య యంత్రం పడకొట్టినంత అవలీలగా తాము ఈ ఉద్యోగాన్ని "కొట్టెయ్యగల" మనే ధీమాతో ఉన్నారు. వాళ్ళు అప్పుడే ఆఫీసర్లయిపోయినట్లుగానే భావించుకొని అదే పద్ధతిలో నడుస్తున్నారు, కూచుంటున్నారు, మాట్లాడుతున్నారు కూడాను. రెండో తరగతి వారు చాలా బిడియస్థులు. మాట్లాడితేనే కొంప లెక్కడ అంటుకుంటాయో నన్న భయం స్పష్టంగా కనపడుతోంది. ఈ ఉద్యోగం వస్తుందో రాదోనని వూరికే మధనపడుతున్నారు. ఇంక మూడో గ్రూపువాళ్ళు దేన్నీ ఖాతరు చేస్తున్నట్లు లేదు. ఇలాంటివి ఎన్ని చూశామో అన్న ఫోజు పెట్టారు. వాటిలో ఇదొకటి. తగిలితే మంచిదే, లేకపోతే మరీ మంచిది అన్నట్లు ఉన్నారు.

ఇంతలో మా పక్కన కూర్చున్నాయనకు వూరికే కూచోవటం విసుగు పుట్టింది కాబోలు ఏం చదివావని మావాడ్నడిగాడు. బియస్సీ ఫస్ట్‌క్లాసని ధీమాగా చెప్పాడు వీడు. మరి మీరేం చదివారు అని కూడా అడిగాడు.

"ఎమ్‌కామ్ ఎల్ ఎల్. బి" అన్నా డాయన. ఆ తరువాత ఇంకా ఇద్దరు ముగ్గురు వచ్చి మా క్వాలిఫికేషన్లడిగి వాళ్ళవి అడక్కుండానే వెల్లడించి వెళ్ళారు. చివరికీ తేలిందేమిటంటే ఇంటర్వ్యూకు వచ్చినవాళ్ళలో మూడొంతులమంది పోస్టు గ్రాడ్యుయేట్లని, మిగిలినవాళ్ళలో చాలామంది డబుల్ గ్రాడ్యుయేట్లనీను. అప్పటికే మావాడికీ కొద్దిగా దిగులు పట్టుకుంది. కాని అప్పటికేం చెయ్యలేక వూరుకున్నాడు.

ఇంతలో వో చిన్న కలకలం బయలుదేరింది. అక్కడున్నవాళ్ళంతా లేచి ఓ మూలకు పరుగెత్తుతున్నారు. ఏం కొంప మునిగిందోనని మేం కూడా పరుగెత్తాము. అక్కడ ఒకాయన కూచుని ఇంటర్వ్యూలో గల పరమార్థాన్ని బోధిస్తున్నాడు, దగ్గర మార్గాలు, అడ్డదార్లు మొదలైనవి విపులీకరిస్తున్నాడు. అసలు శ్రీకృష్ణ పరమాత్మ గీతను బోధించినంత సులువుగా "వోస్ ఇంతేనా ఇంటర్వ్యూ అంటే" అనిపించేటట్లు చెప్పేస్తున్నాడు. ఆతర్వాత "కాసబ్లాంకా కూటమి రాజ్యాలకు మన్రోవియా కూటమి రాజ్యాలకు టోగో ప్రెసిడెంటు హత్యను పురస్కరించుకుని యుద్ధం రాగలదా లేదా, కాంగో పరిస్థితి చక్కబడినట్లేనా ? మన బంగారపు కంట్రోల్ గురించి మీ అభిప్రాయ మేమిటి ? ప్రజలు — ప్రస్తుతపు బడ్జెటు అనే అంశమును వివరించుము" అంటూ శరపరంపరగా ఒక డజను ప్రశ్నలు గుప్పించేసి "ఈ క్వొశ్చన్లు చాలా ఇంపార్టెంటండి. ఈ రోజుల్లో మీరు ఏ ఇంటర్వ్యూకు వెళ్ళినా వీటిలో ఏ రెండు ప్రశ్నలైనా అడక్కపోతే చెవి కోయించుకుంటా" నన్నాడు. ఒక నిముషం ఆగి "మీలో ప్రతి ఒక్కరు ఉద్యోగానికి సెలక్టు కావాలని కాంక్షిస్తున్నాను. నేను చాలా బీదవాడ్ని, మీబోటివాళ్ళు సంతోషపూర్వకంగా సహాయంచేస్తే కృతజ్ఞుడ్ని" అని తన గోడు వెళ్ళబోసుకున్నాడు. ఈ మాటలు వినగానే అక్కడున్న వాళ్ళలో చాలామంది పులిని చూసినట్లుగా

# ఇంటర్వ్యూ

13 వ పేజీ తరువాయి

పారిపోయారు వారిలో ఒకాయన ఒక మహా సత్యాన్ని వెల్లడించినట్లుగా "ఇందుకనేనండి మన దేశం ఇంత హీనస్థితిలో ఉంది. అసలు ఇతన్ని హాలులోకి ఎవరు రానిచ్చారు" అని కోప్పడ్డాడు. కొంతమంది మాత్రం రూపాయో, అర్ధో ఇచ్చారు. మొత్తానికి వో పది రూపాయలదాకా పోగయింది. అతను అందరికీ తన కృతజ్ఞతలు వెల్లడించి మళ్ళా అందరూ సెలక్టు కావాలని ఆశిస్తున్నానని సెలవు పుచ్చుకున్నాడు.

తరువాత ఒక గుమాస్తా వచ్చి అక్కడివాళ్ళందర్నీ వాళ్ల ఉద్యోగాల వారీగా విభజించి వాళ్ళు ఎక్కడికి వెళ్లి కూచోవాలో చెప్పి వెళ్లిపోయాడు ఇంటర్వ్యూకు రాని నాబోటివాళ్ళ ఒక అరడజను మంది మాత్రం హాలులో మిగిలాము.

ఒక గంట పోయాక మావాడు ఏడుపు మొహంతో బయటకు వచ్చాడు. సంగతేమిటో చెప్పకుండానే వీధిలోకి లాక్కొచ్చాడు. తరువాత భోరుమని 'తనకు ఆఫీసరయ్యే యోగ్యత లేద న్నాడు. ఇంక జన్మలో ఇంటర్వ్యూకు వెళ్ల నన్నాడు. ఇంటర్వ్యూలను, ఉద్యోగాలను, గవర్నమెంటును తిట్టిపోశాడు. చివరకు అసలు విషయం చెప్పేశాడు. అసలు సంగతేమిటంటే మొదట మేమున్న హాలులో హడావుడి తరువాత అక్కడి వాళ్ళలో చాలామంది పోస్టు గ్రాడ్యుయేట్లవటం మావాడ్ని కొద్దిగా గాభరా పెట్టింది. పైగా ఇంటర్వ్యూ గురించి వివరించినతని ఉపన్యాసం, ప్రశ్నలు వినగానే సగం నీరసించాడు. ఎందుకంటే అట్లాంటి ప్రశ్నలకు మావాడు "ప్రిపేరు" కాలేదు. దానికి తోడు వీడి పేరు ఆరోజు ఇంటర్వ్యూకు వచ్చిన వాళ్లలో మొదటిది కావటంచేత మిగిలినవాళ్లను ఎలాంటి ప్రశ్నలు వేస్తున్నారో తెలుసుకునే అవకాశం లేకపోయింది.

ఇంటర్వ్యూ చేసే గదిలోకి అడుగు పెట్టగానే అక్కడ కూర్చున్న నలుగురు మెంబర్లు మావాడి కంటికి కాటు వెయ్యటానికి సిద్ధంగా ఉన్న తాచుపాముల్లాగా, ఎర మీదకు దుమికే పెద్ద పులుల్లాగా, వినటానికి శ్రోతలు దొరికిన రాజకీయ నాయకుడిలాగా, పాలసీ తీసుకుంటానన్న మనిషి దొరికిన ఇన్సూరెన్సు ఏజంట్లులాగా కనిపించారట అందులో ఒకాయన బట్టతలతో నున్న యముడులాగా ఉన్నాట ఆయన "విలన్" లాగా ఒక నవ్వు నవ్వి వీడ్ని కూర్చోమని "నేషనల్ ఎమర్జన్సీ" ఎందుకొచ్చిందో తెల్సాఅని గదమాయించి యించి అడిగాడు. వీడు బిక్కు బిక్కుమంటూ "తెలుసు" అన్నాడు. ఎందుకొచ్చిందో చెప్పు అని మళ్లీ అడిగాట్ట. ఇంతలోనే మావాడికి అర్జెంటుగా తుమ్ము వచ్చింది. అప్పుడు తుమ్మితే ఆఫీసరు పద్ధతిలో ఉండదని అభిప్రాయపడినవాడై ఆపటానికి శత సహస్ర విధాల ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది.

అటువంటి సమయంలో తుమ్ము వస్తుందని మావాడు కలలోనైనా వూహించలేదు. మావాడు అపటానికి ప్రయత్నించడంవలన దానికి కోపంవచ్చి ఇంకా ఎక్కువ ఫోర్సుతో హాచ్చి . హాచ్చి ... హాచ్ఛీ అనే శబ్దంతో మూడుగా బయటకు దూకింది అనుకోకుండా వచ్చిపడ్డ ఈ అవాంతరానికి కమిటీ మెంబర్లు నలుగురు స్తంభించిపోయారు. వారి మొహాలు చూడటానికి మావాడికి భయం వేసింది. తను చేసిన ఈ ఘోరకృత్యానికి తనకు యావజ్జీవ కారాగారశిక్ష వేస్తారు కాబోలు నన్నట్లుగా భావించారు అసలు తనను తుమ్ము ఆపటం కూడా చేతకాని చవటగా జమ కట్టారేమోనని బాధపడ్డాడు. తనకిక గత్యంతరం ఏమిటి, చేతికొచ్చిన ఆఫీసరు ఉద్యోగం ఒక్క తుమ్ము మూలంగా చెయ్యిజారి పోతోందే. ఇహ ఎప్పటికైనా తనకు ఆఫీసరు ఉద్యోగం వస్తుందా అని మావాడు బాధపడుతున్న సమయంలోనే "బట్టతల యముడు" గారు ఒక ప్రశ్న వేశాడు. అది వీడికి సరిగా వినపడలేదు వినపడిన భాగానికి సమాధానం చెప్పటానికి నోరు పెకిలి రాలేదు. ఈలోగానే ఇంకొక మెంబరుగారు అందుకున్నాడు. దాంతో వీడికి గాభరా ఎక్కువయింది. ఏ ప్రశ్నకు సమాధానం చెప్పాలో అర్థంకాలేదు. మొత్తం ప్రశ్నలకు సమాధానంగా శ్రీ—కే. నెహ్రూగారు అంబాసడర్ జనరల్ ఆవ్ అమెరికా ఇన్ ఇండియా అనేశాడు. ఈ సమాధానం వినటంతోటే వాళ్లకు మతిపోయి "అయ్యా తమరు ఇంక శలవు పుచ్చుకోవచ్చు" ననేశారు.

ఇదీ మావాడి మొదటి ఇంటర్వ్యూ ముచ్చట.

★



**ఆవ ఫొటో బ్లాకు ఎంతో వినయంగా ప్రజల ముందు వినమ్రుడై నమస్కృతులు సమర్పిస్తున్నట్టుగా మొదటి పేజీ—,**

ఆ వెనుక తానెవరు ? తన జీవితాశయం నేటి పరిస్థితులు—, ప్రభుత్వం దుబారా ఖర్చులు పార్టీల అనిశ్చిత పరిస్థితులు— తాను గెలువబోయే విధానము— ప్రజల సంసిద్ధత— గెలువగనే తాను తలపెట్టనున్న మూట నలబై నాలుగు పథకాలలోని ప్రధాన సారాంశము.

ఈ కరపత్రాలు విడుదల కాగానే గుమ్మడికాయల సూరయ్యకు ముచ్చెమటలు పోశాయి. పూర్తిగా చదవగానే ఆయన సొమ్మ సిల్లిపడిపోయాడు.

ఈ విపత్కర పరిస్థితిని దాటి పోటీ నుండి శాస్త్రిని విరమింప చెయ్యడానికి సూరయ్య విశ్వ ప్రయత్నాలు చెయ్యగా చెయ్యగా నామినేషన్లు ఉపసంహరించుకోవడానికి గడువు సరిగ్గా ఏడు నిమిషాలు ఉండగా ఫలించినది.

ఎన్నికల ప్రచారానికి సూరయ్య కొన్న కొత్త జీపు శాస్త్రి స్వాధీనం చేయబడినది. ఆ జీపులో సూరయ్య కోసం ప్రచారం చేస్తున్నట్లు శాస్త్రి నటిస్తూ సూరయ్యకు పోటీగా ఉన్న పెసరట్ల ఆనందయ్య వద్ద రెండువేలు తీసుకొని అతనికే సాయం చేశాడంటారు. నిజానిజాలు దేవుడికి తెలియాలి గాని ఆ ఎన్నికల్లో సూరయ్యా గెలవలేదు ఆనందయ్యా గెలవలేదు. గెలిచినాయన ఇంకో ఘటికుడు. ఆయన పేరు ఈ క్షణాన గుర్తుకు రాకపోవడం శాస్త్రి విస్తృతమైన ప్రభావమే కారణమని అంగీకరించక తప్పడంలేదు.

ఏదేమైతేనేం శాస్త్రి జీపును సంపాదించాడు. అది రోడ్డు వెంబడి దుమ్మును రేపుతూ పోతుంటే బాటసారులు "అతడే అతడే శాస్త్రి. పోయిన దఫా చాలుకొన్నాడు కాని ఈ మారు నిలిస్తే అతడికి ఓట్లతోపాటు నోట్లు కూడా వేస్తారు" అని అంటూ ఉంటారు.

శాస్త్రి బాగా స్థిరపడిపోయిన ప్రజా సేవకుడు. నాయకుడనడం అతనికి ఇష్టంలేదు. సేవకుడంటేనే అతడికి చాలా ఇష్టం.

ఉన్నట్టుండి శాస్త్రికి మరో సిరి పట్టుకొన్నది. సిరి ఆయన్ని పట్టుకొన్నదో లేక ఆయనే సిరిని వెదకి కనుగొని పట్టుకొన్నాడో చెప్పడం కష్టం. అక్కడి జనాలంతా ఆయన త్యాగాన్ని ఆదిశేషునికే మాత్రం తీసిపోని విధంగా అభివర్ణిస్తారు.

చిలకలపాళెం నుండి బుంగలగుంటకు పది మైళ్లగదా. ఈ బాట కిరువైపులా ఉండే మద్ది, నేరేడు, చింత, వేప, కానుగ, తాటి, రాగి, మర్రి ఇత్యాది వృక్షములన్నీ రాత్రికి రాత్రే అదృశ్యమైపోయాయి. ఒక్క రాత్రిలో కాక పోయినా ఒక్క అర్ధ సంవత్సరంలోగా ఈ పథకం పూర్తియైపోయినది. ఆ రోడ్లో వెడుతుంటే వన కాంతలవలె పచ్చగా ఆశీర్వదిస్తుండిన వృక్షాలు తలలు బోడులై, మోడులై, మొక్కలై, చివరికి క్రమక్రమంగా కూకటి వేళ్లతో సహా అదృశ్యమైపోయినవి.

**ఈ పథకం పూర్తి కాగానే శాస్త్రి బుంగల**

# ప్రజాసేవకుడు

11-వ పేజీ తరువాయి

గుంట స్థానికాధికారులను, ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోస్తూ స్థానిక పత్రికలలో నిరంతరంగా ప్రకటనలిస్తూ వచ్చారు. అన్నిటినీ సఫా చేయించి అందులో మంచి ఆదాయాన్ని సంపాదించి చివరికా అన్యాయాన్ని చేసిన వారిని దండించాలంటూ శాస్త్రి నల్పిన ఆందోళన ఫలితంగా అక్కడి అధికారులు బుంగలగుంట చిలకలపాళెం రోడ్డులో ఆరు బోర్డులు వేశారు.

"రోడ్డుమీద చెట్లు నరుకువారు శిక్షింపబడుదురు."

ఈ చర్యతో రోడ్డులో కొమ్మ పడినా తక్షణం ప్రక్కకు ఈడ్చి ప్రజలక్కడ ఆ కొమ్మలను ముక్కలు చేయడం ఆరంభించారు.

శాస్త్రి సంపాదనలో బాగా మిగిలిపోయినా అనుక్షణం ఏదో ఒక మహత్తరమైన బృహత్ప్రణాళికను గురించి ఆలోచిస్తూ ఉంటాడు.

ఇప్పుడాయన బుంగలగుంటలో ఒక బుల్లి మేడను కూడా కొన్నాడు. సొరుక్కలో కూచునే దౌర్భాగ్యం లేదాయనకు.

చిన్నగా సన్నగా నవ్వుతూ ఏదో దీర్ఘంగా ఆలోచించే ఆయన ప్రసన్న వదనాన్ని చూచి గొప్ప గొప్ప న్యాయవాదులే ముగ్ధులై పోతూ ఉంటారు. అంతో ఇంతో పలుకుబడి కల రాజకీయ నాయకులు మనస్సులో ఇష్టం లేకున్నా అత్యంత మర్యాదగా అతనికి నమస్కారాలర్పిస్తూ ఉంటారు.

అత డే ఆఫీసుకు వెళ్లినా క్షణాల మీద అతని పని పూర్తయిపోతూ ఉంటుంది. ఇప్పుడసలు వెళ్ళే అవసరం కూడా లేదు. ఇటీవలె ఫోను కూడా పెట్టుకొన్నట్లు బుంగల గుంట టెలిఫోన్ గైడు సాక్ష్యమిస్తున్నది.

అన్నిటికంటే ఆశ్చర్యమేమంటే ఉన్నట్టుండి చక్కెర కరువువచ్చి బుంగలగుంటేకాదు దేశమంతా అఘోరిస్తుంటే, చేతకాకుండా అల్లల్లాడుతుంటే, శాస్త్రి క్షణాలమీద వందా యాభై కిలోలు తెప్పించాడు. "ఇంత చక్కెరే.... బ్లాక్ మార్కెట్లోనా" అంటూ తన కళ్లను తానే నమ్మలేకుండా కళ్లు నులుము కుంటున్న కంపెనీ చెంగయ్యతో

"బ్లాక్ మార్కెట్లా. న్యాయంగానే.. ఇదో చూడు పెండ్లి పత్రికలు" అంటూ మూడు పత్రికలు ముందుంచాడు.

ఒకటి....

స్వస్తిశ్రీ శోభకృతునామ సంవత్సరం...... సింహ లగ్నమున....

నా కుమారుడు కల్లాపేట ఎల్లయ్య

సకలపాణికి చెంగమ్మకు కుమార్తె

మంగల చెరువు ఎల్లమ్మ గుడిలో పెండ్లి గాన అందరూ విచ్చేయు ప్రార్థన.

ఇట్లు,

కుళ్లం ఎర్రయ్య.

ఇట్లా ముగ్గురి పేర్లతో మూడు పెండ్లి పత్రికలు, అన్నీ బమాబమా ప్రెస్సులో అచ్చయినవే.

బుంగల గుంట తాశీల్దారుగారు శాస్త్రి పంపిన ముగ్గురు మనుష్యులకూ తలో యాభై



విశేషంగా మాట్లాడినంతలో యోచనాపరుడగునని పరిగణించ తగదు!

# ఎదురు తెన్నులు

## బి. యస్. యల్. పి. దేవి

సందె చీకటిలోన చందమామతోడ
యమునా నదికి నన్ను రమ్మంటివే, కృష్ణ
మోస జేసీ నీవు రావైతివే!!

ఎదురు తెన్నులు జూచి కనులు కాయలు గాచె
ఎదలోని వ్యథ పొంగి పొరలేనురా, కృష్ణ
ఏల నీకీ జాగు యదునందనా!!

మలయ పవనుం డొకడు మరుని మా మింకొకడు
మదనాగ్ని కీలలం బడవైచెరా, నీదు
యలుసు గని నను వారు గారించెరా !!

ఏ గోప భామలో యేకాంతముంటివో
ఎటుల నే నిలు సేరగల్గుదురా, యింత
తడవేల ననగనే నేమందురా !!

పెద్దలుండినదాన పిన్నవయసూ దాన
నలుగురిలో నగుబాటు సేయకయ్యా, నీకు
పున్నమాయెను గాని పురుషోత్తమా !!

సంజకెంజాయలో చంక బిందెను బెట్టి
చక్కంగ నీటికని వచ్చేనురా, యింక
జాగు సేయక నన్ను మన్నించరా !!

గజదొంగవలె వచ్చి కనులు మూసే నిన్ను
కలనైన నే నెటుల మరచేనురా, కొంటె
గోపాల నీ మాట లేమందురా !!

జాగు చేసితి నంచు చెలులందరూ నన్ను
జేరి హేళన మెంతో చేసేరురా, యింగ
ఇకనైన నొకమారు కనుపించరా !!

అదియేమొ నా ప్రభూ నీ అందచందాల
ఆలోకనము దివిని జేరేనురా, కృష్ణ
అమర సుఖముల నేను బొందేనురా !!

ఏనాటి ప్రేమల అనుబంధమో గాని
ఎద నిన్నె అనుక్షణము గోరేనురా, యిందు
కీలకంబేమొ నా హృదయ చోరా !! ★

# ప్రజా సేవకుడు

కిలోలు శాంక్షన్ చేశారు. అది ఆయన ధర్మం. ఈ దేశానికి పట్టిన కర్మం. కాళ్ళాస్త్రి హృదయంలో ఉన్న మర్మం.

"నాకో నాల్గు కిలోలు" అన్నాడు లొట్టలు వేస్తూ కంపల చెంగయ్య.

"ఊళ్ళో బ్లాక్ మార్కెట్లో కిలో మూడు రూపాయలు. నీకు రెండుంపావలా" అన్నాడు కాళ్ళాస్త్రి.

ఎంత మంచివాడు కాళ్ళాస్త్రి అనుకొన్నాడు కంపల చెంగయ్య.

నిజానికి కిలో రూపాయిపావలా ఐనా కార్డుగానీ పర్మిటుగానీ వీటికి తగ్గ సిఫార్సుగానీ ఉండి తీరాలి. అది లేనపుడు బ్లాకులో కిలోకు మూడు రూపాయలు తగల బెట్టాలి.

అలాంటపుడు కాళ్ళాస్త్రి కిలో రెండుంబావలాకిప్పిస్తుండేటే ఎంత త్యాగం ! ఎంత త్యాగం ! ఎవరితరము ! వర్ణించ నలవియా ? వేయి శిరస్సుల శేషునికైనా !

సరిగ్గా ఇలాంటి పదాలతోనే కొన్ని రోజుల క్రిందట కాళ్ళాస్త్రి కూతురి పెళ్ళిలో పంచరత్నాలు చదివాడొక అభ్యుదయ రచయిత.

కవి వాక్కు వృథా కాదంటారు. ఎందుకంటే ఎలుంగొడ పల్లె సిగరమాన్ల సుందరయ్యతో సంబంధం కుదుర్చు కోవడం సామాన్యమైన విషయంకాదు. సిగరమాన్ల సుందరయ్యకు మూడు బస్సు రూట్లున్నాయి. ప్రతి నిత్యమూ ప్రతి ట్రిప్పుకూ ప్రతి బస్సులో వందా ఇరవైమూడు మందికి తక్కువ లేకుండా ప్రయాణం చేస్తుంటారు. ఈ మూడు పుష్పక విమానాలతో ఎలుంగొడ్లపల్లె సిగరమాన్ల సుందరయ్య ఎంతటివాడైనాడంటే ఆ ప్రాంతంలోని అడివి పల్లెం పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్లలో ముప్పాతిక మందిని కొని సమితి ఎన్నికల్లో సరాసరి కుంభకోణానికి రవాణా చేసిపారేశాడు. సరిగ్గా కో ఆప్షన్ సభ్యుల ఎన్నికనాడు మూడు గంటలా ఐదు నిమిషాలా ఇరవై ఐదు సెకెండ్లకు టూరిస్టు బస్సు ఇరవై ఆరుమంది పంచాయితీ బోర్డు అధ్యక్షులతో డిప్యూటీ కలెక్టర్ ఆఫీసు ముంగిట సోపానాలను స్పృశిస్తూ నిలిచింది.

ఆ దెబ్బతో సిగరమాన్ల సుందరయ్య మనుషులు మరో ఆరుమంది సభ్యులై ఎదుటివాడికి చావుదెబ్బ తగిలి తానే ఏకగ్రీవంగా ఎన్నికైనాడు.

బుంగల గుంట తాలూకా కేంద్రమైనా ఎలుంగొడ్ల పల్లెలోనే సమితి స్థితి యేర్పడి అక్కడ సుందరయ్య రాజ్యం ఎంతో అందంగా సాగుతున్నది అప్సరసల నృత్యాలతో.

అతని కుమార రత్నం అరవ సినిమాల్లో నాయ

కుడులాలాగా గర్జిస్తాడు. జాలీ జాలీ చేసుకొనే పేద బిక్కికి రత్నమంటే భయం. అతనికే కాళాస్త్రి కుమార్తెను ఇవ్వడానికి నిశ్చయించు కొన్నారు. కట్నం కానుకా లేకుండా జరిగిన ఈ వివాహానికి బ్రహ్మాండమైన పొలిటికల్ బ్యాక్‌గ్రౌండ్ ఉందనీ వచ్చే ఎన్నికల్లో కాళాస్త్రి సుందరయ్యా ఏకమై సుందరయ్య కొడుకు రత్నాన్ని యం. యల్. ఏగా చేసి పారేస్తారనీ—, ప్రస్తుతం దేశంలో ఇలాంటి ఆలోచనలూ—, కార్యాచరణాలూ అసంఖ్యాకంగా జరుగుతున్నందున ఇందులో ఆశ్చర్య పడవలసిన విశేష మేమీ లేదని బుంగల గుంట స్థానిక పత్రిక టాంటాం ఒక పతాక శీర్షికను ప్రచురించినది.

ఆ పెండ్లికి హాజరైన అనేకమంది పెద్దల పేర్లను వరుసగా ప్రకటిస్తూ బుంగల గుంట తాలూకా మొత్తం ఆర్థికంగానూ, సాంఘికంగానూ రాజకీయంగానూ, విద్యా విషయకంగానూ కాళాస్త్రి గుప్పిట్లోకి వచ్చేసిందని ఆ విలేఖరి స్పష్టంగా ఉద్ఘాటించాడు.

అందుకు తగ్గట్టుగానే కాళాస్త్రి కూడ ప్రథమంగా ఎలిమెంటరీ స్కూళ్ల టీచర్లపై ట్రాన్సఫర్లనే వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. ఈ క్రొత్త వ్యాపారంలో ఆయనకు అనుకొన్నంత మొత్తం అందకపోగా ఈ బడిపంతుళ్లు మూక ఉమ్మడి ప్రచారం మొదలు పెట్టారు.

ఇట్లా కలకాలం నుండి ఆర్జించిన కీర్తి ప్రతిష్ఠలు నశించి పోవడం తనకే మాత్రం ఇష్టం లేక కాళాస్త్రి తన దృష్టిని తీపికల్లంగళ్ల పైకి మరల్చి చల్ల కదలకుండా కూచున్నాడు

వాటిపేరు తీసికల్లంగళ్లైనా అవి అసలు కల్లు పాకలకు ఎందులోనూ తీసిపోవు ముద్రలులేని ఈతచెట్ల శిఖల్లో తాటికాయల్లా ముంతలు వ్రేలాడుతుంటే ప్రొద్దు పొయ్యేలోగా ఆ వూటకంటే వేయిరెట్లు పయాపైసలు కన్పిస్తున్నాయి.

ఈ నాడు కాళాస్త్రిగారికి తీరికే లేదు. పాపం అర్జీల కోసంగానీ పిటిషన్ల కోసంగానీ జనాలతని దగ్గరికి వెళ్లడమే మానేశారు. అతడూ అంతే. అవసరమైతే ఏ ఆఫీసర్నయినా ఇంటికి పిలిచి మాట్లాడుకొంటాడు. అంత ముఖ్యమైన పనైతే అధ్యక్షుడు సుందరయ్య అంచెల మీద వెళ్ళి వస్తాడు.

మూడు పుష్పక విమానాలు తిరుగుతూ ఉన్నాయి.

నూరు నీరా అంగళ్లు జరుగుతూ ఉన్నాయి.

కనుసన్నల్లో కావలసినంత సిబ్బంది ఉండగా కాళాస్త్రి సామాన్య జనం కంటికి దూరం కావడంలో ఆశ్చర్యంలేదు. –

ఐనా జనాలు మాత్రం అతని దర్శనార్థం రోజా కాయబడి నిలబడుతారు. హైస్కూల్లో సీటు కావాలన్నా, ఆస్పత్రిలో చోటు కావాలన్నా అడవిలో ఆకు చిటికె కావాలన్నా సంతలో ఏలం పాట పాడాలన్నా, కాళాస్త్రి సిఫార్సు ఉండక తప్పదు. అసలా మాటకు వస్తే కాళాస్త్రికి తెలియకుండా బుంగల గుంట ప్రాంతం చీమ, చొరబడ్డాని కైనా వీల్లేదు.

కాళాస్త్రి కఠినుడనీ — నిర్దయుడనీ — మహా కుట్ర దారుడనీ—, తేనె పూసిన కత్తి అనీ, గోముఖ వ్యాఘ్రంవలె అటు ఉద్యోగులనూ, ఇటు ప్రభుత్వాన్నీ వంచించి—, ప్రజల్ని మోస గించి లక్షలాది పైకాన్ని ఆర్జిస్తున్నాడనీ గిట్టని వాళ్లంటారు.

కానీ చిలకల పాకెంలో—, చింతకాయల పెంటలో—, ఎలుంగొడ్ల పల్లెలో ఎక్కడ విన్నా జనాలు ఏకగ్రీవంగా "అతడు మొనగాడు. అతడా పులిగదా.., అబ్బో కాళాస్త్రి ఎంత కరుణా మయుడనుకొన్నారు....

ఘటికుడు. ఘటికుడు అతడే లేకుంటే ఈ బస్సులిట్లా నడుస్తాయా ? ఈ రోడ్లిట్లా వేస్తారా ? ఎక్కడంటే అక్కడ ఎప్పుడంటే అప్పుడు కావలసినన్ని సారాబుడ్లు దొరుకుతాయా ? ఆ మాటకు వస్తే ఈ కల్లంగళ్లు కాదు కాదు నీరా అంగళ్లు జరిగేవేనా?" అని స్తుతిస్తూ ఉంటారు. సందేహంలేదు వచ్చే ఎన్నికల్లో వద్దన్నా, కాళాస్త్రిని పిలిచి పిలిచి ఓట్లేస్తారు జనాలు. రత్నాన్ని నిలుపుతారని ఆ టాంటాం పత్రికేదో అనాకుటా ఈనాకుటా ప్రాసించి గాలి ఆడి కాళాస్త్రి స్వయంగా ఎన్నికల్లో నిలబడుతాడు. అందుకే ఆయన డబ్బును అమితంగా ఆర్జించేస్తున్నారు.

ఎన్నికల్లో గెలవాలంటే నోటిమాటలా. మొదటి ఎన్నికల్లో పాతిక వేలైతే—, రెండో సారి యాభై వేలు. మూడోసారి లక్ష. మళ్లీ నాలుగోసారి రెండు లక్షలు. ఇట్లా వోట్ల ఖరీదు ఓట్లు పెరిగిపోతుంటే కాళాస్త్రి వూరుకొంటే ఎట్లా ?

ప్రజాసేవలో ఎన్నో తంటాలు పడితేగా ప్రజా నాయకుడయ్యేది—, ఆ యోగమే కాళాస్త్రికి పడితే బుంగల గుంట సాక్షాత్తు బంగారు గుంటై పోదూ !

అదే నా ఆశయమంటాడు కాళాస్త్రి పొర పాటున ఏ రాజకీయ వాద్యైనా కన్పిస్తే.

ఇంత గొప్పవాడైనా కాళాస్త్రి స్థానిక పత్రికా విలేఖరులకు మాత్రం ప్రత్యేకమైన మర్యాద ఇస్తాడు. కాఫీ సిగరెట్ల నుండి కార్లలో యాత్రల వరకూ వారికి మాత్రం స్పెషల్ మార్జిన్ !

అందుకోసమేగా వారు గూడా "నిజంగా కరుణా మయుడు కాళాస్త్రి" అని అనడం. శంఖులో పోస్తే తీర్థమైనట్లు కవులు గాయకులే అలా అంటే ఇక సామాన్య జనాల దృష్టిలో అతడు సాక్షాత్తు ప్రజా సేవకుడే, కాదనగలవారెవరు ? ★



కునిసి శీఘ్రమున చప్పుడు చెప్పాడు. పిల్ల లిద్దరికీ
ఆ ధోరణి నచ్చక అక్కడమంచి బయట పడ్డారు.

రెండోచోట ఒక ఇండియన్ (హైందవుడు) ఉన్నాడు. అతను పీకమొయ్యా తాగి, తూలి, నిభాయించుకోలేక, గతి తప్పి ఉయ్యాలలా వూగుతూ పడుస్తున్నాడు. అతను సర్కస్‌కు సంబంధించిన

# పయనించిన పురాణం

23 వ పేజీ తరువాయి

వాడిలా కనుపించలేదు. డొనాలీ అతన్ని చూడనే లేదు. మొదటగా షెరాన్ చూసి డొనాలీకి చూపించింది. అతను తూలుతూ మీదకు రావడంవల్ల వా రిద్దరూ పక్కకు పరుగెత్తారు.

మరోచోట ఆగారు. అక్కడ ఒక చిన్న రింగుకు ఆరు కుక్కలు కట్టేసి ఉన్నాయి. వాటి నాయకుడు కూడా అక్కడే ఉన్నాడు. ఆ కుక్కలు చాలా తెలివిగా అతను చెప్పిన పనులు చేస్తున్నాయి. బంతి విసిరి 'తే' అంటే తెస్తున్నాయి. ఓ బుజ్జి కుక్క మాత్రం చిన్న పొరపాట్లు చేసి, చూపరులకు కితకితలు పెట్టింది. తమ స్నేహితులకన్నా కుక్కలే తెలివిలో నయం అనుకున్నారు వాళ్లిద్దరూ. ఆ కుక్కలను ఆడించే అతని పేరు కింక్వాడ్. అతను తన భార్యను జనానికి పరిచయం చేశాడు. ఆమె కొంచెం లావుగా, చాలీ చాలని బట్టలతో బిగువుగా, ఉబ్బిన బుడగలా ఉంది. జనానికో నమస్కారం పెట్టి "పోనీ" (చిన్న గుర్రం) మీద ఎక్కి అద్భుతాలు చేసింది.

ఇది కూడా వారికి చాలా నచ్చింది.

టైము గ్రరువ తిరుగుతోంది. చూడవలసిన వింతలు, విశేషాలు ఇంకా చాలా ఉన్నాయి. వేడి వేడి డాగ్ (కుక్క కాదు. ఓ రకం తినుబండారం) తిని, టకటక హరించుకుపోతున్న డబ్బు నోసారి లెక్క చూసుకున్నారు. ఓ ద్రాక్షసారా త్రాగారు. కొంచెం దూరంలో పదిహేడేళ్ల అందమైన కుర్రాడు కూర్చుని ఉండడం గమనించారు. అతను వాళ్లకేసి అదే పనిగా చూడడంవల్ల బహుశా తమని పలకరిస్తాడని, వాళ్ళు అనుమానించారు. ఇంతలో అతను చెంగున బల్లలు దూకి, డొనాలీ పక్కకి వచ్చి కూర్చుంటూ "మిమ్మల్ని పోయి నేడాది చూసిన గుర్తు. నాపేరు పాల్ జోహాన్సన్. ఊళ్లో ఉంటాను. నాతో కలిసి సర్కస్ చూడ్డానికి రాకూడదూ చక్కగా ? ఏమైనా వేడివేడిగా త్రాగాలని లేదూ మీకు ?" అంటూ కుశల ప్రశ్నలు వేశాడు.

డోనాలీ చిరునవ్వు నవ్వింది. ఆ రాత్రి చాలా వింత రాత్రి. చాలా రాత్రులు యిలాటి రాత్రి కోసం ఎదురుచూసింది. ఏడాదికి ఒక్కసారి వచ్చే ఆనందం. అయితే మాత్రం—ముక్కూ ముఖం తెలియని పరాయి మగవాళ్లతో సర్కసులూ, సినిమాలూ చూడడానికి పెద్దవాళ్లు వొప్పుకోరు. ఆమె చిరునవ్వు చెదరకుండా "థాంక్స్ ! కాని, పరిచయం, స్నేహం, పెద్దవాళ్ల అనుమతి లేనిదే పరాయివాళ్లతో అలా తిరగడం నాకు సమ్మతం కాదు." అనేసి గమ్మున లేచి నిలబడింది. మళ్లీ ఇద్దరూ (డానా, షెరాన్) కలిసి నడక ప్రారంభించారు. గంద్రగోళాల మధ్య నుంచి, హాహాకారాల మధ్య నుంచి నడిచి ఓ గంట గడిచేసరికి షూటింగ్ గ్యాలరీ (తుపాకి గురిచేసి కాల్చే ఆట ఆడే చోటు.)కి చేరారు. ఆ గ్యాలరీలో చక్కని, అందమైన, నీలం కళ్లున్న కార్ల్ విన్సెంట్ అనే అతను ఉన్నాడు. తుపాకి ఎలా పేలవాలో అతను జనానికి చెప్పుతున్నాడు. డానా, షెరాన్ అక్కడికి చేరుకునేసరికి అతనెవరో ఇద్దరితో మాట్లాడుతున్నారు

ఇంతలో పాల్ జోహన్సన్ వీరుడులా నడుచుకుంటూ అక్కడికి వచ్చి ఓ డాలరిచ్చి బిల్లు కొని, తుపాకి తీసుకొని లక్ష్యం ఏర్పాటు చేసుకుని, నాట్యం చేస్తుండే జివ్వనుల ముందు గొప్పగా 'డాం' అని పేల్చి, డొనాలీ కేసి ఒక్క చూపు చూసి, చకచక జనంతో కలిసిపోయాడు.

"భలేగా పేల్చాడే ! అతను మీకు స్నేహితుడా ?"

అని కార్కీ విన్సెంట్ అబ్బురపడ్డాడు.

షెరాన్ బుర్ర అడ్డంగా వూపింది. డానా మాత్రం మత్తుగా చూసి "ఔను. ఆ బాపతువాడే వాడే!" అంది సుస్మితంగా.

అట్నుంచి మాటలు లోకాభిరామాయణంలోకి దిగాయి. తుపాకులు, వాటి ఉపయోగం అనే విషయము మీద కార్కీ అనర్గళంగా ఉపన్యసించాడు. అక్కడున్నవాళ్లందర్నీ పరిచయం చేశాడు. వాళ్లల్లో సర్కస్ యజమాని బర్ట్ రోనాల్డ్ అనే అతన్ని కూడా పరిచయం చేశాడు.

కార్కీని చూడగానే డానాలీ, షెరాన్‌లకు మంచి భావం ఏర్పడింది. చీకటి పడుతున్నకొద్దీ జనం రాక తగ్గిపోక హెచ్చింది. డానీ, షెరాన్‌లు మాత్రం తమదగ్గరున్న డబ్బంతా అయిపోయే వరకూ తుపాకి పేల్చడం నేర్చుకుంటూనే ఉన్నారు.

చూస్తుండగానే జన సంచారం తగ్గిపోయి, నిశ్శబ్దం ఆవరించింది. గమ్మున ఆ విషయం తెలుసుకుని డానా, షెరాన్‌లు ఉలిక్కిపడ్డారు.

"మీరు రేపు వెళ్లిపోతా రనుకుంటాను. అంతేనా ?" అన్నాడు కార్కీ.

"ఏమో మాకు తెలీదు చిల్లిగవ్వైనా లేకుండా ఖర్చు చేసినట్టు యిప్పుడే తెలిసింది. అయితే అయ్యింది కాని, చాలా ఆనందించాము. ఇటువంటి అవకాశం ఎప్పుడో కాని రాదు కదా! మా నాన్న గారి నడుగుతే బహుశా యిస్తారనుకుంటాను" అంది డానా.

కార్కీ ఓ క్షణం ఆలోచించి "నాకో ఉపాయం తోచింది చెప్పనా" అంటూ, "డబ్బనేది మనకు తెలీకుండా అలాగే ఖర్చయిపోతుంది. అసలు ఇలాంటి సమయాల్లో ముందు ఖర్చయిపోయే డబ్బే! కనుక మీరు ఇక్కడికి వచ్చేవారికి పాప్ కారన్ అవీ అమ్ముతూ, జనాన్ని ఆకర్షించి, ఆకట్టి షూటింగ్ గ్యాలరీ వైపు రప్పిస్తే నాకు నాకు సహాయం చేసినట్టూ ఉంటుంది. దానివల్ల నేను మీకు మిగతా' సర్కస్ చూడడానికి ప్యాసు యిచ్చే ఏర్పాటు చేస్తాను. దానివల్ల మీకు ఉపయోగం ఉంటుంది' అని నొచ్చచెప్పాడు.

అద్భుతం !! అనుకోని అవకాశం ! సర్కస్‌లో ఒక ఉద్యోగం ! ప్రపంచ వింతల్లో అతి వింత— వెంటనే డానాలీ వొప్పుకుని, అలసిన శరీరంతో, ఉప్పొంగిన ఆనందాలతో యింటికి చేరి, వింతలు, విశేషాలు తలిదండ్రులకు చెప్పింది. డానాలి, షెరాన్ తెగ ఆనందించారు.

డానాలీ తల్లికి ఈ వరస నచ్చలేదు. భర్త పిల్లల ఆనందాన్ని చూసి, విని ఆనందిస్తున్నందు వల్ల గమ్మున వూరుకుంది. ఈ యీడు ముచ్చట [illegible] యీడుకు అనే సిద్ధాంతం ఆయనది.

మర్నాటి రాత్రి కూడా సర్కస్ వరకూ వచ్చి దిగవిడిచి "వయస్సులో ఉన్న ఆడపిల్లలు అనే విషయం మాత్రం మర్చిపోకండి" అని ఓ చిన్న హెచ్చరిక చేసి మరీ సాగనంపారు. శనివారంనాటి రాత్రి పదింటికి అంతా ఫలానా మందుల అంగడి ముందు కలుసుకోవా లనుకున్నారు.

కార్బెట్ దంపతులు తమ అందాలరాసి డానాని కడసారి చూడడం అదే !!

* * *

నా వ్యగ్రామమైన క్వెస్నెల్‌కి ఈ కారణంగా నేను వెళ్లాను. వాన్ కువర్ నుంచి నా రాకకు నిరీక్షించే నా తల్లి ఉన్న క్వెస్నెల్‌కి చేరాను. మావూరునుంచి పెద్దలంతా తరలి వచ్చారు. వేటగాళ్లు, వ్యవసాయదారులు మొదలైనవారంతా నా ఆఫీసుమీద దాడి చేశారు. పోలీసు కాన్‌స్టబుల్ వూలర్ నా సహాయాన్ని కోరడంవల్ల, నాకూ ఉత్సాహం కలగడంవల్లా శక్తివంచన లేకుండా ఈ కేసులో పనిచెయ్యాలని సంకల్పించుకున్నాను.

మానసికంగా దెబ్బతిన్న కార్బెట్ దంపతులను, షెరాన్‌ని చూశాను. తరువాత వూలర్‌తో విషయాలు చర్చించాను.

"మేము నిశ్చయించుకున్న పద్ధతి ప్రకారం షెరాన్ ఒక్కతే మిమ్మల్ని మందులషాపు వద్ద కలుసుకుంది. డానాలీ మాత్రం రాలేదు." అన్నాడు ఆమె తండ్రి.

"ఔను నే నొక్కతెనే వచ్చాను. సాయంత్రం అయిదు దాటాక డానా నాకు కనుపించనే లేదు. అంతవరకు నేను ఆమె 'కార్కీ స్టాల్‌లో పాప్ కారన్ అమ్మాము. చూపరులకు సిగరెట్లు పంచి పెట్టాలనీ, అవి అయిపోయాయనీ, డానాని వూళ్లో ఉన్న ఆ 'స్టర్ బార్' కి పంపాడు. ఐదు డాలర్లు ఇచ్చి, మిగిలిన చిల్లర ఉంచుకో మన్నాడు. కాసేపు చూశాను. రాలేదు. దారిలో ఏవేనా వింతలు చూస్తోందేమో అనుకున్నాను. కానీ, రాత్రి పదయ్యే వరకూ రాకపోయేసరికి నాకు భయం వేసింది" అని షెరాన్ చెప్పింది.

"అసలేం జరిగింది ?" అన్నాను నేను.

"డానాలీకి క్వెస్నెల్ వూరు, దారి అన్నీ తెలుసు. దారి తప్పడానికి వీల్లేదు." అంటూ ఆమె తండ్రి ప్రారంభించి "అదే ఉద్దేశ్యంతో మేము సర్కస్ గుడారాల వద్దకు చాలా ఆలస్యంగా వెళ్లాము. మేము వెళ్లేసరికి వాళ్లు గుడారాలు ఎత్తేస్తున్నారు. డానాకి సర్కస్ అంటే మహా పిచ్చి. బహుశా ఆ సర్కస్ కంపెనీతో పారిపోయిందని నా అనుమానం" అని ముగించాడు.

* * *

మర్నాడు మేము 'ప్రిన్స్ జార్జి' వద్ద సర్కస్ వారిని కలిసి, కార్కీ విన్సెంట్‌ని ప్రశ్నించాము. అతను నానా ప్రమాణాలు చేశాడు. సిగరెట్లు తెమ్మని డానాకి తను డబ్బిచ్చినట్టు ఒప్పుకున్నాడు. ఆవేళ శనివారం అవడంవల్ల సిగరెట్లు టోకుగా కొనడం పడలేదనీ, కనుక డానా చేత తెప్పించాననీ, అలా తెచ్చిచ్చినందుకు అరవై సెంట్లు ఇచ్చానని అతను చెప్పాడు.

* * *

అప్పులవాళ్ళ బాధలు భరించ లేక ఒక రామారావు సుబ్బారావును కాస్త విషం యిమ్మని అడిగాడు కాని సుబ్బారావు "నేను మా ఆవిడ బాధ భరించ లేక ఎప్పటికేనా పనికొస్తుందని 'ఉంచుకున్నాను ఇవ్వ 'న్నాడు.

అర్ముఖం (అంబత్తూరు)

"సర్కస్ ముఠా అందరి ఆడిగాను. నా చిట్టి తల్లి జాడ చెప్పినవా డెవ్వడూ లేడు" అంటూ డానా తండ్రి కంట నీరు పెట్టుకున్నాడు.

డానా తండ్రివద్ద నుంచి తిరిగి వస్తుండగా దారిలో నాకు వూలర్ కలిశాడు. అయిస్టర్ బార్‌లో డానా సిగరెట్లు కొన్నట్లు ఆ షాపువాడు చెప్పాడని, అంతకుమించి వివరాలేమీ తేల్లేదని, అతను చెప్పాడు.

డానాలీ శనివారం నుంచి కనబడలేదు. అప్పుడే సోమవారం కూడా వచ్చింది. అసలు ఈ విషయం తేలేవరకూ సర్కస్ ముఠాని ఆపేద్దా మను కున్నాను గానీ, ఆ పటాలం ఆగితే భరించే అంత స్థలం చుట్టుపక్కల లేదు. వూలర్ నేనూ ఆలోచించి, ఆ సర్కస్ వాళ్ల ఒంటెల దండులో ప్రవేశించి 'ఆచూకీ తెలియని డానా వివరాలు' ఆరాలు తియ్యమని ఇద్దరు డెప్యూటీలను పంపాము. వారి వద్దనుంచి ప్రతి రోజూ 'వివరాలేం లేవు' అనే వార్త వస్తోంది.

ఇలా చాలా రోజులు గడిచాయి. చివరికి వూలర్ తన ధర్మసందేహం బయట పెట్టాడు.

ఆ సందేహం నాకూ వచ్చినా "ఛీ, ఛీ" అనుకుని వూరుకున్నాను. చివరికి అతను "ఇంత పత్తా లేకుండా మాయమైతే అసలు ఆమె బ్రతికిఉందనే నమ్మకం ఏమిటి మనకు ?" అన్నాడు. నా భయం అనుమానం అదే కాని, దానికి కూడా సాక్ష్యాలు, ఆధారాలు ఉండాలి కదా ? క్వెస్నెల్ అంతా పొరుగూరునుంచి వచ్చే పోయే వాళ్లతో అల్లకల్లోలంగా ఉంటుంది. పైగా అది ఒక నిర్ణయం, ఆకారంలేని ఊరు. వూరు బయటా లోపలా కూడా నిర్జన ప్రదేశాలు. నగర నిర్మాణం నే నియమావళిని పాటించలేదు. అలాంటి వూళ్లో శవాన్ని వెతకడమనేదే అంత తేలికయిన పని కాదు.

వాన్‌కువర్‌నుంచి బ్లడ్‌హౌండ్స్ (డిటెక్టివు కుక్కలు) ని పంపమని రాశాము. కానీ, ఇలాటి జనసమ్మర్దమైన కారడవులు కల ఈ వూళ్లో జరిగిన ఆ సంఘటన ఫలితాన్ని ఆ కుక్కలెలా కనుక్కుంటాయో నాకు బోధపడలేదు. డానాలీ ఎవరి చేతనో ఆకర్షింపబడి, అతనితో అడవుల వైపు వెళ్ళి అక్కడ మృత్యువును కలుసుకుని ఉండాలని నా అభిప్రాయం.

ఈలోగా ఆ వూళ్ళో వాళ్ళందర్నీ కూడా తోచినవరకూ ప్రశ్నించాము. ఆ ఇద్దరాడపిల్లల్ని కలుసుకుని మాట్లాడిన పాల్ జోహాన్సన్‌ను కూడా కలుసుకున్నాను.

"ఆ తప్పి తాగి, తందనాలాడిన ఇండియన్ వాళ్ళకూడా వద్దాడు. వెళ్ళి అతన్ని కలుసుకుని ప్రశ్నించండి" అని పాల్ జోహాన్సన్ నిబ్బరంగా సలహా ఇచ్చాడు.

పాల్‌ని గురించిన ఒక్కగా నొక్క సందేహం నన్ను వేధించింది. అతను ఎందుకో మాకు చాలా సహాయం చేసేవాడిలా ఆరాట పడుతున్నాడు. అతని కెందుకా ఆరాటం ? అతను ఎలాగైనా 'ఘటికుడు' అని నేను గ్రహించాను 'కాస్త ఆలోచించి వాళ్ళిద్దర్నీ మీరసలు ఎన్నింటికి చూశారో చెప్పండి" అన్నాను.

"ఐదు దాటాక"

చెప్పలేదు ? మే మీకేసు పరిశీలిస్తున్నామని తెలుసు కదా ?"

"ఎవ్వరూ అడగలేదు."

* * *

నా అనుమానం 'ఇండియన్'మీద పడింది. జానా కనబడని రాత్రి అతన్ని చూసినట్టు ముగ్గురు సాక్ష్యం ఇచ్చారు. అతని చొక్కాకి రక్తం మర కలు చూశానని వారిలో ఒకడు ఒట్టేసి మరీ చెప్పాడు.

"బహుశా ఏదైనా కొట్లాటలో జరిగిన తగడవల్ల ఆ మరకల అయ్యా యేమోనని అను మానించాను" అన్నాడతను.

ఫూలర్ పదరివారంగా విస్ఫ్రహ చెందాడు. నాకూ అంతగా ఆశలేదు. వాళ్ళు చెప్పిన సాక్ష్య లలో ఏదో కచ్చి, ఈర్ష్య కనిపించాయి తప్ప వో అర్థముండి చెప్పినట్లు లేదు. బయట దేశం నుంచి వచ్చిన వారిమీద ఏ నేరమైనా తోసి వెయ్యడం తేలికే ! ! పోలీసు లెక్కల వల్ల బాగా తాగి, తందనాలాడి, శాంతి భద్రతలు పాగొట్టేది ఇండియన్స్ అని తేలినా, తెల్ల సోదరులు వాళ్ళకేమీ తీసిపోరు. ఎటొచ్చి హైందవులు, హంతకులు, నీతిలేని వారు మాత్రం కాదు. చట్టానికి చుట్టాలే ! ! కాని ఇండియన్, లాంగ్ ఫుట్ (పెద్ద పాదాలు కలవాడై ఉండవచ్చు) ఏ దారి తొక్కాడో వివరంగా తేల్చుకోవాలి.

హైందవుల కోసం కేటాయించిన చోటుకు వెళ్ళాలంటే ఓ కొండ ఎక్కాలి. ఆ కొండ మీద ఉన్న అతని గదికి రోడున్నంత వరకూ గుర్రాలమీద, అనక నడిచి, చేరాము. పైము పదకొండయ్యింది. అతని ఖాళీ గది మమ్మల్ని ఆహ్వానించింది. అతని గదంతా దుమ్ము, ధూళి పడి ఉంది. బహుశా అతను దాని ముఖం చూసి చాలా కాల మయ్యింటుందనిపించింది.

ఉన్నట్టుండి నా బుర్రలో ఒక ఆలోచన మెరిసింది. అది ఏమంత మంచిది కాకపోయినా, "అతన్ని" మా దగ్గరకు రప్పించుకోవాలంటే అది ఒక్కటే మార్గమనిపించింది.

అసలే చలికాలం, రోడ్లు, దారులు దారుణంగా మంచుతో కప్పు బడి పోతాయి. పది శరీరాన్ని గజగజలాడించి కొరికేస్తుంది. అతని కేబిన్‌లో ఉన్న వస్తుసామగ్రి యావత్తు తీసుకు

# పయనించిన మరణం

పోతే అతను వచ్చినట్టు భోజనానికి గాని, మరి ఇతర అవసరాలకు గాని వూళ్లోకి రావాలి. ఇలా టాలోచన వచ్చినందుకు కాస్త ఏవగింపు కలిగినా అతన్ని కలుసుకునేందుకు మార్గాంతరంతోచక, అలాగే చేశాము.

అతని కేబిన్ నుంచి తిరిగి వచ్చేసరికి మరో వార్త నా టేబులు మీద సిద్ధంగా ఉంది.

"— హార్స్. ఫ్లై లేక్ జిల్లాకి చెందిన ఆటన్ అన్వర్సన్ అనే అతను థామస్ రాన్స్ (థామస్ అనే అతను కట్టించిన ఇళ్ళు) నుంచి వచ్చి శనివారం వరకూ సర్కస్ కంపెనీలో ఉన్నాడు. కానీ, ఆది వారం తన ఉద్యోగం వదలివేసి, వాన్‌కువర్ వెళ్ళి పోయాడు—" అని ఉంది.

ఇది అనవసరమైన అనుమానమే ! ! కానీ, ఏ పుట్టలో ఏ పాముందో, అనే లెక్క ప్రకారం ఏ అనుమానాన్నీ అనుమానించక వదలి పెట్ట దలుచుకోలేదు. మర్నాడు ఉదయం నేనూ ఫూలర్ కలిసి కొండ శిఖరాలమీదుగా 'థామస్'రాన్స్' చేరాము. థామస్ యాభై య్యేళ్ళ వాడు. పొడుగ్గా, బక్కగా ఉన్నాడు. అతను తన 'రాన్స్' గురించి చెప్పి చాలా గర్వపడ్డాడు. తను చేసినటువంటి గొప్ప కార్యాలూ, కలిగించిన సౌకర్యాలను గురించి విశదీకరించాడు.

"అన్వర్సన్ ఎందుకు పారిపోయాడో నా కర్థం కాలేదు. ఈ శీతకాలమంతా ఇక్కడే ఉంటా డనుకొన్నాను. అతను చాలా నమ్మకమైన వాడు, తెలివైనవాడు అనుకున్నాను. అతన్ని నమ్మి మిగతా పనివాళ్ళ పందర్ని పమ్మన్నాను. కానీ అతను చెప్ప కుండా, పైకుండా పారిపోయాడు. అతను పారి పోయే నాడే ఆమెకూడా మాయ మయినందువల్ల ఈ విషయం మీకు తెలియడం మంచిదనుకున్నాను" అన్నాడు.

అన్వర్సన్ రూమంతా వెతికాము. అతని గదిలో రక్తంతో తడిసిన చొక్కా ఒకటి దొరికింది.

అంత జాగ్రత్తగా పారిపోయిన వ్యక్తి తన గదిలో రక్తపు మరకలున్న చొక్కా వదిలిపెడ్తాడా ? ఆ చొక్కా ఉతికెయ్యలేకపోయాడా ? లేక తగలెయ్య లేక పోయాడా ? లేక చొక్కా తీసుకుని మరీ పారిపోలేక పోయాడా ? నిజంగా అతనే ఈ హత్య చేసి ఉంటాడా ?— ఏది ఏమైనా ఆ చొక్కా పరీక్షకోసం 'వాన్ కూవర్ ప్రయోగశాల'కు పంపాము.

అన్వర్సన్ వెళ్ళినచోటు ఆచూకీ తెలియలేదు. కాని, క్యాస్పెల్ రైలుమార్గం ఉద్యోగి ఒకాయన అన్వర్సన్‌వంటి ఆకారం, ఆనవాళ్ళుకల ఒకతను వాన్‌కువర్, బ్రిటిష్ కొలంబియాకి టిక్కట్టు కొనుక్కున్నట్టు చెప్పాడు.

ఈ కేసు గమనం 'నత్త' గమనంతో పోటీ చేసి, నాకు వెర్రెత్తించింది. మాయమైపోయిన డానాని గురించిగాని, అంతర్ధానమైన అన్వర్సన్‌ని గురించిగాని సూచికప్రాయంగా ఎత్తు వివరాలు తేలలేదు. పైగా, మేము వేసిన పథకం ప్రకారం ఆ హైందవుడు (లాంగ్ ఫుట్) ఏ కొట్టుకు వచ్చిన జాడ కూడా లేదు. పాల్ జోహాన్సన్ ఉన్నట్టుండి వాన్ కువర్ వెళ్ళినట్టు తెలిసింది. నా బుర్ర నా దెక్కిపోయింది. తల్లి దండ్రులతోనైనా చెప్పకుండా పాల్ (సర్కస్‌లో డానాని పలకరించి నతను) ఎందుకు వెళ్ళినట్టు ?

ఇంతలో వాన్ కువర్ ప్రయోగశాలనుండి తంతి వచ్చింది.

"—అన్వర్సన్‌కి చెందిన చొక్కా మీదున్న మరకలు మనిషి రక్తానికి చెందినవే! కార్పొరల్ ఇ. ఇ. జేమ్స్."

అన్వర్సన్‌ని వెతకడానికి మరికొంత సిబ్బందినీ నియోగించాము. పాల్‌ని వెతికే యత్నంలో మళ్ళీ ఆ హైందవుని 'కాబిన్'కు వెళ్ళాము. అత నానాటి నుంచి వచ్చినట్టు లేదు. సర్కస్‌తో ప్రయాణిస్తున్న డెప్యూటీలు రోజూ వార్తలు పంపుతూనే ఉన్నారుగాని, వాటిలో ప్రత్యేకత ఏమీలేదు. పొలాశ్రయాలు, రైలు మార్గాలు, రోడ్లు— అన్ని ప్రదేశాల్లోనీ నియుక్తులను మరొకసారి హెచ్చరించాము. సరియైన వివరాలు అసలు తేలక, ఎటునుంచి పరిశోధన ప్రారంభించాలో తేలక, అట్టే ఉండి పోవలసి వచ్చింది.

అద్దె బంగళాలోవున్న ఆఫీసులో కూర్చుని, గోళ్ళు కొరుక్కుని తింటూ, వెల్లలేక వెలవెల బోయిన గోడలు, పగిలి పోయిన గచ్చు చూస్తూ కాలం గడపడం నా అభిమతంకాదు. బుర్ర గోక్కుటూ, ఆఫీసులో కూర్చునేకన్నా 'ఆ' కారడవుల్లో తిరుగుతే ఒకవేళ ఆమె శరీరమైనా దొరకచ్చనే వూహ కలిగింది. వేట కుక్కలను తీసుకుని, కొండల కేసి బయల్దేరాము. అసలే శీతాకాలం! చకచక వెతక్కపోతే ఆ శవం మంచుతో కప్పబడిపోయి కనుపించకుండా పోవచ్చు. చివరికి మా 'వేట' ఒక చోట ఆగింది. ఎలుగుబంటిని పట్టుకోడం కోసం వెంటాడిన 'క్రిక్' అనే అతనికి, ఆకుల్లో దాచివున్న 'ఆమె శవం' కనబడిందట! క్రిక్ బెదిరి పోయాడు. "బాబోయ్! నా మాట నమ్మండి! నేనే పాపం ఎరుగను. ఖర్మకాలి ఇవాళే వైపొచ్చాను. ఆమె శవం కనుపించింది. శవాన్ని మోసుకుని తిన్నగా మీ స్టేషనుకు పద్దామనుకున్నాను. కానీ, శవం ఉన్న తీరు, ప్రదేశం మీరు చూస్తేనే మంచిదని వూరుక్కున్నాను" అని చెప్పాడు. (పశేషం)





శూరసింహ మందారమాలల విరసం (బందిపోటు)

# వినోదాత్మక స్టంట్ 'బందిపోటు' చిత్రం

**నటీనటులు:** ఎన్. టి. రామారావు, రాజనాల: నాగయ్య. గుమ్మడి, రేలంగి, రమణారెడ్డి, మిక్కిలినేని, సంగర, బాలకృష్ణ, రామకోటి, వి. విశ్వనాథ్, మోటుకూరి సత్యం. కాశీనాథ్, రాజ్ బాబు, కృష్ణకుమారి, ఇ. వి. సరోజ, మీనాకుమారి, గిరిజ, పుష్పవల్లి. దర్శకత్వం, విఠలాచార్య. రచన: సముద్రాల. పాటలు: సి. నారాయణరెడ్డి, దాశరథి, కొసరాజు, ఆరుద్ర. సంగీతం: ఘంటసాల. ఛాయాగ్రహణ దర్శకుడు: రవికాంత్ నగాయిచ్. నిర్మాతలు: సుందర్ లాల్ నహతా, డూండీ.

రాజశ్రీవారి 'బందిపోటు' చిత్రం విజయ గార్డెన్స్‌లో పత్రికలవారికి చూపించినప్పుడు చివరి సీను లలోని రంగులు ప్రత్యేకంగా ఆకర్షించడమే గాక గాంధారరాజు కొలువు చాలా గొప్పదేనని పించింది కూడా. మొదటి నుంచి కొనవరకూ దుష్ట శిక్షణార్థం వీరశూర హాస్యరస ప్రధానంగా భారీ ఎత్తున సాగిపోయిన ఈ సరిపాత కొత్త కథలోని కొత్తదనమంతా, భారీ ఎత్తున నిర్మించిన సెట్టింగులు అన్నీ పాడుకుందిగాక పోయినా చదువుకుందికి వినేటందుకు బాగున్న పాటలు సాహిత్యం— "కత్తి యుద్ధాలు ప్లస్ సర్కస్సూ" ఉంది.

వీరరసాన్ని రామారావూ, శూరరసాన్ని రాజనాల హాస్యరసాన్ని రేలంగి రమణారెడ్డి గిరిజా మీనాకుమారి మొదలగు వారు పోషించగా శృంగార రసాన్ని అక్కడక్కడ కృష్ణకుమారి ఒలికించాలనే ప్రయత్నం చేసింది. ఇంకా శ్రద్ధా శ్రమా ఉంటేనే మేలు అనిపించిన వారిలో ఆమెపేరు వదిలేయలేం!

కథ: ఒక రాజుగారి బావమరిది దురంతాలను ఒక రైతు బిడ్డ విప్లవాత్మకంగా అంతం చేయడం ఆఖరున రాకుమార్తెను పెళ్లాడటం రాజ్య మేలడం. ఐతే ఇందులో విఠలాచార్య దర్శక ప్రతిభ ఒప్పించనిహాస్యమువినోదమూలేవు. ఈరోజుల్లో ప్రేక్షకులు సంభ్రమాశ్చర్యాలతో ఎన్ని మెచ్చుతారో అన్ని సరస విరసాలు దీనిలో ఉన్నాయి.

రాబిన్‌హుడ్, ఒక చోట ఐతే కోహినూర్ ఇంకో చోట ఆ రెండూ మరో చోటా జ్ఞాపకం రావచ్చునే గాని ప్రేక్షకులు చిత్ర గమనాన్ని మాత్రం తప్పించుకోలేరు — శ్రద్ధగా చూస్తారు ఈలలు వేస్తారు.

పైగా అందరూ పెద్ద తారలే. నాగయ్య గుమ్మడి, కూడా ఉన్నారు ఉన్నంతలో మిక్కిలినేని కూడా ప్రశంసార్హుడే!

భారీ ఎత్తున సెట్టింగులు వేసి ఆకారునే రంగులు వేసి, గుర్రాలు కత్తులూ సర్కస్సులూ నిండుగా ఉండే ఈ చిత్రంలో పాటల సాహిత్యం బాగున్నందుకు ఆ విధంగా శృంగార రసాన్ని రసాభాస కాకుండా కాపాడినందుకు ఆ కవులను, నిర్మాతలను ఉమ్మడిగా అభినందించాలి. సినిమాల ప్రయోజనాన్ని గాక వాటివల్ల వినోదాన్ని ఆశించే వారందరికీ ఈ బందిపోటు కాలక్షేపనిక్షేప మన్న మాట నిస్సందేహం. అగ్గిరాముడు తర్వాత ఆ బాపతు వేష మాయవేషాలలో రామారావును చూడగల గొప్ప నటన ఇందులో ఉంది.

భారీ సెట్టింగుల వ్యయ ప్రయాసలకు తెలుగు సినిమాలు నిలబడగలగాలి అంటే ఈ చిత్ర విజయం అందుకు దోహదకారి కాగలదు!

క్రిటిక్ ★

# అవీ - ఇవీ - అన్నీ

## విజయా ప్రొడక్షన్సు "హరిశ్చంద్ర"

విజయా ప్రొడక్షన్సువారు తమ బేనర్ క్రింద "హరిశ్చంద్ర" చిత్రాన్ని తీయదలచినట్లు, ఈ చిత్రానికి రచన: పింగళి నాగేంద్రరావు, దర్శకత్వ సారథ్యం: కె. వి. రెడ్డి వహిస్తారని తెలుస్తుంది.

## జగపతి పిక్చర్సు

జగపతి పిక్చర్సు వారు తమ తాజా చిత్రానికి హైదరాబాద్ సారధి స్టూడియోలో జూన్ 19వ ప్రారంభోత్సవం జరిగింది. 19 నుండి 23 వరకు మొదటి సెట్టు షూట్ చేశారు. జూలై 18 నుండి రెండవ సెట్టు షూటింగ్ ప్రారంభించారు.

కథా నాయకుడుగా అక్కినేని, నాయికగా బి. సరోజాదేవి మొదటిరోజు షూటింగ్‌లో ఉన్నారు. జగ్గయ్య కూడా ఉన్నారు.

చిత్ర ప్రారంభోత్సవ సందర్భములో నిర్మాత రాజేంద్రప్రసాద్ నటవర్గానికి, సాంకేతిక వర్గానికి, స్టూడియో స్టాఫ్‌కు హైదరాబాద్ సారథి స్టూడియోలో డిన్నర్ ఇచ్చారు.

ఈ చిత్రానికి మూలం బెంగాలీ కథ "అగ్ని సంస్కార్." ఛాయ: పి. నాగేశ్వరరావు. సంగీతం: కె. వి. మహదేవన్. కళ: జి. వి. సుబ్బారావు. దర్శకుడు: వి. మధుసూదనరావు, నిర్మాత: రాజేంద్ర ప్రసాద్.

కౌసల్యా ప్రొడక్షన్సువారి "మంచి రోజులు వస్తాయి" చిత్రం పూర్తి అయింది. జూలై 27వ తేదీనుండి గోల్డెన్ స్టూడియోలో రీ రికార్డింగ్ చేశారు. ఆగస్టులో విడుదల అయ్యే చిత్రాలలో ఇదొకటి.

ఈ చిత్రంలో జగ్గయ్య, కాంతారావు, రాజ బాబు, రమణారెడ్డి, కె. వి. యస్. శర్మ, వి. వి. సుబ్బారావు(జూనియర్),సీతారాం, నందారాం, సత్యం, జమున, రాజశ్రీ, గిరిజ (జూనియర్), మరళి బాలసరస్వతి, లక్ష్మీకాంతమ్మ, ఉదయలక్ష్మి, గీతాంజలి, జయ లలిత, హెచ్. ఎం. లక్ష్మీరాజ్యం మొదలగువారు నటిస్తున్నారు.

మాటలు—పాటలు: ఆరుద్ర, సంగీతం: కోదండ పాణి, ఛాయ: హెచ్. ఎస్. వేణు, నృత్యం: చోప్రా అండ్ మాధవన్. కళ: గోడగాంకర్, కూర్పు: విశ్వ నాథం అండ్ కె. వి. యస్. ఆర్. దాస్, దర్శకుడు: విశ్వనాథం, అసోసియేటెడ్ దర్శకుడు: వి. రామ చంద్, నిర్మాతలు: యస్. భావనారాయణ అండ్ వి. వి. బాలకృష్ణరాజా.

## రేలంగి చిత్ర మందిర్‌లో "లవకుశ" ఉత్సవం

తెలుగు తెర సుప్రసిద్ధ హాస్య నటుడు రేలంగి వెంకట్రామయ్య, తాడేపల్లిగూడెంలో "రేలంగి చిత్ర మందిర్" అని ఒక సినిమా హాలు కట్టడం మా పాఠకులకు తెలిసినదే. జూనియర్ రేలంగి, (రేలంగి కుమారుడు చి॥ సత్యన్నారాయణబాబు, తిరుమలా పిక్చర్స్ "సమాజం" చిత్రం నిర్మాత) ఆధ్వర్యంలో పై సినిమా హాలు నడుపబడుచున్నది.

1963 ఫిబ్రవరి 6 వ తేదిని శ్రీ కృష్ణ పాండవ యుద్ధంతో పై హాలు ప్రారంభోత్సవం

# అవీ-ఇవీ-అన్నీ

జరిగింది. ఆ చిత్రం 100 రోజులు దిగ్విజయంగా నడిచింది. ఆ చిత్రం తర్వాత "లవకుశ" చిత్రాన్ని తీశారు. ఈ చిత్రం కూడ 125 రోజులు పోయింది. 125 రోజులు ఆ హాలులో నడిచిన సందర్భంలో సాంకేతికవర్గం, నటీనటులు 125 వ రోజున జరిగిన ఉత్సవంలో పాల్గొన్నారు.

## "గురువును మించిన శిష్యుడు"

విశాల్ ప్రొడక్షన్సువారి "గురువును మించిన శిష్యుడు" చిత్రం ఇప్పటికి 4 సెట్సు పని పూర్తి చేశారు. ఈమధ్య ఔట్‌డోరు షూటింగ్ కూడా పూర్తి చేశారు. ఇది కూడ జానపద చిత్రమే. ఈ చిత్రాన్ని త్వరితగతిని పూర్తిచేసి, అక్టోబరులో విడుదల చేయనున్నట్లు విశాల్ ప్రొడక్షన్సు అధినేత, దర్శకుడు శ్రీ విఠలాచార్య తెలియజేశారు.

ఈ చిత్రంలో కాంతారావు, రాజనాల, ముక్కామల, సత్యనారాయణ, బాలకృష్ణ, లంక సత్యం, కృష్ణకుమారి, రాజశ్రీ, లక్ష్మీదేవి, రమాదేవి, బృందావన్ మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు, పాటలు: జి. కృష్ణమూర్తి, ఛాయ: రవికాంత్, సంగీతం: కోదండపాణి, కళ: బి. సి. బాబు, నృత్యం: చిన్ని సంపత్, కూర్పు గోవిందస్వామి, దర్శకత్వం, నిర్మాత: బి. విఠలాచార్య, అసోసియేట్ దర్శకుడు: యస్. డి. లాల్.

## "తెలుగులో నానుం ఒరు పెణ్"

మురుగన్ బ్రదర్సువారు "నానుం ఒరు పెణ్" అనే తమిళ చిత్రాన్ని ఈమధ్య తమిళ దేశంలో విడుదల చేశారు. అమితంగా ప్రజల నాకర్షించింది. "నానుం ఒరు పెణ్" అంటే తెలుగులో "నేను ఒక స్త్రీ నే" అని అర్థం. ఈ చిత్రాన్ని తెలుగులో మురుగన్ బ్రదర్సువారే నిర్మించనున్నట్లు తెలుస్తున్నది. కథా నాయకుడుగా యన్. టి. రామారావు నాయకిగా, సావిత్రి యుండవచ్చునని తెలుస్తుంది. రచన: అనిసెట్టి సుబ్బారావు, కథ, దర్శకత్వం: త్రిలోక్‌చందర్.

## హైదరాబాద్‌లో రెండవ స్టూడియో

పాలకాలం క్రితం మహబీర్‌సింగ్ కొందరు వాటాదార్లతో కలిసి "హైదరాబాద్ స్టూడియోస్" అనే పేర హైదరాబాద్‌లో ఒక స్టూడియోను నిర్మించి, "ఇజ్జత్" అనే చిత్రాన్ని నిర్మించారు. కొన్ని కారణాలవల్ల మూతబడిన ఆ స్టూడియోను తిరిగి పునరుద్ధరించడానికి మహబీర్ సింగ్ నిశ్చయించినట్లు తెలుస్తుంది. దీనితో ఆంధ్ర రాజధానిలో రెండు స్టూడియోలు పని చేయగలవు.



బికినిలో సుందరి గ్లోరియా పీల్.

ఈ విధంగానే "ఆంధ్రా సినీ టోన్" పేర గతంలో విశాఖపట్నంలో ఒక స్టూడియో ఉంది అది కూడ ప్రస్తుతం మూయబడింది ఆ స్టూడియోలో మొదట శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం, భక్త జయదేవ్ మొదలగు చిత్రాలు తీశారు ఆ స్టూడియో కూడ తిరిగి ప్రారంభిస్తే ఆంధ్ర దేశంలో 3 వ స్టూడియో వున్నట్టే

## హైదరాబాద్‌లో "పునర్జన్మ" రీ రికార్డింగ్

ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్సు వారి "పునర్జన్మ" చిత్రం పూర్తిఅయి, సెన్సారు కూడా అయింది. ఈ చిత్రాన్ని పూర్తిగా ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్సు వారు హైదరాబాద్ సారథి స్టూడియోలోనే షూట్ చేశారు. ఈనెల మొదటి తేదీ నుండి రీ రికార్డింగ్ కూడ హైదరాబాద్‌లోనే చేస్తున్నారు.

నిర్మాత ఎ వి సుబ్బారావు ఐన ఈ చిత్రంలో నాగేశ్వరరావు, గుమ్మడి, రమణారెడ్డి, పద్మనాభం, చదలవాడ, ప్రభాకరరెడ్డి, కృష్ణకుమారి, సూర్యకాంతం, సంధ్య, వాసంతి, యల్ విజయలక్ష్మి, నిర్మల, హేమలత మొదలగువారు నటిస్తున్నారు

ఈనెలలో విడుదల కాబోయే చిత్రాలలో ఇదొకటి

## "చిత్తూరురాణి పద్మిని"

1 దేవీ విజయ భవానీ!
చరాచరములేలు తల్లీ కళ్యాణీ దేవీ"

2 రాధా మాధవగాథ కాదిది
రాజాధి రాజా
వలెను మేడను కాకి
రాజాధిరాజులాగ "నా"

3 వెన్నెలదోచే మేఘం
వినరేను నాయెద శోకం
కాచెదవా ఈరేయి
బాధెదవా నీచేయి
కులపతి కింత శాపం ఏలా "వెన్నెల"

పై మూడు పాటలు సుశీల పాడగా రికార్డు చేయబడినవి

4 అబ్ దేఖో పహలే నజర్
అబ్‌దేఖో ఫహలే షౌగ్గా ఆడు
బుల్ బుల్ పిట్టండి
గుంజవోషి ప్యారీ గుల్‌షేర్ పాటకు
తాళం పట్టండి "అబ్"

5 గానా పీనా సాగేవేళ పంతమా
గజ్జ కట్టె పిల్లతోను పందెమా
పితో షికార్! నేనే తయార్
దిల్ కుష్

పై రెండు పాటలు జానకి పాడగా రికార్డు చేయబడినవి

6 ఓహో గగనతారా
ఒక మాట వినరాదా—తెర తొలగించవా
సిగ్గు సడలించవా—నగుమోము చూపవేలా
ఘంటసాల పాడగా రికార్డు చేయబడినది

7 నను పిలిచిన దెవరో—లలిత మలయ పవనమో
మలయ పవనమైతే—నా మదికి తాపమేలా
నే పిలిచితినోయి — నిను తలచుకొంటినోయి
పసిడి తలపు కథలు—ఈ పరిమళ సుమలతలు

పై పాటను ఘంటసాల, సుశీల పాడగా రికార్డు చేయబడినది.

8 పాటలోనే తేలిపోదు—పూల బాటలోనే సాగిపోదు
నీ ప్రక్కనే వాలి రేబగలు—సోలి— పాటలోనే తేలిపోదు.

పై పాటను శ్రీ కాళీ పాడగా రికార్డు చేయబడింది

* * *

సింధూర్ పిక్చర్సువారు "చిత్తూరు రాణి పద్మిని" చిత్రాన్ని పూర్తి చేశారు ఈవెలాఖరుకు గాని, సెప్టెంబరు మొదటివారంలోగాని విడుదల చేయనున్నట్లు నిర్మాత కె నాగభూషణం తెలియజేశారు

## మాస్కో ఫిలిం ఫెస్టివల్‌లో "భారత్"కు స్థానం

మాస్కోలో జరిగిన ఫిలిం ఫెస్టివల్‌లో భారతదేశ బెంగాలీ ప్రముఖ నటి సుచిత్రాసేన్ ఉత్తమ నటిగా ఎన్నిక అయింది

సత్యజిత్‌రాయ్ చిత్రం "టు డాటర్సు" చిత్రంనకు ఉత్తమ బహుమతి అందజేయబడింది, అంతర్జాతీయ చలన చిత్రపోటీ స్థాయిలో [illegible]



పెంచిన ప్రేమలో జానకి

ఈ చిత్రంలో వైజయంతిమాల, రాగిణి, హెలెన్, పుష్పేంద్రమణి, శివాజీ గణేశన్, నంబియార్, బాలయ్య మొదలగువారు నటించారు,

ఈ చిత్రానికి మాటలు, పాటలు శ్రీ శ్రీ కథ శ్రీధర్ 'పెళ్ళికానుక ఫేమ్', సంగీతం చంద్రం—సూర్యం, కూర్పు ఎస్ ఎం శంకర్ కళ శేఖర్, ఛాయా బా[illegible]సి, దర్శకత్వం చిత్రపు నారాయణమూర్తి, బి ఏ, నిర్మాత కె నాగభూషణం.

## "గుమ్రా"

ప్రఖ్యాత చలన చిత్ర దర్శకుడు, ఇటీవ [illegible] చలన చిత్రోత్సవంలో న్యాయాధిపతిగా వ్యవహరించిన బి ఆర్ చోప్రా నిర్మించిన "గుమ్రా" చిత్రం ఆంధ్రదేశంలో ఆగస్టులో విడుదల అయింది సంగీత, ప్రణయ సన్నివేశ సమ్మేళనంతో నిండిన ఈ చిత్రంలో అశోక్‌కుమార్, సునీల్‌దత్, మాలా సిన్హా, కరన్‌దివాన్, శ్యామా, శశికళ మొదలగువారు నటించారు సంగీతం రవి

## అమెరికా అధ్యక్షుడు శ్రీ కెనడీ జీవిత చరిత్రంలో భాగం ఇంగ్లీషు చిత్రం

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో నావికా లెఫ్టి వెంటుగా పని చేసిన సంఘటనలను ఇతివృత్తంగా వార్నర్ బ్రదర్సువారు తీసిన "పి టి 109" అనే ఇంగ్లీషు చిత్రం భారతదేశంలో విడుదలైంది. శ్రీ కెనడీ టార్పెడో నావకు నాయకత్వము వహించడమూ, జపాన్‌వాళ్ళు ఆ నావపై దాడి చేయడమూ, ఆ నావ మునిగిపోవడమూ మొదలగు సంఘటనలు ఈ చిత్రంలో ఉన్నాయి క్లిఫ్ట్ రాబర్ట్‌సన్ ఈ చిత్రంలో కెన్నడీపాత్ర ధరించేడు

## అవీ - ఇవీ - అన్నీ

### సెట్టుమీద "లక్షాధికారి"

రంగయ్య లక్షాధికారి. బావమరిది శివం బంగారం తయారుచేసే ప్రయత్నాలు చేస్తుంటాడు. విఫలుడవుతుంటాడు. డబ్బు కావలసి వచ్చినప్పుడు బావ రంగయ్య గారింటికి వస్తాడు.

"ఒరే అల్లుడూ, మేనల్లుడూ, ఈ లక్షలకి మనమేరా వారసులం. కాస్త వోపికపట్టు. ఈ మేడ గోడలు, మంచాలు, కిటికీలు, అన్నీ బంగారంతో చేయించేస్తారో అల్లుడా — మేనల్లుడా."

"నువ్వా?"

"అవును బావగారూ! సాక్షాత్తు మీ బావమరిది శివాన్ని"

"ఎప్పుడొచ్చావ్? ఎందుకొచ్చావ్ ?"

"నువ్వు లక్షాధికారివి. ప్రస్తుతం నేను భిక్షాధికారిని. ఇందాకే వచ్చాను బావా. హాల్లో నలుగురెదటా అడగటం ఎందుకులే అనుకుని చక్కా గదిలో కొచ్చేశా"

"సోది కట్టిపెట్టవ్వే."

"సూటిగానే చెబుతా బావా. మన ప్లానంతా తయారై పోయింది ఇంకో అయిదువేలు తక్కువయింది. అదిచ్చావా, ఆపైన నీ ఇంటికి లారీ మీదనే తోలుకొస్తా బంగారం మూటల్ని."

"ఆపవోయి అపు. ఈ బంగారం పిచ్చితో నీ తండ్రి నాశనమయ్యాడు. లక్షలాస్తిని నువ్వు నాశనం చేశావు. నా దగ్గర వేలకు వేలు పట్టుకుపోయి కాకమ్మపై తిరుగుతున్నావు. ఉహూ నీకు దమ్మిడీ కూడ ఇవ్వను"

"దమ్మిడీ ఇస్తే నేను పుచ్చుకుంటాను బావా. రేపు బంగారం తయారయ్యాక పద్నాలుగంతస్థుల మేడ కట్టిస్తే ఇవాళ నవ్విన వాళ్లే రేపు నోరెత్తి లేత్తుతారు. ఐదువేలు చాలు బావా."

"శివం! మాటన్నానంటే అంతే! మీ అక్క పోయిన నాడే నిన్నూ వదలుకున్నా. ఐనా చెబుతున్నా విను. ఈ పిచ్చి వేషాలు మానేయ్. ఇక్కడే ఉండు రాజాలాగ తిని మహారాజులాగా బ్రతుకు. నా వ్యాపారం చూస్తుండు. అల్లుణ్ణి చూసుకో అంతే కాని—"

"ఐదువే లివ్వనంటావా ?"

"ఏం ? బెదిరిస్తున్నావా ?"

"అందాకా ఎందుకు బావా ? నీవు ఇవ్వకా తప్పదు. నేను తీసుకుపోకా తప్పదు."

"అరచి గీపెట్టినా దమ్మిడీ ఇవ్వను ఉంటే ఉండు పోతే పో"

"పోతే ఆలోచించుకో నీ లక్షలకి నేను వారసుడ్ని నాకు ఆ అల్లుడు వారసుడు నువ్వు రూపాయులే సంపాదించావ్ నేను బంగారం సంపాదించా. నీ డబ్బు ఎలా రాదో చూస్తాగా. నా సంగతి తెలుసుగా."

"తెలుసులే పో"

. . . . . . . . . . .

"బాబూ! మళ్ళా . . . ."

"పాతపాటే నీకు తెలిందేముంది సీతయ్య' ఈ శివం నాపాలిట నరకంగా తయారవుతున్నాడు'!

"బాబూ! సేట్ వచ్చాడు. వెళదాం రండి"

"పద"

ఈ సన్నివేశం రవీంద్రా ఆర్ట్సు ప్రొడక్షన్సు వారి "లక్షాధికారి" చిత్రంలోనిది. ఈ చిత్రంలో నాగయ్య, మిక్కిలినేని, కె. వి. యస్ శర్మ కృష్ణకుమారి, గిరిజ, సూర్యకాంతం మొదలగువారున్నారు., మాటలు . నార్ల చిరంజీవి, పాటలు : కొసరాజు, పి. నారాయణరెడ్డి, ఆరుద్ర, ఛాయ : పి. నాగేశ్వరరావు : సంగీతం : టి. చలపతిరావు, కళ : కృష్ణారావు, నృత్యం : చిన్ని సంపత్, కూర్పు : సంజీవి, దర్శకుడు · వి మధుసూధనరావు, నిర్మాతలు డి వి రెడ్డి, తమ్మారెడ్డి, కృష్ణమూర్తి, అసోసియేట్ దర్శకుడు . పి. సి రెడ్డి



నా మరిహాపాలు 13



'లక్షాధికారి'లో కృష్ణకుమారి.

## సెట్టుమీద "కలవారికోడలు"

ఆనంద్, శంకర్‌లు చిన్ననాటి నుండి స్నేహితులు. ఒకర్ని ఒకరు విడువకుండా ఉన్నారు. ఆప్త మిత్రులై మెలగుతున్నారు. సంగీత శాస్త్రజ్ఞాని యైన శంకర్‌కు తల్లిదండ్రులు లేనందునవలన ఏకైక సోదరి లత భారం తనపై పడింది. ఆ విధంగానే శంకర్ ఆకస్మిక మరణం వలన లత భారం ఆనంద్ ఆనందంగా స్వీకరిస్తాడు. ఆనంద్ ఇంట్లోనే లతను ఉంచుతాడు. ఈ విషయం గమనించిన ఆనంద్ భార్య రాణి శంకించి ఒక రోజు తన పుట్టింటికి వెళ్తుంది. లత తెలుసుకుంటుంది. బాధ పడుతుంది. ఆనంద్‌తో— మీరు చేతులతోను, మాటలతోను ఎంతో ఋందిని ఆరోగ్యవంతుల్ని చేసి ఆనందపరుస్తున్నారు. ఒక్క స్త్రీ మీద మీకు ఎందుకు కనికరం లేదు. స్త్రీ హృదయం మీకు అర్థంకాదు. నావలన ఒక కుటుంబంలో కలతలు రావడం మంచిదికాదు. మీరు వెళ్ళి రాణిని తీసుకురండని ప్రాధేయ పడుతుంది. ఆనంద్ సతమత మవుతాడు. విధిలేక రాణిని తీసుకు రావడానికి బయలు దేరుతాడు. ప్రక్క గదిలో ఉండి విన్న ఆనంద్ తల్లి రాజ్యలక్ష్మి లత దగ్గరకు వచ్చి ఇంటి గౌరవము, మానవ మర్యాదలు కాపాడావమ్మా అంటూ అభినందిస్తుంది.

ఆనంద్ రాణిని తీసుకు వస్తాడు. కాని ఒక రోజు లత తలుపు మెల్లిగా తీయగా, బయట నుండి అప్పుడే కారుదిగి ఆనంద్ ఎదురవుతాడు.

"లతా ఎక్కడికి ప్రయాణం ?"

"........"

"ఎందుకిలా చీకటిలో వెళ్ళాలని ప్రయత్నిస్తున్నావ్ ?"

"ఆనంద్‌బాబూ ! నా జీవితమే చీకటి. నాకు తెలుసును ప్రవర్తించాలని ఎవరు ఎంత ప్రయత్నించినా ప్రయోజనంలేదు పుట్టగానే తల్లిదండ్రులను కోల్పోయాను జాలి తలచి నాకు నీడ కల్పించాలనుకున్న మీకు ప్రతిక్షణం బాధ కలిగిస్తున్నాను నా దౌర్భాగ్యం నాతోనే ఉండనీయండి నన్ను వెళ్లనివ్వండి"

"లతా ! దౌర్భాగ్యం నీదికాదు లతా, నాదే— ప్రాణ స్నేహిత ప్రాణాలు కాపాడుకోలేక పోయాను నిస్సహాయస్థితిలో నిన్ను ఇలా ఒంటరిగా వదలి పెడితే, ఇక నా జీవితానికి విలువేముంది ?"

"మీరలా బాధ పడవద్దు ఒక దీపం వెలిగించడానికి మరొక దీపం ఆరిపోకూడదు నా కారణంగా మీ సంసారంలో కలతలు, కలహాలు చెలరేగడం నేను సహించలేను నన్ను వెళ్ల నివ్వండి"

"నీలాంటి అభిమానవతి అవమానాలు భరిస్తూ ఇక్కడ ఉండటం ఎంత కష్టంగా ఉంటుందో నాకు తెలుసు నిన్ను ఇక్కడే ఉండమని అడిగే అర్హత నాకు లేదు లతా నువ్విలా వెళ్లిపోతే అమ్మ ఎంత బాధపడుతుందో ఆలోచించు కనీసం నీ గొంతు బాగుపడేవరకైనా ఇక్కడ ఉండు తరువాత నీ ఇష్టం వచ్చినట్లే నిర్ణయించుకో వచ్చు"

" . . . "

"సందేహించకు, పద"

ఈ సన్నివేశం రఘురాం ఫిలింస్ వారి తాజా చిత్రం "కలవారి కోడలు" లోనిది ఈ చిత్రంలో రామారావు, ప్రభాకరరెడ్డి, చలం, రమణారెడ్డి, పద్మనాభం, నూతన నటుడు శ్యామలరావు బి ఏ (ఈ చిత్రంలో చెర్ఫ్ ఫాదర్‌గా నిర్మాతలు ఇతనిని పరిచయం చేస్తున్నారు.) కృష్ణకుమారి, గిరిజ, మణి, సూర్యకాంతం, హేమలత, బేబీలత, మొదలగువారు నటిస్తున్నారు.

సి. ధర్మారావు. ★

# 'మరువలేని మనిషి'

రచన : నిరూపరాయ్.



పాఠకులకు నా శుభాకాంక్షలు.

**నటికి అందులోనూ ఒకని ఆలిగా, పిల్లలకు తల్లిగా ధర్మం నిర్వహిస్తున్నప్పుడు ఆమెకు చిత్రాలు**

విజయం పొందటమే గొప్ప విశేషం కాదు. మగనాలిగా, బిడ్డల తల్లిగా తన ధర్మాన్ని, బాధ్యతలను గుర్తెరిగి నిర్వర్తించినప్పుడే కావలసిన తృప్తి దొరుకుతుంది.

ఇదంతా ఎందుకు చెప్తున్నట్టూ — అనే అనుమానం కలగవచ్చు. నేనూ నటినే. అందులోను ఒకరికి భార్యగా, బిడ్డకు తల్లిగా నా ధర్మం నిర్వహించవలసినదాన్ని గూడా. కాని నా శ్రద్ధలో ఎక్కువ పాలు నా బిడ్డమీదనే ఉంటుంది.

సాంసారిక జీవితం భూతల స్వర్గంగా ఆనందమయంగా చేసుకోవట మనేది చాలా ప్రయత్నం మీద కూడా సాధ్యం కానిదన్న విషయాన్ని ప్రతి తల్లి అంగీకరిస్తుందనుకుంటా. వాస్తవంలోకన్న ఆ సుఖాన్ని వూహిస్తూ కలలు కంటమే తేలికేమో! జీవితాన్ని సుఖప్రదం చేసుకోవాలంటే ప్రతి తల్లి ఎంతో కృషిచేయాల్సి ఉంటుంది. అంతమాత్రం చేతకూడా మహాకాళి మంత్రజపంలోలాగా ముఖం సిద్ధించదు. దైనందిన జీవితంలోని కార్యకలాపాల విషయంలో తగిన ఆసక్తి చూపినప్పుడే అది సిద్ధిస్తుంది.

'గృహ స్వర్గసీమ' ను సాధించాలంటే ప్రతి స్త్రీ తల్లిగా ఎన్నిటినో కోర్కెలను వీడ్కొలుకోవాల్సి ఉంటుంది. ఆ సాధన లేనినాడు కలిగే ఆనందం ఏదైనా అది కృత్రిమమే.

భార్యగా, తల్లిగా నా ధర్మాన్ని నిర్వహించటానికి గర్విస్తా కూడా. ఆ బాధ్యతలు వహించవడ్డందుకు ఎంతో ఆనందిస్తా.

ఆఁ. ఆగండిక్కడ ! అసలు విషయానికి అమిత దూరం పోతున్నదేమో అనుకుంటున్నారు కదూ ! కాని నా మనస్సులో మాటపూర్తిగా చెప్పకపోతే నే మరువలేని మనిషెవరో అర్థంకాదు మీకు. అబ్బ ! ఎప్పుడూ లేనిపోని ఈ ఇంటి గొడవేనా అనుకుంటున్నారేమో కాని నాకు మాత్రం ఆ విషయం చెప్పకతప్పదు.

నాకు నా పిల్లల్ని సరిచూసుకోవటంతోటే సరిపోతుంది. అందులోనే నాకు ఆనందముంది. ఇంకా నేను మరువలేని మనిషెవరో ఆలోచించే అవకాశమే కలగదు.

అయితే నువ్వు నటివిగదా అని అడగవచ్చు. గృహిణిగా నా ధర్మంతో పోల్చి చూస్తే నటి కర్తవ్యం జ్ఞాపకానికూడా రాదు. నేను తల్లిని గనుక బిడ్డలను గూర్చి దన్నా కొట్టుకుంటున్నాని

## మరువలేని మనిషి

అనుకోవద్దు. తల్లిగా నా అనుభవాలను విని మీరే నిర్ణయించుకోండి :

చిత్రాల్లో పాల్గొని చెప్పలేని బడలికతో, వర వరాలు విరిగిపోతున్నంత బాధతో ఇంటికొచ్చిన రోజులు చాలా ఉన్నాయి అంతటి బాధా కూడా ఇంట్లో అడుగు పెట్టగానే మాయమై పోయి ఓ రకమైన ఆనందం, ఉత్సాహం నన్నావరించేవి. ఇంత మాయగా ఇలా మాయం కావటానికి కారణ మేమిటన్న ఆలోచన నాలో కలిగి కలిగి చివరికో నిర్ణయానికొచ్చాను అందాలు చిందుతూ అమాయ కత్వ మొలికిస్తూ మా బాబు నవ్వే చిరునవ్వే నామీద మంత్రంగా పనిచేసేది నా బాధలన్నీ కలలో మాదిరిగా కరిగిపోయేవి.

మరి నేను షూటింగుకు వెళ్ళేటప్పుడు వీణ్ణి తీసుకువెళ్ళే వీల్లేదు అప్పుడు నా ఆస్తంతా ఇంట్లో ఏ మూలో ఉన్నట్లనిపిస్తుంది.

ఇంతకన్న ఎక్కువ చెప్పేందుకేంలేదు. కాని ఇంత ఆనందంగా జీవితం గడవటానికి అందమైన పాప కలిగినందుకు నా అదృష్టానికి నేనే పొంగిపో తుంటాను.

అయితే ఈ మరువలేని మనిషిని కన్న నే నొకతినే అదృష్టవంతురాల్ని కాదు ప్రతి పాపా ఒక మరువ లేని మనిషే. ప్రతి తల్లీ ఓ అదృష్టవంతురాలే. అలాంటి అదృష్టవే కలకాలం ప్రతి స్త్రీకి కలగాలనే నా కోరిక. ★

## 16-8-63 సంచికలోని 'బొమ్మల నుడికట్టు' జవాబులు

**అడ్డం :**

1. భారతదేశము
5 విత్తనము
7 దినములు
9. చిత్త
11 ముమ
12 కుచేలుడు
14 ములుకోల
15. భాగ్యనగరము

**నిలువు :**

1 'భాగ్యవిధాత'
2. దేహము
3 ముప్పది
4 రుమాలు
6 నక్షత్రములు
8. నత్తగుల్లలు
10 హిమాలయము
11. చేను
12 కువ్వలు
13. భానుడు
14. నమము

# రాజధాని కబుర్లు

7— వ పేజీ తరువాయి

నగరాలతో సహా చదువుకున్న వారి సంఖ్యలో ప్రథమ స్థానం అలంకరిస్తోంది. నూటికి ముప్పయి అయిదు మంది దాకా అక్షరాస్యులున్నారు. జనాభాలో మన దేశం మొత్తంమీద నాలుగో రాష్ట్రం యూరప్ ఖండంలో ఉన్న దేశాలన్నిటికంటె కూడా మన రాష్ట్రం, ఈ విషయంలో మాత్రం, ఆధిక్యత సంపాదించుకుంది. స్త్రీ జనాభా కంటె పురుషులే ఎక్కువగా ఉన్నారు. బిచ్చగాళ్ల విహార యాత్రను నిషేధిస్తూ, వచ్చే అక్టోబరు నుంచి ఓ చట్టం అమలులోకి రాబోతోంది. ముందెప్పుడో గాని, ఈ బెడద మరింత తీవ్రంగా పరిణమిస్తోంది. పై పెచ్చు, అలాంటి చట్టం, రాజ్యాంగ సూత్రాలకు విరుద్ధమని, ప్రాథమిక హక్కులను భంగపరుస్తోందని ఓ బిచ్చగాడు అన్నాడుట.

ఇవిట్లా ఉంచుతే, కొన్ని ముఖ్యమైన సంఘటనలు, ఉద్ఘాటనలు కూడా జరిగినాయి. మహిళలు, పురుషులతో, అన్నిరంగాల్లోనూ పోటీ పడుతున్నారు. కాని ఏ ఆఫీసూ కూడా ప్రత్యేకంగా మహిళలే నడుపుతున్న వార్త మాత్రం ఇంత వరకు అందరికీ అందక పోవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లో ప్రప్రథమంగా కేవలం స్త్రీలచేత నడిపే బ్యాంకు ఒకటి చిక్కడపల్లిలో తెరిచారు. అయితే పురుషులు కూడా, డబ్బుంటే, ఖాతాలు పెట్టుకోవచ్చు. ఆంధ్ర, తెలంగాణాలో విడివిడిగా పనిచేస్తున్న కేంద్ర సహకార బ్యాంకు విలీనీకరణ జరిగింది. రాష్ట్రం మొత్తానికి ఆంధ్రప్రదేశ్ స్టేట్ కోఆపరేటివ్ బ్యాంకు పేరుతో నూతన బ్యాంకు ఆవిర్భవించింది. అదివరకు మాదిరిగానే వ్యవసాయదారులకు రకరకాల తీరులుగా, అప్పులు ఇస్తూ, వ్యవసాయాభివృద్ధికీ, సహకారోద్యమాభివృద్ధికీ, కృషి చేస్తూనే ఉంటుంది ప్రఖ్యాత జర్మన్ వేదాంతి మాక్స్ముల్లర్ పేరన సుల్తాన్ బజార్ దగ్గర భవనాన్ని, గవర్నర్‌గారు తెరిచారు. సాంప్రదాయపు ఉపన్యాసాలతో ఈ ఉత్సవం ముగిసింది. భారత రిపబ్లిక్ అధ్యక్షులు డాక్టర్ రాధాకృష్ణ గారు, ఉస్మానియా విశ్వ విద్యాలయపు గ్రంథాలయ భవనాన్ని ఆవిష్కరించారు. పదమూడు లక్షల రూపాయలతో నిర్మించబడ్డ ఈ కొత్త కట్టడంలో రకరకాల పుస్తకాలు చేర్చబడ్డాయి.

అసెంబ్లీలో ఈ సారి కొన్ని ముఖ్యమైన బిల్లులు కూడా చట్టరూపాన్ని దాల్చాయి. వ్యవసాయేతర భూముల పన్ను బిల్లుకు ఆమోదం వచ్చింది. పట్టణ ప్రాంతాలలోని పారిశ్రామిక, వ్యాపార, నివాస ప్రయోజనాలకు ఉపయోగిస్తున్న భూములపై, భూమిశిస్తుకు బదులుగా ఈ పన్ను వచ్చి పడిందన్న మాట. సాధారణ అమ్మకం పన్ను (సవరణ) బిల్లు మీద చర్చలు బాగానే సాగినాయి. చాలా మంది సభ్యులు ఎన్నో విమర్శలు గుప్పించారు పాస్‌బుక్స్ మీద పన్ను మినహాయింపు చేస్తామనే హామీతో తక్షణం ఈ బిల్లు, చట్టంగా మారి

వచ్చే వారమే!

# 'మరువలేని మనిషి'

రచన: గురుదత్



పోయింది. కిరసనాయిలు మీద కూడా ఈ పన్ను బాగానేఉంది. అమ్మకం పన్ను ఎగవేతకు శిక్ష కూడా. భారీగానే విధించటానికి అధికారాలు సంక్రమించి నాయి. అయితే కొత్తగా పన్నులంటూ యేమీ వెయ్యటంలేదు గాని, ఉన్నవాటినే అటూ ఇటూ సర్దుబాటు చేయుట మయింది.

జస్టిస్ టేక్‌చంద్ అధ్యక్షతన నియమింప బడిన 'స్టడీ టీమ్' హైదరాబాదుకు వచ్చింది. దొంగచాటుగా సారాయి తయారీ ఏ మాత్రం అవుతోంది. దానిని అరికట్టటానికి ఎలాంటి చర్యలు తీసుకోవాలి. మద్య నిషేధ చట్టం అమ లులో సాధక బాధకాలు యేమిటి, ఇత్యాధి విష యాల సేకరణకు దేశమంతా పర్యటన చేస్తు న్నారు. ఈ చట్టాన్ని అమలు చేయుటానికి తీవ్ర మైన చర్యలు తీసుకోవాలని, తాగుడు వలన కలిగే హాని, యొక్క తీవ్రతను, సామాన్యానికి అర్థ మయ్యేలాగున తగినంతగా ప్రచారం చెయ్యాలని కొంతమంది అభిప్రాయం. మరి కొంతమంది అవుతే, అసలు ఈ చట్టాన్నే రద్దు చెయ్యాలి, చట్టం యొక్క ముఖ్యోద్దేశాన్ని అమలు చేయటం చేతకాని పక్షంలో, దీన్నింకా ఉంచటం, హాస్యా స్పదం అంటున్నారు. ఏమైనా, ఈ సంవత్సరం ఆఖరికి, వీరి పర్యవేక్షణ పూర్తి కావటం, రిపోర్ట్ ఇవ్వటం జరిగి పోతుంది ఇక ప్రభుత్వం వారు ఎలాంటి నిర్ణయాలు తీసుకుంటారో చూడాలసి ఉంటుంది.

అశక్తత అనేకరకాలు. అధికారాలు లేనివాడు. ఇతరత్రా కావలసిన 'సపోర్ట్' లేనివాడు, యేపనైనా చెయ్యటానికి వెనకాడవచ్చు. ధైర్యం కూడా ఉండక పోవచ్చు. అన్నీ ఉన్నా కూడా కొన్ని పరిస్థితుల్లో యేమీ చెయ్యలేని పరిస్థితిల్లోనే ఉండిపోవలసి వస్తుంది. అలాంటి పరిస్థితులు ఈ మధ్య ఒకటి రెండు అందరి దృష్టినీ ఆకర్షించి నాయి. విశాల హైదరాబాదులో క్లబ్బుల పేరుతో కొన్ని గృహాలు ఈ వివిధమైన అవినీతి చర్యలకు ఆలవాలమై ఉన్నాయన్న సంగతి ఇక్కడ ప్రజకు విదితమే! ప్రభుత్వానికీ తెలుసు. అయితే ఎలాంటి చర్య తీసుకోలేని దుస్థితిలో ప్రభుత్వంవారు ఉండిపోయారు. అవి 'జూదపు గృహాలు' నిర్వచనం క్రిందకు వస్తేనే, ప్రభుత్వంవారి జోక్యానికి అధి కారం ఉంటుందిట. అందులకే కొన్ని అలాంటి 'గృహాల్లో' సాగిపోతున్న అక్రమాల పట్ల, ప్రభు త్వం వారు మూకీభావం వహించాలసి వస్తోందని, ముఖ్యమంత్రిగారు అన్నారు. ఇక రెండో విషయం. కులాలవారిగా వెనకబడిన తనాన్ని నిర్ణయించటం, దాని మీద ప్రత్యేకమైన సదుపాయాలు ఇవ్వటం, వలానా కులంలో పుట్టలేదు కాబట్టి, అతను గర్భ దరిద్రుడైనప్పటికీ, అతనికి ఈ అవకాశాలు ఇవ్వకపోవటం వింతగా తోస్తోందని, ముఖ్యమంత్రి గా రన్నారు. కాని ఈ విషయాలలో వారు యేమీ చెయ్యలేని అశక్తతలోనే ఉండి పోయారు. కేంద్ర ప్రభుత్వం వారు కూడా ఆర్థిక స్తోమతలమీద వెనకబడిన తనాన్ని నిర్ణయిస్తూ, తగు ప్రోత్సాహం

# రాజధాని కబుర్లు

ఇవ్వాలని, నిర్ణయించారు. ఆ విధంగానే, రాష్ట్రాలు కూడా అమలు చెయ్యాలని సలహా ఇచ్చారు. సమాజంలో తరతరాల్నుంచి అట్టడుగున ఉండిపోయి, వెలుగును చూడకుండా, చీకట్లోనే శాశ్వతంగా ఉండిపోయిన జాతి ఉద్ధరణకు మహాత్ముడు, మార్గదర్శకుడై సర్వమానవ సౌభ్రాతృత్వానికి, చక్కని బాట చూపించారు. అస మానత్వాన్ని రూపుమాపి అందరం ఒక్కుమ్మడిగా, దేశసౌభాగ్యానికి కృషిచెయ్యాలి. ఈ విధంగానే ఆర్థిక అసమానత్వాలను కూడా రూపుమాపి, అందరికీ అన్ని విధాల సౌకర్యాలు అందుబాటులో ఉండే టట్లు చూడాలసిన బాధ్యత కూడా ఉంది. అందు వల్లనే ఆర్థిక స్థితి ఆసరాగా చేసుకుని సదుపాయాలు కలుగ చేయాలి అన్న కేంద్ర ప్రభుత్వ నిర్ణయం హర్షనీయమైనా, అదివరలో కులాల ప్రాతిపది కగా ఇస్తున్న ప్రత్యేక సదుపాయాలకు ఈ పద్ధతి విరుద్ధం కాదని, రాజ్యాంగంలో పొందు పరిచిన ప్రకారం ప్రత్యేక హక్కులు పొందటానికి యోగ్యత కల వర్గానికి ఇది అంతరాయం కలిగించ దని, ప్రభుత్వంవారు స్పష్టం చెయ్యాలసిన బాధ్యత ఉంది.

* * *

'రవీంద్ర భారతి' బొత్తిగా తీరుబడి లేకుండా పోతోంది. రాజధానిలో భారీ యెత్తున కట్టిన యీ కట్టడాన్ని అనేక ఔత్సాహిక నాటక బృందాలు, ఇతర సంస్థలు దూర ప్రాంతాల్నుంచి కూడా వచ్చి, ఇక్కడ ప్రదర్శనలిచ్చి ప్రేక్షకుల్ని ఆనందపరుస్తున్నారు. మరాఠీ మాతృకకు, తెలుగు అనువాదం చేసిన శ్రీ ఎన్. జగన్నాథ్ గారి 'జై భవానీ' నాటక ప్రదర్శనం జరిగింది. భారత రిప బ్లిక్ అధ్యక్షులు డాక్టర్ రాధాకృష్ణగారు ఈ నాట కాన్ని సందర్శించటానికి వచ్చి కూర్చున్నారు. రాజ మండ్రి రాఘవ కళా సమితివారు డాక్టరు జి. రాజా రావుగారి దర్శకత్వంలో ప్రదర్శించిన ఈ నాటకం అత్యుత్తమమైన స్థాయిలో నడిచింది. ఛత్రపతి శివాజీ చరిత్ర ఆధారంగా రచింపబడ్డ యీ నాటక ప్రదర్శన, ఈనాటి అత్యయిక పరిస్థితుల్లో ఎంతో సముచితంగాను, సందర్భోచితంగానూ ఉంది. నటీనట వర్గం అంతా కూడా కలిసి కట్టుగా పనిచేసి నాటకాన్ని రక్తి కట్టేటట్టు చేశారు. ఇందులో కొంతమంది నటీనటులు, సినిమా కళా కారులు కూడాను. మహారాష్ట్ర దేశంలో ఆనాడు జరిగిన స్వాతంత్ర్యోద్యమంలో మహారాష్ట్రులే కొంతమంది దేశద్రోహులై శత్రువుల పక్షం చేరి, దేశాన్ని అమ్మటానికి చేసిన కుట్రలు, పన్నాగాలు కుటిల నీతి, రాజకీయపు యెత్తులు అన్నింటికి మించిన శివాజీ ధైర్య సాహసాలు, ఈ యితి వృత్తంలో ఛాయా మాత్రంగా ప్రదర్శింప బడ్డాయి.

మూడు గంటల కాల పరిమితిలో అన్ని విషయాలు సుస్పష్టంగా ప్రదర్శన జరిగేటట్లు చేసిన మరాఠీ రచయిత శ్రీ మమా వరేర్కర్ కళా నైపుణ్యం ప్రశంసనీయము. హిరోజీ పాత్ర ధరించిన బి. ఎస్. బాబు యువరకానికి ప్రతి బింబంగా, కర్తవ్య పరాయణత్వం మూర్తీభవిస్తూ, మాతృదేశ గౌరవాన్ని నిలబెట్టాలనే దృఢ కంక ణంతో దేశభక్తి ప్రబోధితుడైన, నిష్కళంకమైన, నిజాతి అయిన, నిసలైన భారతీయునిలాగ సాక్షాత్క రించాడు. అతని హావభావాల్లో, పదోచ్చరణలో, నడకలో, కదలికలో, గాంభీర్యం, స్థయిర్యం, ఆత్మ విశ్వాసం ఉట్టిపడుతూ ప్రేక్షక జనాన్ని ఉద్రూత లూగించాడు. నాటకంలో ఆ పాత్ర ఎంత ఉదాత్త మైనదో నటనలో అంత స్థాయిని అతను అందు కున్నాడు. నటనా కౌశలంలో విశేషాన్ని ప్రదర్శించిన ఈ యువకుడు ఆదర్శమైన ఇంకా అనేక పాత్ర లలో బాగా రాణించగలడు. ఉజ్జ్వల భవిష్యత్తు ఉందనటంలోనూ సంశయం లేదు. కాని బహు ళంగా అవకాశాలు మాత్రం రావాలి. ఇక గజరా పాత్ర ధరించిన కుమారి రత్నకుమారి, ప్రప్రథ మంగా వీణను మీటుతూ గానాలాపన చేస్తూ అతి నాజూకుగాను, భర్త రాకకు బెదిరిన చూపులతో భయాందోళనలతోను నిరీక్షిస్తున్నట్టు కనబడింది. రామరాను సమస్యల కత్తెరలలో పత్తుకునిపోయి భర్తమీద ప్రేమ, దేశంమీద భక్తి మధ్య నలిగి అయి మాతృదేశ గౌరవాన్ని నిలబెట్టటానికి, భారత నారీ ఏ త్యాగానైనా చెయ్యటానికి సంసిద్ధమని నిరూపించింది. ఆమె నిటారుగా నిలబడి బాజీ ప్రభువుకు సమాధానం చెప్పుతున్నప్పుడు, వాడి కత్తి గుండెల్లో దూసుకుపోయినట్లు, సూర్య కిరణం కళ్లల్లో గుచ్చుకు పోయినట్టు అనిపి స్తుంది. చిన్న ప్రవాహంలాగ ప్రారంభమయిన ఆమె నడక, ఉరుకులు, పరుగులతో తురుగులు తొక్కుకుంటూ, పొంగి పొరలే సెలయేరులాగ కళ్లను మిరుమిట్లు గొలుపుతూ చిరకు దారుణ, భీషణ మహోదధి ఘోషలాగ ప్రేక్షక జనాన్ని తబ్బిబ్బులు చేసేసింది, ఆమె నటన అమోఘం. ఈమె గొంతుకకు తగ్గట్టుగా నేపథ్యంలో పాటలు పాడిన కుమారి వసంత కంఠం ఈమె నటనకు ఇంకా రాణింపు యిచ్చింది.

—బి. ఎల్. ఎస్. ★



".. ఇదేంటి బాబూ! అంత చదువూ చదువుకొని ఈ సంగీతం పెట్టె పుచ్చుకొని హరిదాసులా ఊరంతా తిరుగుతున్నావు!!!"

# న్యూఢిల్లీ లేఖ

9—వ పేజీ తరువాయి

శ్రీ పాటిల్ కాలంలో దేశంలో కావాల్సినంత ఆహార ధాన్యం నిల్వ లున్నప్పుడు శ్రీ పాటిల్ కంట్రోళ్ళను వ్యతిరేకించటం న్యాయమే అవుతుంది.

శ్రీ గుల్జారీలాల్ పోటమికి సిద్ధంగా ఉన్నారు. ఆయన పథకాలవల్లనే ఈ దేశానికి తృతీయ ప్రణాళిక అంటూ ఒకటి దాపరించడం, దాని మూలంగా దేశంలో భరించరాని పన్నులు పడటం జరిగింది. రైలు ఛార్జీలు, రవాణా ఛార్జీలు, తంతి, తపాలా ఛార్జీలు ఒకటేమిటి, బొగ్గు, సిమ్మెంట్ వగైరా వగైరాల ఛార్జీలు కూడా విపరీతంగా పెరిగాయి. ఈ పెరుగుదల జాడ్యానికి శ్రీ గుల్జారీలాల్ దగ్గర ఒక్కటే మందుంది. సహకార సంస్థలు చౌక ధరల దుకాణాలు ప్రారంభించటం. అంటే ధాన్య వ్యాపార్లను మాయం చేసేస్తా రన్నమాట. లోగడ ఈ ధాన్య వ్యాపారులే బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ధనం మదుపుపెట్టి వాళ్ళను మన దేశంనుంచే పంపిం చేందుకు పరోక్షంగా కారకులయ్యారు. సాధారణ ఎన్నికల్లో నిలదొక్కుకోవాలంటే నిధులకోసం వెతికే పార్టీకి చెందిన శ్రీ గుల్జారీలాల్ నందా పై విషయాన్ని గుణపాఠంగా స్వీకరిస్తే బాగుంటుంది. ఇటు పంచాయతీ రాజ్ లు, అటు సహకార సంస్థలూ డబ్బిచ్చే పేష్షికావు. రాజకీయం దృష్ట్యా పరిశీలిస్తే, శ్రీ పాటిల్ కంట్రోళ్ళను వ్యతిరేకించటం చాలా దూరాలోచనతో చేసిన పని అనిపిస్తుంది. పద్ధతివారీ పెట్టుబడి విధానానికి, కమ్యూనిజానికి మధ్యేమార్గమంటూ లేదనే పాటిల్ చెప్పేది. ఏమైతేనేం. ఇప్పటికి శ్రీ పాటిల్ దే పై చెయ్యి.

* * *

మైసూరు ప్రభుత్వ అభ్యర్థనమీద 'నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఇకనామిక్ రిసర్చి' సంస్థ మైసూరులోని లఘు పరిశ్రమల గూర్చి పరిశోధన జరిపింది.

ఈ రాష్ట్ర లఘు పరిశ్రమ లన్నిటిలోనూ ముఖ్యమైంది వస్త్ర పరిశ్రమ తర్వాత చెప్పుకోదగ్గవి, వ్యవసాయం, ఇంజనీరింగ్, అడవి, రసాయనిక, ఖనిజ సంబంధమైన ఉత్పత్తులు, గ్రామీణ పరిశ్రమలు, చేతి పనులు.

ఈ పరిశోధనలవల్ల వ్యవసాయం, పశు సంపద చేపలు, అడవులు వీటిపైన ఆధారపడిన లఘు పరిశ్రమలలో చిన్న చిన్న యూనిట్లు అధిక్యంగా పెంపొందే అవకాశం ఉందని తేలింది. బియ్యం వేరుసెనగ, తదితర నూనె గింజలు, కాఫీ, చెరకు, ప్రత్తి ఉత్పత్తులను అధికతరం చేసేందుకు చాలా కర్మాగారాలు కావాల్సి ఉంటుంది పరికరాల మార్పులు, మరామతు వగైరాలు చేసేందుకు అలాంటిఉద్యోగాలు కల్పించేందుకు చిన్న చిన్న ఇంజనీరింగ్ సంస్థలు కూడా అవసరమౌతాయి. పైన చెప్పిన ఎకనామిక్ రిసర్చి సంస్థ వరి ఊక చిట్టు నుండి నూనె తయారు చేసేందుకు వీలుగా పరిశుభ్ర పరచటం, ప్రోపుడు పత్తి వినియోగం, మామూలు పత్తిని అస్పత్రులలో ఉపయోగించే దూదిగా తయారు చెయ్యటం, మామిడి, పరుగు తయారు చేయుటం, పి డిపాలతో పెరుగు తయారీ. మామిడి రసం తయారు, ఇంకా ఉద్యానాభివృద్ధి, ఎముక ఎరువుల ఉత్పత్తిలకు సహకార పథకమూ, ఏర్పరచవలసిందిగా సలహా ఇచ్చింది. అంతే కాక, ఈ రాష్ట్రంలో తోళ్ళ పదును పరిశ్రమ అభివృద్ధి తక్కువగా ఉన్నందున సుమారు ఓ 20—25 చిన్న చిన్న సంస్థలను నెలకొల్పాల్సిందని సూచించింది. పదునైన తోళ్ళ ఉత్పత్తి, గోదు, ఉన్ని, గ్రీస్, లానోలిన్ల ఉత్పత్తికి గల అవకాశాలను పేర్కొనటం జరిగింది. చేపనూనె, చేప మాంసం తయారీ కర్మాగారాన్ని చేపగొదు తయారీకి ఇంకో కర్మాగారాన్ని వెంటనే నెలకొల్ప వలసిందని పరిశోధక సంస్థ సలహా ఇచ్చింది. ఇక అడవులకు సంబంధించినంతవరకు, కలప నిలవ కేంద్రాలు రెండు, ఒకటి హుబ్లిలోనూ, రెండోది మైసూరులోను నెలకొల్పాల్సిందని సిఫార్సు చేసింది.

పరిమితవాడకంగల ప్రత్యేక రకమైన సబ్బుల తయారు చేసేట్లుగా సబ్బు ఉత్పత్తి సంస్థలను ప్రభుత్వం ప్రోత్సహించాల్సిందిగా సలహా ఇచ్చింది. నూరు పౌన్ల ఉత్పత్తి శక్తిగల కర్మాగారాన్నొక దాన్ని సున్నితమైన రసాయనిక ద్రవ్యాలు తయారీకి, క్రియోసోట్ ఎమల్షన్లు, అంటు వ్యాధి నిరోధక వస్తువులు తయారీకి నాలుగు కర్మాగారాలు, నెలకొల్పవలసిందిగాను, నిమ్మగడ్డి నూనె తయారీ, రంగులతయారి, బెల్టులు, సాగే గొట్టాలు, —రవాణాయంత్రాలు కుపయోగించే సాధనాలు, రబ్బరు పాలనుంచి తయారీల ఉత్పత్తి, రబ్బరు పట్టాలులాంటి రబ్బరు తయారీ వస్తువుల ఉత్పత్తి కట్టెబొగ్గు తయారీలో లభ్యమయ్యే మెథనాల్ ఉపయోగించి, ఫార్మల్ డి—హైడ్ తయారీకి భద్రావతీ దగ్గర కార్ఖానా నెలకొల్పవలసిందిగాను, అప్లయిడ్ ఇక మిక్స్ రిసర్చి సంస్థ మైసూరు ప్రభుత్వానికి చేసిన ఇతర సిఫార్సులు. ఖనిజ ఉత్పత్తుల అభివృద్ధికి తగినంత అవకాశం లేదట.

వస్త్ర పరిశ్రమ యంత్రాలకు కావలసిన విడి భాగాలు, ట్రాన్స్ఫార్మర్లు, స్టడ్లు, మూతలు, నూనె బొచ్చెలు, చైన్‌పుల్లీ బ్లాక్‌లు, తదితరమైన వాటికి సంబంధించిన అనుబంధ పారిశ్రామిక సంస్థ లెన్నో రాష్ట్రంలో ముందడుగు వేశాయి. హిందుస్తాన్ మెషీన్ టూల్స్‌లాంటి భారి పరిశ్రమలవల్ల ఈ చిన్న చిన్న పరిశ్రమలు పారిశ్రామిక నగరల్లో ఏర్పడటానికి అవకాశం దొరికింది. పని వారికి శిక్షణ గరిపేందుకు, శిక్షణ కేంద్రాలు, నెలకొల్పేందుకు ఈ అనుబంధ సంస్థలను ఓ పథకం ప్రకారం రూపొందింపజేయాలని 'నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఇకనామిక్ రిసెర్చి' సంస్థ సలహా యిచ్చింది.

* * *

ఇండియన్ ఇన్వెస్ట్‌మెంట్ సెంటర్ విదేశీ పెట్టుబడులను ఆకర్షించేందుకు కొత్త పథకాలు ప్రారంభించింది. 'పెట్టుబడులలో అపూర్వ అవకాశాలు' అనే పేరుతో ఈ సంస్థ ఇంతవరకు నాలుగు చిన్న పుస్తకాలను ప్రచురించింది. ఈ పుస్తకాల్లో ఉక్కుపోత తయారీ, బాల్ రోలర్ బేరింగ్, ఉక్కు కొలుములు ఎక్కువ శక్తి, తక్కువ శక్తి గల ఇన్సులేటర్లు మొదలగు వాటినిగూర్చిన సమాచారం వుంది. ఇవేకాక, పరిశ్రమలలో ఉపయోగించే ముద్రణా యంత్రాలు, రసాయనిక, ఇంజనీరింగ్ పరిశ్రమలను గూర్చి సమాచారం వుంది. ప్రతి పుస్తకంలోను ప్రతి పరిశ్రమకు సంబంధించిన వివిధ వివరాలు అంటే లైసెన్సులు ఎలా ఇస్తున్నారు, దిగుమతులు ఎలా ఉన్నై. ముడి సామగ్రి, పెట్టుబడివల్ల కలిగే లాభాల్లాంటివి, ఇప్పటికి ఉత్పత్తిలో ఉన్న సంస్థల పేరు, వాటి లైసెన్సులు కూడా ఈ పుస్తకాల్లో ఉన్నాయి.

* * *

విశాఖపట్నంలోని ఎరువుల ప్రాజెక్టుకుగాను ఎక్స్‌పోర్ట్, ఇంపోర్టు బాంక్ అనే అమెరికన్ సంస్థనుండి సుమారు 27 మిలియన్ల డాలర్ల (రు 1350000) ఋణం తీసుకోవాలని మద్రాసులోని పారీకంపెనీ ఏర్పాటు చేసుకున్న పథకాన్ని మన ప్రభుత్వం ఆమోదించింది. ఈ కంపెనీకి సహాయక సంస్థలుగా రెండు అమెరికన్ సంస్థలు పనిచేస్తున్నాయి. వాటికి ఇందులో 43 % ఈక్విటీ పెట్టుబడులు ఉన్నాయి. ★

మీ రాజకీయ పరిజ్ఞానం ఎంత ? కు

జవాబులు

జవాబులు : 1, 4, 5, 6, 10 ప్రశ్నలకి — అ. 2, 3, 7, 8, 9 ప్రశ్నలకి —ఆ. ఒక్కొక్క ప్రశ్నకు పది మార్కులు. నూటికి నూరు వస్తే మీ రాజకీయ పరిజ్ఞానం అసాధారణం 60—90 వచ్చిన ఫరవా లేదు, మీరు జ్ఞానులే. 30—50 మార్కులవారు తెలుసుకోవలసినది చాలా ఉంది. అంతకు తక్కువ అయితే... ★

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 &7 Thambuchetty Street Madras 1. Chief Editor S. Sambhu Prasad.



'దిల్ - ఏక్ మందిర' లో మీనాకుమారి.